అపరాధ పరిశోధన అనుబంధం—148

# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## హెచ్చరిక!

రచన: వసుంధర

## రాత్రి పన్నెండున్నర గంటలు

రచన: బొమ్మిడి అచ్చారావు

## అంతర్యుద్ధం

రచన: నీలూ

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 148
ఏప్రిల్, 1986
వెల రు. 6-50
ఏడాది చందా: 78 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
శ్యాంబాబు
ఏ. ఏ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64848

ముద్రణ:
కాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# హెచ్చరిక!

వసుంధర

కిల్లర్ మొబైల్ వ్యాన్ థియేటర్ ముందాగింది. డ్రైవింగ్ [illegible] సీట్లోంచి దిగి బుకింగ్ కౌంటర్ వైపు నడిచాడు డిటెక్టివ్ కిల్లర్. [illegible] లికలు తిరిగివుంది.

పురుషుల క్యూ చాలా పొడుగ్గా [illegible]

స్త్రీల క్యూ చాలా చిన్నదిగా వుంది.

"టికెట్లు దొరకవు—" అనుకున్నాడు కిల్లర్.

సరిగ్గా అప్పుడే ఒక యువతి అతడి పక్కకు వచ్చి చనువుగా చేయి పట్టుకుని—"టికెట్లు తీశాను. పదండి-పోదాం!" అంది.

కిల్లర్ తెల్లబోయి ఆమెవంక చూశాడు.

ఆమె కళ్ళలో అట్టే మాట్లాడవద్దన్న హెచ్చరిక ఉంది.

కిల్లర్ ఆ హెచ్చరికను పాటించి ఆమెతో థియేటర్లోకి వెళ్ళి కూర్చున్నాడు.

"మీ రెవరో నాకు తెలియదు. గత్యంతరంలేక చనువు

తీసుకున్నాను. నన్ను మన్నించండి—" అందా యువతి నెమ్మదిగా.

"మరి కాస్త వివరంగా చెప్పు—" అన్నాడు కిల్లర్.

"నా పేరు చేతన. నన్నో వ్యక్తి వెంటాడుతున్నాడు" అందామె.

"ఎందుకు?"

"అతడికి నే నేదో పని చేసి పెట్టాలిట?"

"ఏమిటా పని?"

"అతడు నాకో బ్రీఫ్ కేసు ఇస్తాడట. అది నేను తను చెప్పినచోట అందజేయాలిట...."

"అందులో తప్పేముంది?"

"అది స్మగ్లింగుకు సంబంధించిన వ్యవహారం...."

"ఎలా తెలుసు?"

ఆ యువతి మాట్లాడలేదు....

"ఎలా తెలుసు?" అడిగాడు

"చెప్పలేను—" ల్లర్.

"మిస్ ందామె.

చేతనా! అతడు నిన్నెందుకు వెంటాడాడు?"

"అంటే?"

"స్మగ్లింగ్ కు నువ్వు తప్ప ఎవ్వరూ దొరకలేదా వాళ్ళకి!"

చేతన ఏదో చెప్పబోయింది. సరిగ్గా అప్పుడే బాయ్ కిల్లర్ ని సమీపించి — "సార్! ఆయన మిమ్మల్ని పిలుస్తున్నారు—" అన్నాడు.

కిల్లర్ అటువైపు చూశాడు. చేతన కూడా అటే చూసి ఖంగారుగా—"అతడే!" అంది.

"నా టికెట్ ముక్కిలాగియ్యి—" అన్నాడు కిల్లర్.

ఆ ముక్క తీసుకుని జేబులో పెట్టుకొని అతడు లేచాడు. గుమ్మం దగ్గర నిలబడి ఉన్నాడతడు.

"ఎవరున్నవ్వు? నన్నెందుకు పిలిచావు" అన్నాడు కిల్లర్.

"కాస్త బయటకురా — చెబుతాను...." అన్నాడతడు.

ఇద్దరూ కలసి కొద్ది అడుగులు నడిచారు.

"నువ్వు నా పిల్ల పక్కన కూర్చున్నావు—" అన్నాడతడు.

"నువ్వే పిల్ల గురించి మాట్లాడుతున్నావో నాకు తెలియదు. నేను నా భార్య పక్కన కూర్చున్నాను..." అన్నాడు కిల్లర్.

"అది నీ భార్యకాదు...."

కిల్లర్ సీరియస్‌గా — "నా భార్యను అదీ యిదీ అంటే సహించను—" అన్నాడు.

అతడు మౌనంగా జేబులోంచి ఓ కాగితంతీసి కిల్లర్‌కి అందించి—"ఒకసారి చూడు—" అన్నాడు.

అందులో ఒక యువకుడి బొమ్మ ఉంది. యువకుడి గుండెలో కత్తి దిగి ఉంది. రక్తం బొటా బొటా కారుతున్నట్లు చిత్రించబడి ఉంది.

"ఏమిటిది?"

"నీకిది హెచ్చరిక!"

కిల్లర్ నవ్వి—"థాంక్స్" అన్నాడు.

"అయాం సీరియస్ —" అన్నాడతడు.

"ఇంతకీ ఎవరు నువ్వు?" అన్నాడు కిల్లర్.

"అయాం మిస్టర్ కిల్లర్!" అన్నాడతడు.

"అయితే నేనేం చేయాలి?"

"నీ జేబులోని టికెట్ ముక్క నాకిచ్చేసి వెళ్ళిపో-"

"ఇవ్వకపోతే?"

"ఏం జరుగుతుందో హెచ్చరించానుగా!"

కిల్లర్ కుడిచేతిలోని హెచ్చరిక కాగితాన్ని ఎడమ చేతిలోకి మార్చుకున్నాడు. కుడిచేతిని పాంటు జేబులోకి పోనిచ్చాడు.

అతణ్ని హెచ్చరించిన వ్యక్తి ఏం జరుగుతుందోనని చూస్తున్నాడు. తన బెదిరింపుకు కిల్లర్ భయపడి ఉంటాడని అతడనుకున్నాడు.

కిల్లర్ చేయి పాంటు జేబులోంచీ బయటకు వచ్చింది. చేతిలో త్రీ ఫైవ్స్ సిగరెట్ ప్యాకెట్ వుంది.

"డూయూ స్మోక్!" అన్నాడు కిల్లర్.

"నో!" అన్నాడతడు.

"నేనూ స్మోక్ చేయను. మిత్రులకు ఆఫర్ చేయడం కోసం ఎప్పుడూ జేబులో ఒక ప్యాకెట్టుంచుకుంటాను-" అని—"అన్నట్లు నువ్వు నాకు మిత్రుడివి కాదేమో?" అంటూ ప్యాకెట్ తిరిగి జేబులోకి తోసేశాడు.

"వేళాకోళంగా ఉందా?" అన్నాడతడు.

"అయాం సీరియస్—" అంటూ కిల్లర్ ఎడంచేతిలోని కాగితాన్ని కుడిచేతిలోనికి మార్చి అతడి కందించాడు.

"ఏమిటిది?" అన్నాడతడు.

"నీ హెచ్చరిక నీకే అందజేస్తున్నాను.." అన్నాడు కిల్లర్.

"ఎందుకే?" అన్నాడతడు కోపంగా.

"నువ్వు నన్ను హెచ్చరించావు. అది మరిచిపోవడం నీకు మంచిది. మరిచిపోలేదు—ఇప్పుడు నీ దగ్గరున్నది

నా హెచ్చరిక అవుతుంది—" అన్నాడు కిల్లర్.

"నాతో వేళాకోళం మంచిది కాదు. గుర్తుంచుకో—ఆయామ్ మే కిల్లర్!" అన్నాడతడు గంభీరంగా.

"యూ ఆర్ ఏ కిల్లర్. బట్ ఆయామ్ కిల్లర్!" అంటూ కిల్లర్ వెనుతిరిగాడు.

## 2

కిల్లర్ థియేటర్లో ప్రవేశించేసరికి చేతన పక్కన ఓ యువకుడు కూర్చుని ఉన్నాడు.

"మిస్టర్! ఈ సీటు నాది...." అన్నాడు కిల్లర్.

"కావాలంటే సీట్లు ఎక్స్ఛేంజ్ చేసుకుందాం...." అన్నాడా యువకుడు.

"నేను కావాలనను. మర్యాదగా లే!" అన్నాడు కిల్లర్.

"చేతనా! మనం అక్కడే సీట్లు ఎక్స్ఛేంజ్ చేసుకుందాం. నాతో రా...." అన్నాడా యువకుడు.

చేతన మాట్లాడకుండా లేచి నిలబడింది.

కిల్లర్ చేతన వంక చూశాడు. ఆమె కళ్ళలో అతడికి అసహాయత కనబడింది. అతడు చటుక్కున చేయి పట్టుకుని చేతనను సీట్లో కూర్చోపెట్టి—ఆ యువకుడి వంక తీవ్రంగా చూసి—"గెటౌటాఫ్ హియర్—" అన్నాడు.

"చేతనా! నువ్వురా—" అన్నాడా యువకుడు.

కిల్లర్ ఆమె భుజాన్ని నొక్కిపట్టి—"చేతన రాదు" అన్నాడు.

ఆ యువకుడు కిల్లర్ కళ్ళలోకి చూసి లేచాడు.

అతడు వెళ్ళగానే కిల్లర్ చేతనతో—"ఏమిటిదంతా?" అన్నాడు.

చేతన నెమ్మదిగా—"నేనిప్పుడు చాలా పెద్ద ప్రమా

దంలో ఉన్నాను—" అంది.

"ఏమిటా ప్రమాదం?"

"ఒక పెద్ద గ్యాంగు నన్నుపయోగించుకోవాలని చూస్తోంది...."

"నిన్నే ఎందుకు?" అన్నాడు కిల్లర్.

చేతన కిల్లర్ భుజంమీదకు వంగి—అతడి చెవిలో—"ప్లీజ్....దయుంచి ఇప్పుడు నన్నేమీ అడగొద్దు ఇక్కడేమీ చెప్పలేను...." అంది.

కిల్లర్ మాట్లాడకుండా ఊరుకున్నాడు.

చేతన కొద్దిక్షణాలాగి — "నేను వెళ్ళి వేరే సీట్లో కూర్చుంటాను—" అంది.

"ఎందుకు?"

"నా గురించి మీరు ప్రమాదంలో పడతారు...." అందామె.

"ఇప్పటికే నేను ప్రమాదంలో వున్నాను...."

"ఇప్పుడు నేను లేచి వెళ్ళిపోతే మీకే ప్రమాదమూ ఉండదు...."

"మరి నీకు?"

"నేనెలాగూ ప్రమాదంలో వున్నాను. మిమ్మల్నిందులో ఇరికించలేను...."

"అలాంటప్పుడు ముందుగా నన్నెందుకు పిలిచావు?"

"వాళ్ళిలా నన్నూ, మిమ్మల్నీ వేటాడతారని అనుకోలేదు...."

కిల్లర్ ఆమెవైపు వంగి నెమ్మదిగా—"ప్రమాదాలంటే నాకిష్టం. నన్ను ప్రమాదానికి గురిచేయాలనుకునే వారే ప్రమాదానికి గురవుతారు. ప్రతిఫలం ఆశించకుండా నిన్ను నేను ప్రమాదంనుంచి రక్షించగలను. ఎటొచ్చీ

ప్రమాదంనుంచి తప్పించుకోవాలన్న కోరిక నీకుండాలి. ఆలోచించుకో—" అన్నాడు.

చేతన మాట్లాడలేదు.

కాసేపిద్దరిమధ్యా మౌనం రాజ్యమేలింది.

"ఏం నిర్ణయించుకున్నావు?" అన్నాడు కిల్లర్.

"నేను లేచి వెళ్ళలేదు కదా! మీతో కలిసి సినిమా చూస్తాను...."

## 3

సినిమా అయ్యేవరకూ విశేషాలేమీ జరుగలేదు.

"నేను నిన్ను మీ యింటి దగ్గర డ్రాప్ చేస్తాను...." అన్నాడు కిల్లర్.

చేతన మౌనంగా అతడి ననుసరించింది.

ఇద్దరూ వ్యాన్లో కూర్చున్నారు. డ్రైవింగ్ సీట్లో ఉన్న కిల్లర్‌కి కాస్త దూరంగానే కూర్చుంది చేతన.

"మంచి పిల్ల!" అనుకున్నాడు కిల్లర్. అతడు వెంటనే వ్యాను స్టార్టు చేయకుండా — "మొత్తం నీ కథంతా ఇప్పుడు చెప్పు—" అన్నా డామెతో.

చేతన గొంతు సవరించుకుని — "నేను సుస్మితా కాస్మెటిక్స్ కంపెనీలో పనిచేస్తున్నాను. అవసరానికి మించిన జీతం నాకు లభిస్తోంది. అందువల్ల జీవితం తృప్తిగా నడిచిపోతోంది. అయితే ఇటీవల కొందరు నా వెంట పడుతున్నారు. తాము చెప్పినట్లు చేయమనీ— చేస్తే లక్షలార్జించవచ్చుననీ ఆశ పెడుతున్నారు. నేనొప్పుకోకపోతే బెదిరిస్తున్నారు. ఈరోజు సినిమా ప్రోగ్రాం నేను వేసుకున్నది కాదు...." అని ఇంకా ఏదో చెప్పబోతూండగా—

"ఒక్క నిముషం.. నీకింట్లో ఎవరూ లేరా?" అన్నాడు

కిల్లర్.

"అన్నయ్యున్నాడు...."

"నీ అన్నయ్యకి విషయం చెప్పలేదా?"

"థియేటర్లోంచి బయటకు వెళ్లేక నా పక్కన మీరు చూసిన వ్యక్తి నా అన్నయ్య...అతడి పేరు శంకరం" అంది చేతన.

కిల్లర్ ఆశ్చర్యంగా—"ఏ అన్నా—చెల్లిని స్మగ్లింగుకు ప్రోత్సహించడు—" అన్నాడు.

"అన్నయ్య సెవరో దురలవాట్లకు గురిచేసి తమ చేతిలో కీలుబొమ్మను చేసుకున్నారు. స్మగ్లింగుకే కాదు-వ్యభిచారానికి కూడా ప్రోత్సహించగలడిప్పుడు నన్ను అన్నయ్య—" అంటూ చేతన వంగి మోకాళ్ళమీద తల పెట్టుకుని ఏడ్చింది.

"ఏడ్చి సాధించేదేమీ ఉండదు....జరిగింది చెప్పు...."

"అన్నయ్యకిప్పుడు కొత్త స్నేహాలేర్పడ్డాయి. వాడి స్నేహితులింటికి వచ్చి నాతో అసభ్యంగా ప్రవర్తిస్తున్నా అన్నయ్య మాట్లాడేవాడు కాదు. ఆడదానికి శీలం ముఖ్యం కాదనీ, అన్నింటికీ డబ్బు కావాలనీ హితబోధలు చేస్తూండేవాడు...."

అని చేతన ఒక్కక్షణం ఆగి—"నిజానికి అన్నయ్యెంతో మంచివాడు. నన్ను ప్రాణానికి ప్రాణంగా పెంచాడు. కాలేజీలో చదువుతూండగా ఎవడో నా చేయి పట్టుకున్నాడని తెలిసి వెతుక్కుంటూ వెళ్ళి నాలుగు తన్ని వచ్చాడు. నన్నో యింటిదాన్ని చేసేవరకూ తను పెళ్ళి చేసుకోనన్నాడు. అలాంటిది రెండేళ్ళనించీ అన్నయ్యలో మార్పు ప్రారంభమై ఇప్పుడు భరించరానిదిగా తయారయింది. అందుకే నేను అన్నయ్యను వదిలిపెట్టి

నా స్నేహితురాలు సుధ యింట్లో వుంటున్నాను. సుధ తల్లిదండ్రులు నన్నభిమానంతో ఆదరించారు...." అంది.

"నీ కథ చాలా విచిత్రంగా వుంది. నువ్విల్లు మారితే మీ అన్నయ్యేమనుకున్నాడా?" అన్నాడు కిల్లర్.

"ఊరుకోలేదు కానీ ఘన పదార్థులు వేళ్యేసుగా వున్నాయని చెప్పాను. తనమీద నాకే కోపమూ లేద న్నాను. నాకు పెళ్ళి కాపురానికి వెళ్ళిపోయాననుకో మన్నాను. కొన్ని నెలలపాటు అన్నయ్య నా జోలికి రాలేదు. సంతోషించాను. అయితే రెండు వారాలనుంచి కొందరు వ్యక్తులు నన్ను వెంటాడి తమకు సహకరించమని వేధిస్తున్నారు. వాళ్ళకు అన్నయ్య రికమెండేషనుంది. అన్నయ్య స్వయంగా నన్ను కలుసుకుని వాళ్ళు చెప్పి నట్లు చేయకపోతే ప్రమాదమని హెచ్చరించాడు కూడా. నేను ప్రమాదానికి సిద్ధమేనని చెప్పాను.

ఈ రోజు అన్నయ్య సినిమాకని రెండు టికెట్సు బుక్ చేసుకుని వచ్చేనని చెబితే జాలిపడి థియేటర్ కు వచ్చాను. అన్నయ్య నాకు రెండు టికెట్సూ యిచ్చి యిప్పుడే వస్తానని వెళ్ళాడు. తర్వాత మిమ్మల్ని థియేట ర్లోంచి బయటకు పిలిచిన యువకుడు నా దగ్గరకు వచ్చి నీ అన్నయ్య రాడు.... నేనూ నువ్వూ కలిసి సినిమా చూస్తాం—అన్నాడు. అతణ్ణి చూస్తే నాకు భయం వేసింది. మనిషి మర్యాదస్థుడిలా లేడు...." అని ఆగింది చేతన.

"ఊఁ" అన్నాడు కిల్లర్.

చేతన చెప్పుకుపోతూంటే జరిగిందతడికి కళ్ళకు కట్టి నట్లుంది.

* • •

"నేను నీతో సినిమా చూడను" అంది చేతన.

"మరి—ఎవరితో చూస్తావ్?"

"అసలు సినిమాలే చూడను" అంది చేతన.

"చూడకుంటా థియేటర్ బయటే కూర్చుండి పోతావా?"

"ఇక్కడే యెందుకుంటాను. ఇంటికి వెళ్ళిపోతాను!"

"సినిమా చూడకుండా నువ్వింటికి వెళ్ళలేవు...."

"అంటే?"

"ఇప్పుడిక్కణ్నించి బయటకు వెడితే నువ్విల్లు చేరవు...." అని—"నా యిల్లు చేరతావు" అన్నాడు.

చేతన భయపడింది.

"ఇక్కడుంటే నీ కేమీ భయంలేదు. థియేటర్లో నీకో వస్తువు అందుతుంది. అది నువ్వు నేను చెప్పిన చోటుకు చేర్చాలి" అన్నాడతడు.

నాలుగు రోజుల క్రితం ఒక వ్యక్తి ఆమె ఆఫీసుకు వెళ్ళేముందు కలుసుకుని ఒక బ్రీఫ్ కేసివ్వబోయాడు. చేతన తీసుకోలేదు.

ఇది అలాంటి కేసేనని చేతన అనుకుంది.

"ఇలాంటి పనులు నా కిష్టంలేదు" అంది చేతన.

"ఈ పనులు నీకిష్టం లేదంటే—నిజంగా నీకిష్టంలేని పనులు నీచేత చేయించాల్సి వస్తుంది" అన్నాడతడు.

"అంటే?"

"ఆడపిల్లవు. ఆ మాత్రం అర్థం చేసుకోలేవా—నువ్విక్కడే వుండు. ఇప్పుడే వస్తాను" అంటూ అతడు పక్కకు వెళ్ళాడు.

ఏం చేయాలో తోచక అక్కడే నిలబడివున్న చేతనకు కిల్లర్ కనిపించాడు. అతణ్ని చూడగానే మర్యా

తనుడనిపించింది. అతడి ముఖంలో రత్తుణ కనపడిం దామెకు.

ఆ యువకుడినుంచి తప్పించుకు నేందు కామె కిల్లర్‌తో చనువుగా మసిలింది.

ఇద్దరూ థియేటర్లో కూర్చున్నాక ఆ యువకుడు వచ్చి కిల్లర్‌ని బైటకు పిలిచాడు. కిల్లర్ బయటకు వెళ్ళగానే శంకరం ఆమె పక్కకు వచ్చి కూర్చున్నాడు.

"నువ్విక్కడున్నావుభీ' అంది చేతన ఆశ్చర్యంగా.

"నా టికెట్సు వేరే వున్నాయి...." అన్నాడు శంకరం.

"ఏమిటిదంతా?"

"చెల్లాయ్—నా మాట విను—నీ సీట్లోకి ఎక్స్చేంజి మీద నా మిత్రుణ్ని పంపిస్తాను. నువ్వు సీటు మారిపో" అన్నాడు శంకరం.

"ఎందుకు?"

"నీ కందజేయబడే వస్తువు—నీ వ్యానిటీబ్యాగులో పట్టే సైజులోనే వుంటుంది. ఇందులో ప్రమాద మేమీ వుండదు. కాదంటేనే ప్రమాదం...."

"ఏమిటా ప్రమాదం?"

"నా నోటితో నేను చెప్పలేను."

"అన్నయ్యా! నువ్వెందుకు చెడుస్నేహాలు పట్టావు. నీ యిబ్బందేమిటో చెప్పు. వీలుంటే నీ స్నేహితులను పోలీసు లకు పట్టిద్దాం" అంది చేతన.

"చెల్లాయ్ — అన్నయ్యగా నీ మేలుకోరి నిన్ను హెచ్చరిస్తున్నాను. నన్నిక్కడే నా కూర్చోనివ్వు. లేదా సీటు మారిపో. లేకుంటే నీ కే అన్యాయం జరిగినా నేను

సాయపడలేను" అన్నాడు శంకరం గంభీరంగా.

సర్గీ తిప్పలు పల్లు లంగి వచ్చాడు.

* * *

"నీ కథ చిత్రంగా వుంది. అందరూ నీ కోసమే ఎందుకు ప్రయత్నిస్తున్నారో నాకు తెలియడంలేదు" అన్నాడు కిల్లర్.

"నాకూ తెలియడంలేదు" అంది చేతన.

"నువ్వు నన్నే ఎందుకెన్నుకున్నావు?"

"మీ ముఖంలో నాకు రక్షణ కనపడింది!"

"ఏమిటి నా ముఖంలోని ప్రత్యేకత?"

"మీ మీసాలు...."

కిల్లర్ చేయి అప్రయత్నంగా మీసం దువ్వింది. తన మీసం చూసి ఆడపిల్ల రక్షణ కోరడం ఇది మొదటిసారి కాదు.

ఒక యువతి తన్ను రక్షణ కోరితే అపార్థం చేసుకున్నాడు. ఫలితంగా ఆమె హత్య చేయబడింది.

ఇప్పుడు చేతన తననుండి రక్షణకోరుతోంది.... ఈమెను తను రక్షించితీరాలి.

"మిస్ చేతనా! నీ అదృష్టం గొప్పది. నేను నిన్ను రక్షించగలను...."

చేతన జీవంలేని నవ్వు నవ్వింది.

"ఇప్పుడు నిన్నెక్కడ దిగబెట్టాలో చెప్పు" అన్నాడు కిల్లర్.

"అది నాకే తెలియడంలేదు...." అంది చేతన.

"ఎందుకని?"

"అన్నయ్య దగ్గరకు వెళ్ళడంలో ప్రమాదముంది. కానీ ఇప్పుడు సుధ ఇంటికి వెళ్ళాలన్నా భయంవేస్తోంది.

అన్నయ్య స్నేహితులు సుధకు ప్రమాదం తలపెడతారేమోనని భయంగా వుంది. నా కారణంగా ఆ కుటుంబం ప్రమాదంలో పడడం నాకిష్టంలేదు" అంది చేతన.

"ఇన్నాళ్ళూ లేని ప్రమాదం ఆ కుటుంబానికి రోజే ఎందుకు వస్తుంది?"

"ఈ రోజు అన్నయ్య స్నేహితులు నన్ను పట్టుకోవాలని చాలా పట్టుదలగా వున్నారు" అంది చేతన.

"అయితే ఒక పని చేద్దాం" అన్నాడు కిల్లర్.

"ఈ రాత్రికి నువ్వు నా వ్యాన్లో పడుకో. నా వ్యాను—ఇన్స్పెక్టర్ చంద్రకాంత్ ఇంట్లో సురక్షితంగా ఉంటుంది. లోపల నువ్వున్నట్లు ఇన్స్పెక్టర్కి కూడా తెలియదు. నా వ్యాన్లో సదుపాయాలు—స్టార్ హోటల్లో కంటే బాగుంటాయి" అన్నాడు మళ్ళీ కిల్లర్.

"మీ యిష్టం" అంది చేతన.

డ్రైవింగ్ సీట్లోంచి లోపలకు దారివుంది. ఆ తలుపు తీసి కిల్లర్, చేతనను లోపలకు తీసుకుని వెళ్ళాడు. అక్కడి ఏర్పాట్లు చూసి చేతన తెల్లబోయింది.

"ఇదంతా ఏరోప్లేన్ మోడల్....రాత్రి నువ్వు సుఖంగా గడపొచ్చు. ఇంకో విశేషం—ఇది సౌండ్ ప్రూఫ్. లోపల నువ్వే చప్పుడు చేసినా బయటకు వినపడదు...."

చేతన విచిత్రంగా అక్కడి సదుపాయాలు చూస్తోంది.

కిల్లర్ లోపలున్న క్యారియర్ విప్పాడు. అందులో చపాతీలున్నాయి ఘుమఘుమలాడే కూర్మావుంది.

ఇద్దరూ చపాతీలు తిన్నారు.

కిల్లర్ తను మంచినీళ్ళు తాగి ఆమెకు మంచినీళ్ళిచ్చాడు.

"కడుపు నిండిపోయింది" అంది చేతన.

"కొన్ని తింటే తప్ప కడుపులో చల్లగా వుండదు" అంటూ కిల్లర్ రెండు బత్తాయిలు వలిచి—ఒకటి ఆమె కిచ్చాడు.

మొహమాట పడుతూనే చేతన పండు తింది.

"ప్రమాదం నుంచి రక్షించడమే కాదు.... మీ ఆతిథ్యంవల్ల కూడా నేను మీకు ఋణపడివున్నాను" అంది చేతన.

"నేను నిన్ను రక్షించగలనో లేదో ఇంకా నాకు తెలియదు. నా ప్రయత్నం నేను చేస్తాను. ఈ విషయంలో నా కంటే బాగా ప్రయత్నించగలవా రెవ్వరూ వుండరని నీకు హామీ యివ్వగలను. ఇక ఆతిథ్యం సంగతంటావా? అందుకు ఋణపడనవసరంలేదు. నా ఋణం తీర్చుకునే అవకాశం నీకిస్తాను" అన్నాడు కిల్లర్.

"నేనీ ప్రమాదం నుంచి బయటపడ్డాక మీకు తప్పకుండా ఆతిథ్య మిచ్చి కొంత ఋణం తీర్చుకుందుకు ప్రయత్నిస్తాను" అంది చేతన.

"సరే—నువ్విక విశ్రాంతి తీసుకో—హరిహరాదులు వచ్చినా, ఆఖరికి నువ్వే కావాలనుకున్నా కూడా ఇక్కణ్ణించి బయటపడలేవు. నేను తిరిగి వచ్చి తలుపు తీసే వరకూ లోపల బుద్ధిగా వుండు" అంటూ కిల్లర్ అక్కణ్ణించి బయటకు వచ్చి బయటినుంచి తలుపు వేసి డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు.

# 4

మొబైల్ వ్యానును ఇన్ స్పెక్టర్ చంద్రకాంత్ ఇంటి ముందు ఆవరణలో వుంచి ఆతడివద్ద సెలవు తీసుకుని బయటపడేసరికి – కిల్లర్ కి టైము పదకొండయింది.

అతడు నడుచుకుంటూ సందు మలుపు తిరిగేసరికి అక్కడ ఓ యువకుడు కనిపించాడు. చేతిని అన్నాయ్య శంకరంగా అతణ్ని గుర్తుపట్టాడు కిల్లర్.

"హలో — శంకరం! కులాసానా" అన్నాడు కిల్లర్.

శంకరం ముఖం దీనంగా అయిపోయింది "నీ మీద పోలీసు కంప్లయింట్ యివ్వాలనుకున్నాను. కానీ నువ్వు పోలీసీ ట్లోంచి బయటకు వచ్చావు"

"నామీద కంప్లయింటా — ఎందుకు?"

"నా చెల్లెల్ని కిడ్నాప్ చేసినందుకు ..."

"కిడ్నాపర్స్ నుంచి నీ చెల్లెల్ని కాపాడిన నామీద-కిడ్నాపింగ్ నేరం మోపాలనుకున్నావా? అందుకు నీ చెల్లెలు సహకరించదని తెలియదూ?" అన్నాడు కిల్లర్.

"అయాం వెరీ సారీ! నేను చాలా పొరపాటు చేశాను. నా చెల్లెలికి నువ్వేమీ ప్రమాదం తలపెట్టలేదు కదా!"

"ఆమెకు పోలీసురక్షణ కల్పించాను...."

"థాంక్యూ" అన్నాడు శంకరం.

"అది చెప్పడానికే నన్నిక్కడ కలిశావా?"

"లేదు. నేను నా చెల్లెలి విషయంలో చాలా అన్యాయంగా ప్రవర్తించాను. నా తప్పు దిద్దుకోవాలి. అందుకే నిన్ను కలిశాను."

"అయితే సరాసరి ఇన్స్పెక్టరింటికి ఎందుకు రాలేదు?"

"రాలేను. నేనో గూడుపుఠాణీలో ఇరుక్కున్నాను. నువ్వు నా చెల్లిని పోలీసుల కప్పగించావు. అందువల్ల నా జీవితం ప్రమాదంలో పడింది. అందుకు నేను బాధపడను.

కానీ నా చెల్లి సమస్య ఈ రాత్రితో తీరిపోదు. దాని మీద మహాబలవంతుడొకడు పగబడతాడు. ఇకమీదట అడుగడుగునా దానికి ప్రమాదమే!" అన్నాడు శంకరం.

"నేను నీ చెల్లిని ప్రమాదంనుంచి రక్షించగలను" అన్నాడు కిల్లర్.

"నీ శక్తి నాకు తెలియదు. కానీ నా చెల్లిని పోలీసుల కప్పగించడం ద్వారా యిప్పుడు నువ్వు ప్రమాదంలో పడ్డావు. ఈ సమయంలో నీకు నేను ఉడతాభక్తిగా చేయగల సాయం కొంత వుంది. నాయింటికి వస్తావా?" అన్నాడు శంకరం.

"ష్యూర్" అన్నాడు కిల్లర్.

ఇద్దరూ కాలినడకన ఒక అరగంటసేపు నడిచి ఓ యింటి ముందాగారు.

"ఇదా నీ యిల్లు?" అన్నాడు కిల్లర్.

"ఊఁ"

"బావుంది" అన్నాడు కిల్లర్.

చిన్న పెంకుటిల్లది.

ఇద్దరూ మెట్లెక్కారు.

"తలుపుకు తాళంలేదే?" అన్నాడు కిల్లర్.

"నేనిప్పుడొక మహాబలవంతుడికి అనుచరుడిగా వుంటున్నాను. తన అనుచరుల యింటికి తాళాలుండడాన్నాయన హర్షించడు ..."

"ఏమైనా పోతే?"

"ఎవరైనా నాకు తెలియకుండా ఇక్కడడుగు పెడితే వాణ్ని ముల్లోకాల్లో ఎక్కడున్నా మూడు నిముషాల్లో పట్టుకోగలడు బాస్!"

"అయితే ఈ విషయం రేపు పరీక్షించాలి" అన్నాడు

కిల్లర్.

"కావెందుకు—ఇప్పుడే పరీక్షించుకోవచ్చు".

"ఇప్పుడు నీవు తెలిసేకదా లోపల అడుగు పెడుతున్నాను."

శంకరం నవ్వి తలుపు తోశాడు. తను లోపలకు వెళ్ళి స్విచ్ వేశాడు.

కిల్లర్ లోపల అడుగుపెట్టి తలుపులు దగ్గరగా వేశాడు.

చిన్నగది.... నాలుగు ఇనుప కుర్చీలు....

"లోపలకు వెడదాం" అన్నాడు శంకరం.

కిల్లర్ అంగీకార సూచనగా తలాడించాడు.

పక్కనే దగ్గరగా తలుపు మూసివున్న గది ఒకటుంది. తలుపు తోసుకుని శంకరం అందులోకి వెళ్ళాడు.

ఈ గది విశాలంగా వుంది.

గది మధ్యలో డబుల్ కాట్ వుంది. బయట్నించి చూస్తే ఈ యింట్లో అంతమంచి మంచాలుంటాయని ఎవరూ అనుకోరు.

గదిలో నాలుగు వైపులా గోడల కానుకుని నాలుగు బీరువాలున్నాయి.

"నువ్విలా మంచంమీద కూర్చో! నేను మంచినీళ్ళు తాగి వస్తాను" అన్నాడు శంకరం.

"మంచినీళ్ళు నాకూ కావాలి- నేనూ నీతో వస్తాను" అన్నాడు కిల్లర్.

అప్పుడు చటుక్కున కిల్లర్ కెదురుగా ఉన్న బీరువా తలుపు తెరుచుకుంది. అందులోంచి కండలు తిరిగిన వస్తాదొకడు బయటకు వచ్చాడు.

"నీ చేత మంచినీళ్ళు నేను తాగిస్తాలే" అన్నాడు

వస్తాడు.

తంతరం అక్కణ్నుంచి వెళ్ళిపోయాడు.

కిల్లర్ ఆశ్చర్యంగా చుట్టూ చూశాడు.

ప్రతీ బీరువాలోంచీ ఒకడు చొప్పున అక్కడ మొత్తం నలుగురు మనుషులతణ్ణి చుట్టుముట్టారు.

వారిలో ముగ్గురు వస్తాదులైతే ఒకడు మాత్రం ధియేటర్ వద్ద కిల్లర్ని బొమ్మజూపి బెదిరించినవాడు.

"వాకోసం వస్తాదుల్ని తీసుకొచ్చేవా?" అన్నాడు కిల్లర్.

ఆ వ్యక్తి నవ్వి — "భయపడకు. వీళ్ళు ముగ్గురూ నిన్నేమీ చెయ్యరు. నేను నీకు బుద్ధి చెబుతున్నప్పుడు పారిపోకుండా ఆపడానికే వీళ్ళు" అన్నాడు.

"నాకు బుద్ధి చెప్పడంకోసం నువ్వు పారిపోతావా?" అన్నాడు కిల్లర్ ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

"పారిపోయేది నువ్వు. నేను కాదు...."

"నేనెందుకు పారిపోతాను?" అన్నాడు కిల్లర్.

"ప్రాణభయంవల్ల ...."

"నా ప్రాణాలకిప్పుడొచ్చిన భయమేముంది?"

"నా హెచ్చరికను లక్ష్యపెట్టనివాడికి ప్రాణభయం తప్పదు...."

"అయితే నువ్విప్పుడు నాకు బుద్ధిచెబుతానంటావు. ఆ సమయంలో ఈ వస్తాదులు ముగ్గురూ బుద్ధిగా వుంటారంటావు...." అన్నాడు కిల్లర్.

"ఆఫ్‌కోర్స్!"

"నాకు నీ మాటలమీద నమ్మకంలేదు. నీ ఆత్మరక్షణ కోసం వీళ్ళనిక్కడుంచుకున్నావని నా అనుమానం...."

ఆ వ్యక్తి నవ్వి — "నీ అనుమానమేదైనా వాళ్ళి

క్కడే ఉంటాను....” అన్నాడు.

“వాళ్ళనిక్కడే ఉండనిద్దాం. కానీ వాళ్ళు నీమాట వినాలిగా.... అందుకు నేను సాయపడలేను—..” అంటూ కిల్లర్ మెరుపు వేగంతో గాలిలో ఎగిరి శరవేగంతో కాళ్ళూ చేతులూ కదిలించాడు. చెప్పాలంటే అప్పుడతడి చేతులూ, కాళ్ళూ — శరవేగంతో తిరిగే చక్రంలోని ఆకుల్లా ఉన్నాయి.

కిల్లర్ మామూలుగా నేలమీద నిలబడేసరికి వస్తాదులు ముగ్గురూ మూడు పైపుల గోడవారగా చతికిలబడి ఉన్నారు.

ఆ వ్యక్తి తెల్లబోయి కిల్లర్ వంక చూశాడు....

“చేతిదెబ్బకు నరాలు చచ్చుబడి కూలబడ్డారు. కాలితో తోసేసరికి గోడవారకు వెళ్ళారు. ఇప్పుడు వాళ్ళీ గదిలో ఇంకేం జరిగినా చూస్తూ ఊరుకోవడం మినహాయించి ఇంకేమీ చెయ్యలేరు....” అన్నాడు కిల్లర్.

వస్తాదులు ముగ్గురూ అలానే కూర్చుని అసహాయంగా తమ బాస్ వంక చూశారు.

ఆ వ్యక్తి రవంత చలించినా గాంభీర్యాన్ని వదిలిపెట్టకుండా—“ఎవర్నువ్వు?” అనడిగాడు.

“ముందు నువ్వెవరో తెలుసుకుని—అప్పుడు నా వివరాలు చెబుతాను....” అంటూ కిల్లర్ అతణ్ణి సమీపించాడు.

“అదంత సులభం కాదు....” అంటూ బాస్ గాల్లోకి ఎగిరాడు.

కిల్లర్ చటుక్కున వంగి అతడి కాళ్ళు పట్టుకుని లేచి నిలబడి గిరగిరా తిప్పి-గాలిలోకి విసిరి కిందపడిపోకుండా నిలబెట్టిపట్టుకున్నాడు.

ఆ వ్యక్తికి కళ్ళు గిరగిరా తిరిగాయి. మామూలు మనిషవడానికి కాసేపు పట్టింది.

అతడు నిలదొక్కుకున్నాక — "ఎవరున్నవ్వు?" అన్నాడు కిల్లర్.

"నా పేరు రాజా!" అన్నాడా వ్యక్తి.

"మిస్టర్ రాజా నువ్వు చేతన వెంట ఎందుకుపడ్డావో చెప్పు .."

"ఆమె చాలా అందమైనది. మా స్మగ్లింగ్ ఆపరేషన్స్ కామె బాగా పనికొస్తుంది—"

"దేశంలో అందమైన ఆడవాళ్ళెంతో మంది ఎందరో ఉన్నారు. నువ్వు చేతననే ఎందుకు పట్టుపట్టావు...."

అన్నాడు కిల్లర్.

"ఇలాంటి పనులకు పెద్దల సహాకారం లేనిదే ఆడపిల్లలుపయోగపడరు. చేతన విషయంలో వాళ్ళన్నయ్య అంగీకారం లభించింది...."

"ఎలా లభించింది?"

"అతడికి డబ్బు కావాలి...."

"మిస్టర్ రాజా! కేవలం డబ్బుకోసం ఏ అన్నా చెల్లెల్ని అమ్ముకోడు. అంతకంటే ఘోరమైనదింకేదో ఉంది...."

"ఇంకేమీ లేదు ...."

"నువ్వు చెప్పకపోయినా ఆ విషయం శంకరాన్ని చూడగానే తెలుస్తుంది. మీరతడికి మత్తు పదార్థాలను బాగా అలవాటు చేశారు. ఆ అలవాటు కతడు బానిసయ్యాడు. మీరు చెప్పినట్లల్లా ఆడుతున్నాడు...."

రాజా మాట్లాడలేదు.

"ధనిక యువకులకిని అలవాటుచేస్తే బాగా డబ్బు

సంపాదించవచ్చు. కానీ శంకరం వంటి సామాన్యుల నెందుకు మీరీ అలవాటుకు గురిచేస్తున్నారు?"

"ఊహించి చాలా తెలుసుకున్నావు. ఇదీ తెలుసుకో లేవా?" అన్నాడు రాజా.

కిల్లర్ ఒక్క క్షణం ఆలోచించి—"స్మగ్లింగుకు అందమైన ఆడపిల్లలు బాగా పనికి వస్తారు. వాళ్ళు మధ్యతరగతి ఆడపిల్లలైతే ఎవరికీ అనుమానముండదు. కాబట్టి మాకింకా మంచిది. అలాంటి ఆడపిల్లలు పెద్దలకు తెలియకుండా ఏ వ్యవహారాలకూ దిగలేరు. అందుకని మేము అలాంటివాళ్ళలో శంకరంలాంటి వారిని మత్తు పదార్థాలకు బానిసలుగా మారుస్తున్నారు. చెప్పాలంటే మాకు శంకరమంటే ఆసక్తి లేదు. చేతనకోసం శంకరాన్ని దువ్వారు...." అన్నాడు.

"నువ్వు చాలా తెలివైనవాడివి." అన్నాడు రాజా.

"నా తెలివి నీకు రేపుదయానికింకా బాగా అర్థమవుతుంది...." అంటూ కిల్లర్ అతడి మెడమీద ఒక దెబ్బ వేశాడు.

రాజా కుప్పలా కూలిపోయాడు.

## 5

మర్నాడుదయం....

వస్తాదులు, రాజా నేలమీదపడి నిద్రపోతున్నారు.

కిల్లర్ మంచంమీద ఒళ్ళు విరుచుకుంటూ లేచి—"మీ రెవరూ ఇంకా నిద్రలేవలేదా?" అంటూ అరిచాడు.

ఎవ్వరూ లేవలేదు.

అప్పుడతడే దగ్గరగా వెళ్ళి వీపుతట్టి ఒక్కొక్కరినే నిద్రలేపాడు.

నలుగురూ మత్తు మత్తుగా కళ్ళు తెరిచారు. వాళ్ళకు

పూర్తి మెలకువ రావడానికి కాసేపట్టింది.

కిల్లర్ కళ్ళు మంచంమీద పడుకుని — "మీకు పూర్తిగా మెలకువ వచ్చేక నా దగ్గరకు రండి!" అన్నాడు.

అప్పటికి రాజాకూ, వస్తాదులకూ తమ పరిస్థితి తెలిసింది. అతడు హాయిగా పరుపుల మంచంమీద నిద్ర పోయాడు. తాము కటిక నేలమీద నిద్రపోయారు. అయితే జీవితంలో ఎప్పుడూ వారింతటి సుఖనిద్ర ఎరుగరు. కళ్ళు నొప్పులుగా వున్నా మెదడులోపల ఎంతో ప్రశాంతంగా ఉంది.

రాజా కిల్లర్ని సమీపించి—"ఎవర్నువ్వు?" అన్నాడు.

"శరణు కోరిన వారిని రక్షించడమే ధ్యేయంగా పెట్టుకున్న అవతార పురుషుణ్ని—" అన్నాడు కిల్లర్.

"ఇప్పుడేం చేయదల్చుకున్నావు?" అన్నాడు రాజా.

"నువ్వే చెప్పాలి!"

"జరిగిందానికి గర్వపడకు. ఇంతకింతా అనుభవిస్తావు."

"ఒకసారి నన్ను హెచ్చరించి ఒక రాత్రంతా పడుకున్నావు. నన్ను మళ్ళీ మళ్ళీ హెచ్చరించాలంటే సిగ్గుగా లేదూ నీకు!" అన్నాడు కిల్లర్.

"ఇల్లలకగానే పండుగ కాదు—...." అన్నాడు రాజా.

"ఎప్పుడు పండుగవుతుందో చెప్పు...." అన్నాడు కిల్లర్.

"నేను బయటకు వెడుతున్నాను-పండక్కి ఏర్పాట్లు చేయడానికి...."

"నా అనుమతి లేకుండా ఎక్కడికి వెడతావ్?" అన్నాడు కిల్లర్.

“నాకు తోచిన చోటుకి ”

“ఇప్పుడు ఏచోటైనా తోస్తోందా అసలు....” అంటూ కిల్లర్ మంచంమీంచి లేచి నిలబడి—“ఎలా వెడతావో చూస్తాను—” అని చేతులు కరాటే పోజులో పెట్టాడు.

వస్తాదులు కానీ, రాజా కానీ అతణ్ని సమీపించే సాహసం చేయలేకపోయారు.

“ఇప్పుడేం చేస్తావు?” అన్నాడు రాజా నిస్పృహగా.

“మిమ్మల్ని పోలీసుల కప్పగిస్తాను....”

“ఆ పని రాత్రే యెందుకు చేయలేదు?” అన్నాడు రాజా.

“శంకరాన్ని రక్షించేవరకూ మిమ్మల్ని పోలీసుల కప్పగించదల్చుకోలేదు. ఎందుకంటే నీ వెనుక ఇంకా ఎవరో ఉంటారని నా అనుమానం. నీకు ప్రమాదముందని నీవాళ్ళకనుమానం కలిగితే నా పని పూర్తికాదు....”

“అంటే మిమ్మల్నిప్పుడు పోలీసుల కప్పగిస్తానన్న మాట....పోలీసుల పేరు చెబితే మేము ప్రాణాలకు తెగిస్తామని ఊహించలేవా?” అంటూ రాజా సన్నగా ఈల వేశాడు.

అంతే—వస్తాదులు ముగ్గురూ కిల్లర్ మీద మెరుపుదాడి చేశారు.

ఒక వస్తాదు కిల్లర్ కాళ్ళు బలంగా పట్టుకున్నాడు. రెండో వస్తాదు కిల్లర్ రెండు చేతులూ వెనక్కి విరిచి పట్టుకున్నాడు. మూడో వస్తాదు అతడి భుజాలమీద గట్టిగా గుద్దాడు.

కిల్లర్ మెడ వేలాడేశాడు.

“అతడు జిత్తులమారి. పట్టు సడలించకండి—” అన్నాడు రాజా. అతడు పక్క గదిలోనికి వెళ్ళి సన్నని

తాడు తెచ్చి కిల్లర్ కాళ్ళూ చేతులూ కట్టేశాడు.

"కాసేపు నేలమీద పడుకోబెట్టండి—" అన్నాడు రాజా.

వస్తాదులు కిల్లర్ని నేలమీద పడుకోబెట్టారు.

రాజా అతడివంక కసిగా చూశాడు. కిల్లర్ ఇంకా కళ్ళు మూసుకునే వున్నాడు. రాజా అతణ్ని కాలితో ఒక్క తాపు తన్నాడు.

కిల్లర్ నేలమీద దొర్లాడు.

రాజా అతణ్ణలా నాలుగైదుసార్లు తన్నేసరికి కిల్లర్ కళ్ళు తెరిచి బాధగా అరిచాడు.

"స్పృహ వచ్చిందా?" అన్నాడు రాజా.

"ఏమిటిదంతా?" అన్నాడు కిల్లర్.

"చెప్పానుగా — ఇల్లలకగానే పండగకాదని...."

కిల్లర్ పళ్ళు బిగబట్టి — "నువ్విలా అన్నందుకైనా నీ చేత ఇల్లలికించి ఓ పండుగ చేసుకుంటాను ...."

"ఇంకా నీకు బుద్ధిరా లేదా?" అన్నాడు రాజా.

"రాత్రి జరిగిందానికి నీకు బుద్ధొచ్చిందా?" అన్నాడు కిల్లర్.

రాజా పళ్ళు బిగబట్టి—"ఇప్పుడు చేతన నెవరు రక్షిస్తారో చూస్తాను—" అన్నాడు.

"చేతన గురించి ఆలోచించి చూడు. ఊహల్లో కూడా నీకామె దొరకదు...."

"నీకు వాగుడెక్కువగా వుంది—" అంటూ రాజా ఓ వస్తాదుకు సైగచేశాడు. వస్తాదు లోపలకు వెళ్ళి ఓ రుమాలు తెచ్చి బలంగా కిల్లర్ నోట్లో కుక్కాడు.

కిల్లర్ ప్రతిఘటించడానికి ప్రయత్నిస్తూ ఆ వస్తాదు వంక క్రూరంగా చూశాడు. ఆ చూపులకు చలించిన

వస్తాదు — "సార్! కళ్ళక్కూడా గంతలు కడదాం. వీడి కళ్ళు చూస్తే నాకు భయంగా వుంది-" అన్నాడు.

"ఊఁ" అన్నాడు రాజా.

ఓ నల్లగుడ్డతో కిల్లర్ కు గంతలుకూడా కట్టేక — "వీణ్ణి తీసుకెళ్ళి కారు డిక్కీలో పడేయండి—" అన్నాడు.

ఆ యింటికి దొడ్డి గుమ్మం తలుపుతీస్తే ఓ యిరుకు సందుంది. అందులో ఓ కారుంది. ఆ కారు డిక్కీలోకి తరలించబడ్డాడు.

"నీ కాళ్ళు, చేతులు, కళ్ళు, నోరు—అన్నీ బంధించబడ్డాయి. ఉన్న చెవులనే ఉపయోగించుకునే సామర్థ్యం నీకున్నదని నాకు తెలుసు. అందుకే యిది...." అంటూ ఓ టేపు రికార్డర్ ఆన్ చేసి డిక్కీలో పెట్టాడు రాజా.

వస్తాదు డిక్కీ తలుపులు మూస్తూ—"సార్—ఆ టేపు రికార్డువల్ల ప్రయోజనం!" అనడిగాడు కుతూహలంగా.

"దారిలో గుర్తుగా ఏ చప్పుళ్ళూ వినపడవు. వాడికా టేపురికార్డర్లో సంగీతం తప్ప ఇంకేమీ వినపడదు—" అన్నాడు రాజా.

## 6

కళ్ళ గంతలు విప్పగానే ఎదురుగా సింహాసనంలాంటి కుర్చీ ఒకటి కనిపించింది కిల్లర్ కి. ఆ సింహాసనం ముందు సుమారు ఆరున్నరడుగుల ఎత్తయిన విగ్రహంతో ఓ వృద్ధకాయుడు నిలబడి వున్నాడు.

కిల్లర్ అతడివంక ఆశ్చర్యంగా చూశాడు.

అందమైన రాక్షసుడిలా వున్నాడతడు.

"అతణ్ణి మాట్లాడనివ్వండి—" అన్నాడు వృద్ధకాయుడు.

ఒక వస్తాదు—కిల్లర్ నోట్లోని రుమాలు లాగేశాడు. కిల్లర్ ఒకసారి నాలికతో పెదాలు తడుముకున్నాడు.

"ఎవర్నువ్వు?" అన్నాడు దృఢకాయుడు.

"ముందు నువ్వెవరివో చెప్పు. అప్పుడు నా గురించి చెబుతాను—" అన్నాడు కిల్లర్.

"నా అనుచరులు నిన్ను బంధించారు. రాజాను నేను నాయకుణ్ని—"

"నీ పేరు...."

"నీ కనవసరం...."

"దయుంచి నా అవసరం గురించి మీ రెవ్వరూ ఆలోచించవద్దు. అడిగిందానికి సూటిగా సమాధానం చెప్పు" అన్నాడు కిల్లర్.

దృఢకాయుడు రెండడుగులు ముందుకు వేసి—"నా సావరంలో నన్నెదిరించి మాట్లాడుతున్నావు. నీకెంత ధైర్యం!" అన్నాడు.

"నా ధైర్యం గురించి నీకు తెలిసింది చాలా తక్కువ. ఇంకా తెలుసుకోవాలంటే ఇప్పుడే చూపించగలను!" అన్నాడు కిల్లర్.

"చూపించు...." అన్నాడు దృఢకాయుడు.

"నీ ముందున్న ఈ రాజాకూ, వస్తాదులకూ నా వంటికున్న ఈ బంధనాలే ధైర్యాన్నిచ్చాయి. ఇప్పుడు చూడు...." అంటూ ఊపిరి బిగబట్టి కాళ్ళూ చేతులూ విదిలించాడు. అప్పుడతడి శరీరం కాస్త కుంచించుకుంది. ఫలితంగా అతడి బంధనాలు వదులుగా నేల జారాయి.

దృఢకాయుడు ఆశ్చర్యంగా చూస్తూండగా కిల్లర్ చిన్న కేక పెట్టి గాల్లోకి ఎగిరాడు.

దృఢకాయుడతడెగిరిన వైపు తిరిగాడు.

కిల్లర్ సరాసరి వెళ్ళి సింహాసనంలో పడ్డాడు. అప్పు డతడు కాలుమీద కాలు వేసుకొని హుందాగా — "నీ సామ్రాజ్యంలో నీ సింహాసనంమీద కూర్చుని నిన్ను నిలబెట్టి ప్రశ్నిస్తున్నాను. ఇప్పుడు చెప్పు — నీ పేరేమిటో!" అన్నాడు.

ఒక్క నిముషం అక్కడున్న వాళ్ళెవ్వరికీ నోట మాట రాలేదు. దృఢకాయుడు త్వరగా తేరుకొని చప్పట్లు కొట్టి— "హేట్సాఫ్ టూయూ...." అన్నాడు.

"అలాగన డానికి నీ తలపై టోపీ లేదు...." అన్నాడు కిల్లర్.

దృఢకాయుడు సింహాసనాన్ని సమీపించి-ఒక చేత్తో కాలర్ పట్టుకొని కిల్లర్ని గాలిలోకి ఎత్తి క్రింద నిలబెట్టి తను సింహాసనంమీద కూర్చుని— "ఇప్పుడేమంటావ్?" అన్నాడు.

"నాకంటే సింహాసనంమీద నువ్వే నిండుగా వున్నావు—" అన్నాడు కిల్లర్.

"నువ్వెవరో ముందు చెప్పు—" అన్నాడు దృఢకాయుడు.

"నీ గురించి తెలుసుకున్నాకనే నా గురించి చెబు తాను...."

"దేశంలో రెండు రకాల వ్యవహారాలు నడుస్తు న్నాయి. నాది రెండోరకం వ్యవహారం—" అన్నాడు దృఢకాయుడు.

"అంటే?"

"మగాడికి ఆడదానిమీద మనసు పుట్టిందనుకో! మొదటి రకం పద్ధతేమిటంటే పెళ్ళి చేసుకోవడం! రెండో రకం పద్ధతి—నచ్చిన ఆడదానితో ఓ రాత్రి

గడపడం.... చెప్పానుగా—నాది రెండో రకం పద్ధతి.."
అన్నాడు వృద్ధకాయుడు.

"మరి కాస్త వివరంగా చెప్పు...."

"ఒక్క ముక్కలో చెప్పాలంటే నేను చేసేవన్నీ చట్టవిరుద్ధమైన పనులు ..."

"అలాగా—నీ పేరు?"

"అర్జున్!" అన్నాడు వృద్ధకాయుడు.

"థాంక్యూ—నా పేరు కిల్లర్ .... నాది మొదటిరకం వ్యవహారం ...."

"అయితే నువ్వూ నేనూ చేతులు కలుపుదాం—ఇద్దరికీ తిరుగుండదు—" అంటూ చేయి జాపాడు అర్జున్.

"మన చేతులెలా కలుస్తాయి? ఒకరు పాజిటివ్, ఇంకొకరు నెగటివ్—రెండూ కలిస్తే ఫ్యూజు పోతుంది"
అన్నాడు కిల్లర్.

"ఫ్యూజు సంగతి నేను చూసుకుంటాను. చేయిజాపు"
అన్నాడు అర్జున్.

"చాపను—" అంటూ కిల్లర్ చేతులు కట్టుకొని నిలబడ్డాడు.

"అయితే నువ్విక్కడే శాశ్వతంగా మిగిలిపోతావు.."

"నేనిక్కడుండడంవల్ల నీకే నష్టం...."

అర్జున్ నవ్వి — "వివరించి చెప్పు — వింటాను—"
అన్నాడు.

"ఈ యింటి చుట్టూ పోలీసులుంటారిప్పుడు ..."

అర్జున్ ఉలిక్కిపడి — "పోలీసులా — వాళ్ళెలా వస్తారు?" అన్నాడు.

"ఒకసారి నా మాటల్లో సత్యమెంతుందో నీవాళ్ళను వెళ్ళి చూడమను...."

"చూడ్డానికి వేరే పద్ధతులున్నాయిలే—" అంటూ అర్జున్ తన సింహాసనం చేతులపై ఓ మీట నొక్కాడు.. "అటు చూడు—" అన్నాడు కిల్లర్‌తో.

అప్పుడు ఎదురుగా గోడ ప్రకాశవంతమయింది.

దానిపై ముందో యిల్లు కనబడింది. ఇంటిముందో కారుంది. ఆ పక్కనే పోలీసు జీపుంది ఇంటి ఎదురుగా నలుగురు పోలీసులున్నారు.

క్షణాల్లో ఆ బొమ్మ మాయమై ఇంటి వెనుక భాగం కనపడింది. అక్కడ ఆరుగురు పోలీసులున్నారు.

గోడపై ఇల్లు అన్నివైపులనుంచీ క్రమంగా కనబడుతోంది. ఇంటికి అన్నివైపులా పోలీసులున్నారు.

"మిస్టర్ రాజా! పోలీసులెలా వచ్చారిక్కడికి?" తీవ్రంగా అడిగాడు అర్జున్.

రాజా తడబడి—"నాకు తెలియదు బాస్.... నేను అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాను—" అన్నాడు.

"నన్నడిగితే నేను చెబుతాను. రాజా ఏం చెబుతాడు?" అన్నాడు కిల్లర్.

"చెప్పు...."

"మీవాళ్ళు నన్ను చాలా తక్కువ అంచనా వేశారు. మీ రాజా నన్ను బొమ్మ చూపించి బెదిరించాలనుకున్నాడు. నిన్న రాత్రి వాళ్ళతో ఓ ఆట ఆడాను. అయినా వాళ్ళకు బుద్ధిరాలేదు. ముందు నన్ను శరణు కోరిన చేతనకు రక్షణ కల్పించాను. ఆ తర్వాత శంకరాన్ని బలవంతంగా హాస్పిటల్లో జేర్చాను. పోలీసులు, మానసిక నిపుణులు కూడా అతణ్ణి పరీక్షిస్తున్నారు. అంతటితో కథ ముగియదు కదా! మొత్తం ప్లానంతా ముందుగానే చెప్పి నేను కావాలనే రాజాను పట్టు

బడ్డాను. తాళా నన్ను కార్లో తీసుకొని పోతూంటే పోలీసులు అతడిననుసరించారు. మీ స్థావరం తెలుసుకున్నారు—....” అన్నాడు కిల్లర్ నవ్వుతూ.

“రాజా! నువ్వు చాలా తెలివితక్కువగా ప్రవర్తించావు....” అన్నాడు అర్జున్ అసహనంగా.

“ఇందులో రాజా తెలివితక్కువతనమేమీ లేదు, అంతా నా తెలివి....” అన్నాడు కిల్లర్.

“నీ తెలివి నా స్థావరంలో పని చేయదు....” అంటూ అర్జున్ కిల్లర్ని సమీపించి — “ఇది చాలా ముఖ్యమైన స్థావరం.... ఇంతవరకూ పోలీసుల దృష్టి దీనిపై పడలేదు. నీ మూలంగా అది జరిగింది. అయితే నా తెలివేమిటో నీకు తెలియాలిగా—” అంటూ కిల్లర్ని ఎత్తి సింహాసనం మీద కూర్చోపెట్టాడు. ఆ వెనువెంటనే అతడి మెడ, కాళ్ళు, చేతులు, నడుం — సింహాసనానికి బంధించబడ్డాయి.

“నేను, నా అనుచరులు ఇక్కణ్ణించి బయటపడతాం. పోలీసులవల్ల మాకే ప్రమాదమూ ఉండదు. మేము వెళ్ళాక బయటేం జరుగుతుందో నువ్వే స్వయంగా చూద్దువుగాని. నువ్విప్పుడు అండర్ గ్రౌండ్‌లో వున్నావు. నేను తిరిగి వస్తే తప్ప నీకు మోక్షంలేదు. తల బద్దలు కొట్టుకున్నా పోలీసులకు నీ ఉనికి తెలియదు-” అన్నాడు అర్జున్.

మరుక్షణం గదంతా చీకటైపోయింది. గదిలో మళ్ళీ దీపం వెలిగేసరికి అక్కడ కిల్లర్ మాత్రమే ఉన్నాడు. కొద్దిక్షణాల్లో అతడి బంధనాలు కూడా విడిపోయాయి.

కిల్లర్ సింహాసనంమీంచి దుమికి ఒళ్ళు విరుచుకున్నాడు. తర్వాత ఓసారి గదంతా కలయతిరిగాడు.

అందులోంచి బయటపడ్డానికి ఎక్కడా దారి కనపడలేదు. అప్పుడతడు సింహాసనాన్ని పరిశీలించాడు. దాని మీదెక్కడా మీట అన్నదే కనబడలేదు.

"అర్జున్ అసాధ్యుడు!" అనుకున్నాడు కిల్లర్. అతను తిరిగి గదిలోనికి వస్తే తప్ప తనకు మోక్షం లేదు.

అర్జున్ వస్తాడా?

రాకపోతే తన గతి ఏమవుతుంది?

కిల్లర్ ఆలోచిస్తూండగానే గోడమీద బొమ్మలు కనిపించసాగాయి.

రాజా, ముగ్గురు వస్తాదులతో కలిసి బయటకు వెళ్ళి కారెక్కాడు. పోలీసులతడి కారును డిక్కీతోసహా శోధించి వెళ్ళనిచ్చారు.

తర్వాత నలుగురు పోలీసులింట్లో చొరబడ్డారు. ఇల్లంతా తిరిగారు. ఎక్కడా అనుమానించతగ్గ వస్తువు లేదు. ఇంట్లో యెవ్వరూ మనుషులు లేరు.

పోలీసులు బయటకు వెళ్ళిపోయారు.

కాసేపట్లో ఇంటి చుట్టూ పోలీసులెవ్వరూ లేరు.

ఆ తర్వాత కొద్దిక్షణాలకు గోడమీద బొమ్మలు ఆగిపోయాయి. గదిలో మళ్ళీ చీకటి....

గదిలో దీపం వెలిగేసరికి కిల్లర్‌కి ఎదురుగా అర్జున్ ఉన్నాడు

"నా పోలీసులు నన్నేమీ చెయ్యలేరని తెలుసుకున్నావా?" అన్నాడు అర్జున్.

"హేట్సాఫ్ టూ యూ .." అన్నాడు కిల్లర్.

"థాంక్యూ-" అని—"నా తెలివితేటలు చూశావు. ఇక నా బలం కూడా చూస్తావా?" అన్నాడు అర్జున్.

"ప్యార్ —" అంటూ కిల్లర్ మెరుపు వేగంతో అతడిమీదకు ఎగిరాడు.

మొత్తం మనిషిని ఒడిసిపట్టుకొని దూరంగా విసిరేశాడు అర్జున్.

కిల్లర్ ఓ మూలగా పడి వెంటనే లేవలేకపోయాడు. అతడికి కళ్ళు తిరిగాయి.

"లే...." అంటూ అర్జున్ అతణ్ణి సమీపించాడు.

ఇంకా లేవకుండానే కిల్లర్ తలెత్తి అతణ్ణి చూశాడు. అప్పుడు అర్జున్ అతడికి నిజమైన రాక్షసుడిలా అనిపించాడు.

"ఏమిటలా చూస్తున్నావు?" అన్నాడు అర్జున్.

"మొదటిసారి నిన్ను చూసినప్పుడు అందమైన రాక్షసుడిలా కనిపించావు. ఇప్పుడు రాక్షసుడిలా మాత్రమే కన్పిస్తున్నావు. అందంగా లేవు...." అన్నాడు కిల్లర్.

"నీకంటే ఎన్నిరెట్లు బలముందో చెప్పలేనుగానీ— బలానికి మించిన చురుకుతనముంది నా దగ్గర. నువ్వింకా కదలాలనుకునేసరికి నేను దెబ్బకు సిద్ధంగా ఉంటాను. నా సాటి వీరుడితో పోరాడాలని నాకు సరదా. నీ గురించి రాజా చెప్పింది విని పోరాడాలని సరదా వేసింది కానీ— నువ్వా లాభం లేదు...." అన్నాడు అర్జున్.

"నాకూ సరదాగానే ఉంది కానీ...." అంటూ కిల్లర్ ఊహించని విధంగా లేచి అర్జున్ భుజంమీద చేత్తో విసురు విసిరాడు. అర్జున్ వెల్లకిలా పడిపోయాడు.

కిల్లర్ అతడిమీదకు దూకాడు.

అర్జున్ చేయి జాపి అతడి మెడ పట్టుకున్నాడు గట్టిగా. ఆ పట్టుకు కిల్లర్‌కి ఊపిరి సలపలేదు. గిలగిల తన్నుకోసాగాడు.

"నువ్వు నటిస్తున్నావో, బాధపడుతున్నావో నాకెలా తెలుస్తుంది? రెండు చేతులూ శోధించి దగ్గర పెట్టు— వదిలేస్తాను...." అన్నాడు అర్జున్.

కిల్లర్ గిలగిల తన్నుకుంటున్నాడు తప్పితే చేతులు శోధించలేదు.

క్రమంగా కిల్లర్ నాలిక బయటకు వచ్చింది. కను గ్రుడ్లు తేలుకుని రాసాగాయి. అర్జున్ చటుక్కున అతణ్ణి వదిలి పెట్టి—"బాగా— మొండి మనిషి!" అను కున్నాడు.

కిల్లర్ మామూలు మనిషి కావడానికి చాలా సేపు పట్టింది.

"ఏం మనిషి? ప్రాణంకంటె అభిమానం ఎక్కువా?" అన్నాడు అర్జున్.

"నా ప్రాణంమీద నాకంటే నీకే అభిమానం ఎక్కు వగా ఉన్నట్లుంది. నన్ను చంపకుండా వదిలి పెట్టావేం?" అన్నాడు కిల్లర్.

"మృత్యుముఖంలోంచి బయటపడ్డ అనుభవం ఎలా ఉంటుందో అడిగి తెలుసుకుందామని!" అన్నాడు అర్జున్.

"అది స్వానుభవంలో తప్ప తెలియని విశేషం! ఇంతకీ నా పీక అంత గట్టిగా ఎందుకు నొక్కినట్లు?" ఆ తర్వాత నన్నెందుకు వదిలినట్లు?"

"చేతులు శోధించమన్నాను, శోధించలేదు. అందుకే గట్టిగా పీక నొక్కాను...." అన్నాడు అర్జున్.

"అంత గట్టిగా పీక నొక్కి చేతులు శోధించమంటే నాకేం తెలుస్తుంది. ఆ సమయంలో నాకు ప్రపంచం తెలియలేదు. పంచేంద్రియాలూ వాటి పనులు మానే

కాయి. పోనీలే. అయినా నువ్వు నా ప్రాణం కాపాడావు కాబట్టి ఇప్పుడు చేతులు జోడిస్తాను—" అంటూ కిల్లర్ అతడికి చేతులు జోడించి నమస్కరించి—"నీ తెలివికి, బలానికి, దయాగుణానికి—నీకివే జోహార్లు—" అన్నాడు కిల్లర్.

"నాకు జోహార్లర్పించావు. ఇక ముందేం చేస్తావు?"

కిల్లర్ మాట్లాడలేదు.

"నా మాట విని నాతో చేయి కలుపు...."

"అందువల్ల నీకే నష్టం...." అన్నాడు కిల్లర్.

"ఎందుకని?"

"నా దారి వేరు, నీ దారి వేరు. రెండూ కలవవు. కలపాలని నువ్వు ప్రయత్నిస్తే—నీ బలంతో తాత్కాలికంగా నన్ను లొంగదీసుకున్నా—ఎప్పుడైనా నా మనసు చెదిరి నీకు ద్రోహం తలపెడుతుంది...."

"అయితే నేను నిన్నేం చెయ్యాలంటావ్?"

"నన్ను వదిలిపెట్టు. లేదా అంతం చేసేయ్...."

"నిన్ను వదిలిపెడితే నాకు ప్రమాదం కదా!"

"నీకు నా బలం తెలుసు, తెలివి తెలుసు. రెండింట్లో నీకంటే అల్పుడిని. నానుంచి ప్రమాదాన్ని శంకిస్తే నువ్వు నన్ను గౌరవించినట్లు.... నిన్ను కించపర్చుకున్నట్లు.... కదూ?" అన్నాడు కిల్లర్ నవ్వుతూ.

"సవాలు చేస్తున్నావా?" అన్నాడు అర్జున్.

కిల్లర్ నవ్వి—"నీకే తెలుసు!" అన్నాడు.

"అయితే నీకో అవకాశమిస్తున్నాను. ఈ రోజు రాత్రి ప్రముఖ వ్యాపారస్థుడు దశరథరామయ్యగారింట్లో ప్రవేశించి—ఆయన పడకగదిలో రెండు గంటలు గడిపి రావాలి. రాత్రి పదకొండునుంచి ఒంటిగంటవరకూ...."

"ఎందుకని?"

"అలా గడిపివచ్చేక నిన్ను నేను వదిలిపెడతాను.."

"ఒకసారి నన్ను వదిలేక నేను నీకు మళ్ళీ దొరుకుతానా?"

అర్జున్ నవ్వి—"నీకే తెలుసు!" అన్నాడు.

"నువ్వు చెప్పింది నేను సాధిస్తాను...." అన్నాడు కిల్లర్.

తర్వాత గదిలో దీపం ఆరిపోయింది. చీకట్లో అర్జున్ అతణ్ణి ఎత్తుకొని యేవో మెట్లెక్కుతున్నాడని గ్రహించాడు కిల్లర్.

# 7

ముందుగా తన వ్యాన్లోకి వెళ్ళి చేతనను పలకరించి ధైర్యం చెప్పి—తర్వాత దశరధరామయ్యింటికి వెళ్ళాడు కిల్లర్.

సమయానికి దశరథరామయ్య ఇంట్లో లేడు. ఒక ముసలి నౌకరు కిల్లర్కు మర్యాదలుచేసి ఓ గదిలోకి తీసుకొని వెళ్ళాడు. కిల్లర్ ఆ ముసలి నౌకరు వివరాలు తెలుసుకొన్నాడు. అతడన్ని వేళలా యింటినే కనిపెట్టుకొని వుంటాడు. విశ్వాసపాత్రుడు.

"నువ్వెక్కడ పడుకుంటావ్?" అనడిగాడు కిల్లర్.

కిల్లర్ కూర్చున్న గదినానుకొనే ఓ గది వుంది. అదీ ఆ నౌకరు గది. సాధారణంగా ఆ గదిలో కెవ్వరూరారు.

ఇది వింటూనే కిల్లర్ ఆ నౌకరు మెడ వెనుక ఓ దెబ్బ కొట్టాడు. కిమ్మనకుండా అతను పడిపోయాడు. కిల్లర్ అతడి కాళ్ళూ చేతులూ బంధించి—త్వరగా తన వేషం మార్చుకొని గది తలుపులు వేసి బయటకు వచ్చాడు.

చాలాసేపు ఇంట్లో తిరిగి తన కప్పగించిన పనులన్నీ

చేశాడు. రాత్రి ఎనిమిదయ్యాక అతడికింకేమీ పనుండదు.

"పోయి పడుకోరా!" అన్నాడు దశరథరామయ్య. ఆయన ఇంటికి రావడమే రాత్రి ఏడింటికి వచ్చాడు.

"చిత్తం!" అని సెలవుతీసుకున్నాడు కిల్లర్. నౌకరు గదిలోనికి కాస్త ఫలహారం తీసుకొని వెళ్ళాడు. అతడి కట్లు విప్పి స్పృహ తెప్పించాడు.

నౌకరుకు ముందేమీ అర్థంకాలేదు.

"ఫలహారం తిను—" అన్నాడు కిల్లర్.

అది తిన్నాక నౌకరుకు ప్రాణం లేచివచ్చినట్టయింది. రాత్రి కళ్ళతడికంత బాగా కనిపించవు.

"ఏమయింది నాకు—నువ్వెవరు?" అన్నాడా నౌకరు.

"కళ్ళు తిరిగి పడిపోయావు. అయ్యగారు నిన్ను రాత్రంతా విశ్రాంతి తీసుకోమన్నారు...." అంటూ కిల్లర్ అతడికి మళ్ళీ స్పృహ తప్పించాడు.

ఆ గదిలోంచి తను బయటకు వచ్చి మెల్లిగా ఎవరూ చూడకుండా దశరథరామయ్యింటి పడక గదిలో ప్రవేశించాడు. ఎవరైనా చూసినా అతడినను మానించరు. నౌకరేడీ అని కాబట్టి అడిగితే అతడు తన గదిలో నిద్ర పోతూనే ఉంటాడు.

కిల్లర్ దశరాథరామయ్య గదిలో మంచం కింద దూరాడు. సమయంకోసం వేచి ఉన్నాడు.

# 8

రాత్రి పదకొండు గంటలకు దశరథరామయ్య గదిలో మొత్తం ఆరుగురు సమావేశమయ్యారు. వారిలో దశరథ రామయ్య ఉన్నాడు. మిగతా అయిదుగురిలో ఒకడు రాష్ట్రంలో పదవిలో లేని రాజకీయ నాయకుడు, మరొకడు కేంద్ర మంత్రివర్గంలో ఒక ప్రముఖుడి ప్రతినిధి—

అని అర్థమయింది కిల్లర్ కి.

సంభాషణ వింటున్న కిల్లర్ ఉలిక్కిపడ్డాడు.

మద్రాస్ లో ఒక సినీ నటుడింట్లో ఇన్ కంటాక్స్ రెయిడ్ జరిగింది. ప్రభుత్వానికి తెలియకుండా దాచిన ఆస్థి అరవై లక్షల రూపాయలు బయటపడింది.

విశాఖపట్నంలో స్మగ్లింగ్ కేసులో ప్రముఖ రాజకీయ నాయకుడి హస్తం ఉన్నట్లు ఆధారాలు దొరికాయి.

కాన్పూర్లో స్కూటర్ ఫ్యాక్టరీ పెడతామంటూ ప్రజల నుంచి డిపాజిట్లు వసూలు చేస్తోందొక సంస్థ. అది ప్రజలను మోసం చేయడం ఖాయం.

ఇలాంటి అవినీతికర విశేషాలెన్నో వాళ్ళు చర్చిస్తున్నారు. అయితే ఆ అవినీతిపరులకెలా రక్షణ కల్పించాలా అన్నది వారి సంభాషణలో చర్చనీయాంశం.

ప్రజలకన్యాయం జరిగినా ప్రభుత్వంమీద సానుభూతి నశించకూడదు. అవినీతిపరులకు రక్షణ కలిగించినా రూలింగ్ పార్టీపై దుష్ప్రచారం జరక్కూడదు.

అవినీతిపరులు తను దుష్కార్యాలు కొనసాగిస్తూ ప్రభుత్వానికి మద్దతునిస్తుంటారు. ప్రభుత్వం వారికి మద్దతునిస్తూనే ప్రజల్లో మంచి పేరు తెచ్చుకుంటుంది.

కిల్లర్ మొత్తం సంభాషణంతా విన్నాడు. ఎన్నో అమూల్య రహస్యాలతడికి తెలిశాయి.

ఆ గదిలోని సమావేశం రాత్రి ఒంటిగంటకు ముగిసింది.

అంతా బయటకు వెళ్ళాక కిల్లర్ తనూ గదిలోంచి బయటకు వచ్చాడు. కాసేపట్లో అటూ యిటూ పచార్లు చేసి నెమ్మదిగా బంగళాలోంచి బయటపడ్డాడు.

వాచ్ మన్ కూడా అతణ్నింటి నౌకరుగానే భావించి

అడ్డగించలేదు కానీ ఒకసారి—"ఏం ముసలాడా—నిద్ర పట్టడంలేదా?" అని పలకరించాడు.

"నాది నిద్రముఖం. రోజూ రాత్రిళ్ళు నీకు తెలియకుండా బయటకు వస్తూ పోతూనే ఉంటున్నాను...." అని కిల్లర్ అక్కణ్ణించి బయటపడ్డాడు.

ముందుగా అతడు ఓ సందులోకి వెళ్ళి తన వేషం మార్చుకున్నాడు. సంచిలో చుట్టచుట్టి పెట్టుకున్న—పాంటు, షర్టు తీసి బట్టలు మార్చుకున్నాడు. అక్కణ్ణించి తిన్నగా రాజా తనను తీసుకొని వెళ్ళిన యింటికి వెళ్ళాడు.

ఇల్లు ఖాళీగా వుంది. అయితే అతడు చేరిన కాసేపటి కక్కడికి అర్జున్ వచ్చాడు.

"వెళ్ళావా?" అన్నాడతడు.

"ఊఁ" అన్నాడు కిల్లర్.

"విన్నావా?"

"ఊఁ"

"ఏం తెలుసుకున్నావ్?"

"అవి నీకు చెప్పకూడని రహస్యాలు...."

అర్జున్ నవ్వి—తన జేబులోంచి ఒక పాకెట్ టేపు రికార్డర్ తీసి ఆన్ చేశాడు.

కిల్లర్ అది వింటూ ఉలిక్కిపడ్డాడు. కాసేపటి క్రితం తను విన్న సంభాషణ అది!

"ఇది నీ దగ్గరకెలా వచ్చింది?" అన్నాడతడు ఆశ్చర్యంగా.

"ఎలా వచ్చిందని అడక్కు! ఈ దేశంలో నాకు తెలియని రహస్యాలుండవు...."

"ఎలా తెలిసింది?" అని—"నువ్వు దశరథరామయ్య మనిషివా?" అన్నాడు కిల్లర్ ఆలోచనగా.

"దశరథ రామయ్య నా ప్రత్యర్థి...." అన్నాడు అర్జున్.

"అక్కడి విశేషాలు నువ్వు తెలుసుకోగలిగినప్పుడు— నన్నెందుకు పంపావు?"

"ఎందుకా? నువ్వు నమ్మిన నీతిని, చట్టాన్ని పరిరక్షించడానికి—నువ్వెన్నుకొన్న నాయకులు—తమ బాధ్యతల నే విధంగా నిర్వహిస్తున్నారో తెలుసుకుంటావని!" అన్నాడు అర్జున్.

"నేను తెలుసుకోవడమెందుకు?" అన్నాడు కిల్లర్.

"చూడు బ్రదర్! తలిదండ్రులు తాము కోరినవన్నీ కొనిపెట్టాలని పిల్లలనుకొంటారు. ఆ పిల్లలే తలిదండ్రులైనప్పుడు తమ పిల్లలు కోరినవన్నీ కొనిపెట్టలేరు. ఉపాధ్యాయులు పాఠాలు చెప్పకుండా, ఊరికే మార్కులివ్వాలని విద్యార్థులనుకుంటూంటారు. ఆ విద్యార్థులుపాధ్యాయులైనప్పుడు తామలా చేయలేరు.

కార్మికులు యాజమాన్యానికి వ్యతిరేకంగా సమ్మె చేస్తారు. ఆ కార్మికులకే యాజమాన్యంలో స్థానం లభిస్తే కార్మికుల కోర్కెలను నిరసిస్తారు. ప్రతిపక్షాలు ప్రభుత్వాన్ని దుమ్మెత్తిపోస్తాయి. తాము ప్రభుత్వంలోనికి వస్తే ఆ ప్రతిపక్షాలు—ఒకనాటి తమ కోర్కెల గురించి మర్చిపోతాయి .... ఇదంతా ఎందుకు చెబుతున్నానో తెలుసా?" అన్నాడు అర్జున్.

"తెలియదు—నువ్వే చెప్పు—" అన్నాడు కిల్లర్.

"సామాన్య పౌరులు పౌరులుగా ఉన్నప్పుడు కట్టుబడిన నీతి, నిజాయితీ పదవిలో ఉన్నప్పుడు — వారిని ఇబ్బందులకు గురిచేస్తాయి. అందుకని చట్టానికి పరిరక్షకులైన వారే — చట్టవిరుద్ధమైన పనులు ప్రోత్సహించక

తప్పదు. బాధ్యతలు మనిషిని వాస్తవానికి అనుగుణంగా మారుస్తాయి...."

"ఇదంతా ఎందుకు చెబుతున్నావు?"

"పూర్తిగా విను. కట్నం చట్టవిరుద్ధం. లంచం చట్టవిరుద్ధం. కానీ సామాన్య పౌరులు తమకు వీలుగా ఉన్నందున ఈ విషయాల్లో చట్టాన్ని ఉల్లంఘిస్తున్నారు. అలాగే వ్యాపారస్తులు, రాజకీయ నాయకులు, అధికారులు, మంత్రులు — తమ తమ వీలునుబట్టి చట్టాన్ని ఉల్లంఘిస్తున్నారు. ఇందులో ఎవరూ దేనికీ ఆవేశపడవలసిందిలేదు. నీకు తెలిసిన నిజాయితీపరులు, నీకు తెలిసిన గౌరవనీయులు, నీకు తెలిసిన రాజకీయ నాయకులు — ఏం మాట్లాడుకున్నారో నువ్వే స్వయంగా విన్నావు. అలాంటప్పుడు — నీవంటివారు మావంటి వారికి వ్యతిరేకంగా పనిచేయడమెందుకు?" అన్నాడు అర్జున్.

"అయితే ఏం చేయాలంటావ్?"

"మాతో చేతులు కలుపు. నీకు సుఖ జీవనం. మాకో సమర్థుడి అండ...."

"ఐయాం సారీ మిస్టర్ అర్జున్.... ఎవరో తప్పులు చేస్తున్నారని నేనూ చేయలేను తప్పులు...."

"తప్పులు చేస్తున్నది ఎవరో కాదు.... మోజుపడి ప్రజ ఎన్నుకొన్న నాయకులు...."

కిల్లర్ నవ్వి — "నాయకులందరూ మోసగాళ్ళు కారు. అంతా మోసగాళ్ళే అయితే దేశమీమాత్రం ముందుకు వెళ్ళేదికాదు. వారిలో కొందరు ప్రజాసేవకులున్నారు. కొందరు దోపిడీదారులున్నారు. వీరిద్దర్నీ బ్యాలన్సు చేసే మధ్యరకం వాళ్ళున్నారు...." అన్నాడు.

"నువ్వు తెలివైనవాడివి. మాటలతో నిన్నొప్పించడం

కష్టం....మా జోలికి రానని మాటిస్తే నిన్ను తప్పక వదిలి పెట్టగలను...." అన్నాడు అర్జున్.

"నన్ను వదలకపోతే మీ పునాదులు కదిలిపోతాయి. అలాంటి యేర్పాట్లన్నీ బయట చేసి వచ్చాను...."

"నీ ఏర్పాట్లకు నేను భయపడను. వాటిని ఛిన్నాభిన్నం చేయగల సమర్థత నాకుంది—" అన్నాడు అర్జున్.

అర్జున్, కిల్లర్ ముఖముఖాలు చూసుకొన్నారు.

"నీకంటే బలవంతుణ్ణి. నా మాట వినకపోతే నిన్ను సర్వనాశనం చేస్తాను...." అంటున్నాయ్ అర్జున్ కళ్ళు.

"నేను నీకు భయపడను. చావుకైనా సిద్ధం...." అంటున్నాయ్ కిల్లర్ కళ్ళు.

"ఇంకెప్పుడూ మా జోలికి రానని మాటివ్వు...." అన్నాడు అర్జున్ మళ్ళీ.

"నిలబెట్టుకోలేని మాట యిచ్చి మాత్రం ఏం ప్రయోజనం?" అన్నాడు కిల్లర్.

"నువ్వు మాటివ్వాలి. అది నిలబెట్టుకోవాలి. ఎందుకంటే అప్పుడే నువ్వు చేతన శంకరంలాంటి వారికి సాయపడగలుగుతావు!" అని...."నువ్వు నా మాట విను. దేశంలో సామాన్యులెందరో ఇబ్బందులు పడుతున్నారు. నాయకులు వారికి తీయని మాటలు చెబుతారు. చట్టం వారిని న్యాయస్థానాల చుట్టూ తిప్పుతుంది. వారికి నీవంటివారే అండగా ఉండాలి. మాబోటి వారితో వైరం పెట్టుకొని నువ్వు సాధించేదేమీ ఉండదు—సామాన్యులకు దూరంకావడం తప్ప! ఒకవేళ నిజంగానే నువ్వేదైనా సాధించగలిగావా—అప్పుడు దేశపు పునాదులే కదిలిపోతాయి...." అన్నాడు అర్జున్.

కిల్లర్ ఆలోచనలోపడ్డాడు. అర్జున్ చెబుతున్నది

నిజం! దేశం మొత్తంలోని అవినీతి సాదిరించడం మనవల్ల కాదు. దేశపు నాయకత్వ రథానికి, నీతి, అవినీతి— రెండు చక్రాలై —నడిపిస్తున్నాయి.

"చేతన విషయంలో నీ గెలుపు నంగీకరిస్తాం. మేమిక ఆ అమ్మాయి జోలికి వెళ్ళం. అయితే నువ్వూ ఈ కేసు నిక్కడితో మరిచిపోవాలి...."

"మరి రాజా విషయం!"

"నీ పరిశోధన విజయవంతం అవుతుంది. రాజా పట్టుబడతాడు. అయితే రాజాను నడిపించేవారు వేరే ఉన్నారని ఎవరికీ తెలియకూడదు. కేసు రాజా దగ్గర ఆగిపోవాలి...."

కిల్లర్ నవ్వి-"నిజం చెప్పాలంటే కేసు నీ దగ్గరా ఆగకూడదు .... నిన్నూ నడిపించేవారున్నారని నాకు తెలుసు...." అన్నాడు.

"ఎలా?" అన్నాడు అర్జున్ ఆశ్చర్యంగా.

"భగవంతుడు బలాన్నీ, తెలివినీ ఒకేచోట ఉంచకుండా జాగ్రత్త తీసుకుంటాడు. నీ బలం అసామాన్యం. దానికి నేను తలవంచాను. నీకింత తెలివుందంటే—అది నీది కాదని నేనూహించాను, నా ఊహ తప్పుకాదు...." అన్నాడు కిల్లర్.

"నువ్వసాధ్యుడివి. అయితే నా గురించి ఇంకేమీ ఊహించకు...."

"ఒప్పుకుంటున్నాను. మీరు ప్రస్తుతానికి మత్తు పదార్థాల రవాణా మానెయ్యాలి. చేతన, శంకరం జోలికి వెళ్ళకూడదు...."

"రాజా పట్టుబడగానే మత్తుపదార్థాల రవాణా ఎలాగా ఆగిపోతుంది. అయితే అది తాత్కాలికం

మాత్రమే!" అన్నాడు అర్జున్.

"మిమ్మల్ని శాశ్వతంగా దారిమళ్ళించే ఉపాయం లేదా?"

"ఉంది—ప్రజల చైతన్యంలో దాగుని వుంది...."

"మిస్టర్ అర్జున్....నువ్వు చెప్పింది నిజం. ప్రజల్లో చైతన్యం కలిగేవరకూ నేను వారికి సాయపడక తప్పదు. నా కేసుకు సంబంధించిన విషయాల్లో తప్ప— నేను మీ వ్యవహారాల్లో జోక్యం చేసుకోను...." అన్నాడు కిల్లర్.

"ఓకే!"

"కానీ నువ్వు నన్నిలా వదిలిపెడుతున్నావంటే నేను నమ్మలేకున్నాను. నావల్ల ప్రమాదముందని తెలిసీ— నన్నెందుకు వదిలిపెడుతున్నావు?"

"ఈ ప్రపంచాన్ని అవతారపురుషులకంటే ఎక్కువ కాలం హిరణ్యాక్షు, హిరణ్యకశిపులూ, రావణాసురులూ- ఎక్కువకాలం ఏలారు. అయితే వరగర్వంతో మిడిసిపడి అజాగ్రత్తలో ఉన్న కారణంగా వారు సర్వనాశన మయ్యారు. మేములా కాదు. నీ వంటి సమర్థులను మాకు వ్యతిరేకంగా పని చేయనిస్తాం. నీ సమర్థత మా సమర్థతను పెంచుతుంది. నీ ఉనికి మమ్మల్ని అప్రమత్తుల్ని చేస్తుంది. నీ విజయం మాకు హెచ్చరిక అవుతుంది. ఆ విధంగా నువ్వు మా జీవితకాలాన్ని పెంచుతావు...." అన్నాడు అర్జున్.

"ఓ కొత్తవిషయం తెలుసుకున్నాను...." అన్నాడు కిల్లర్ ఆశ్చర్యంగా.

"మరో విషయం. నువ్వు మాకో హెచ్చరికవు. నీ ఉనికి మా కవసరం. అయితే పట్టుబడ్డ రాజా—తనమీద ఆరోపించబడిన నేరాల కాధారాలు దొరక్క త్వరలో నే

విడిచిపెట్టబడుతాడు. అప్పుడు నువ్వా వేళపడకూడదు."
అన్నాడు అర్జున్.

"మరేం చేయాలి?"

"అది మా నుంచి హెచ్చరికగా నువ్వు భావించాలి!"

కిల్లర్ అక్కణ్ణించి బైటపడ్డాక కూడా ఆ వాక్యమే అతడి చెవుల్లో గింగురుమంటోంది. అతడిప్పుడు ఒకనాటి కిల్లర్ కాదు!

—: అయిపోయింది :—

# రాత్రి పన్నెండున్నర గంటలు

బొమ్మిడి అచ్చారావు

రాత్రి పన్నెండున్నర గంటలయింది.

అకస్మాత్తుగా మెలకువ వచ్చింది అరుణ్ కి. చెవుల్లో ఏదో హోరు. ఎవరో చెవిదగ్గరగా మెల్లిగానే అయినా, అతి స్పష్టంగా చెపుతున్నారు:

"రా, నడచిరా ...తిన్నగా వచ్చెయ్యి!" అంటూ. అరుణ్ లేచి మంచం దిగాడు. గదిలో బెడ్ లాంపు వెల్తురు పల్చగా పరచుకుని వుంది. తలుపులు బార్లా తెరిచి వున్నాయి.

అరుణ్ ఏదో మైకంలో వున్నవాడిలా అలాగే ముందుకు నడుస్తున్నాడు. పోర్టికోలోకి వచ్చాడు. అక్కడ కాంతివంతమైన దీపం వెలుగుతోంది.

మెయిన్ గేటు తెరచివుంది.

అరుణ్ గేట్లోంచి రోడ్డుమీదికొచ్చాడు. స్ట్రీట్ లైట్సు వెలగటంలేదెందుకో.

సెకండ్ షో. జనం అంతక్రితమే యిళ్ళకు తిరిగి వెళ్ళి

పోయారు. రోడ్లన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. అంతటా భయంకరమైన నిశ్శబ్దం!

అరుణ్ ఎటూ చూడకుండా తిన్నగా నడుస్తున్నాడు. మెయిన్ రోడ్డు వదిలి సందులు గొందుల్లోంచి నడుస్తున్నాడు. అలవాటుపడిన దారిన నడుస్తున్నవాడిలా బాహ్య స్పృహ లేనివాడిలా మౌనంగా నడుస్తున్నాడు. అలవాటు పడిన దారిన నడుస్తున్నట్టు, ఎలాంటి ఆటంకాలు లేకుండా ముందుకి సాగిపోతున్నాడు.

రోడ్డు వదిలి కంకర రోడ్డుమీదికి మళ్ళాడు.

ఊరు చివర ప్రాంతమది! స్మశానం!

దూరంగా ఏవో మంటలు కనిపిస్తున్నాయి.

అరుణ్ సరాసరి ఆ మంటల్ని సమీపించాడు. సగం కాలుతున్న శవం యింకా చితిమీదనే వుంది. ఎక్కడో తీతువులు కర్ణకఠోరంగా అరుస్తున్నాయి.

అరుణ్ ఇంకా ముందుకి నడుస్తున్నాడు. ఎండుపుల్లలు, విరిగిన మట్టిపాత్రలు, శిథిలమైన శవాల ఎముకలు అతని కాళ్ళక్రింద ఫటిల్లున పగులుతున్నాయి.

అరుణ్ ఏకాగ్రతతో స్మశానం మధ్యకు నడిచి, ఆగిపోయాడు. గాలి వీచటంలేదు. ఒక్కసారిగా స్తంభించిపోయింది. శవం కాలుతున్న కవురుకంపు ఆ ప్రదేశం నిండా అలముకుని జుగుప్సపుట్టిస్తోంది.

అరుణ్ ఎవరో ఆజ్ఞాపించినట్టు అక్కడ కూలబడ్డాడు. కాళ్ళు బాచిపట్టు వేసుకొని నిష్టగా కూచున్నాడు. నిద్రలో జోగుతున్నట్టుగా మెల్లిగా ఏవో నోటితో ఉచ్చరిస్తున్నాడు అస్పష్టంగా.

చితి వెలుగు అతని ముఖంమీద ప్రతిఫలించి అతని ముఖాన్ని భయంకరంగా మార్చివేసింది. అతని కళ్ళు

తెరుచుకునే వున్నాయి. ఆ వెలుగులో మండుతున్న జ్యోతుల్లా, రక్తపుముద్దల్లా ఎర్రగా వున్నాయవి.

ఎవరో అతనికి అతి సమీపంలో కూచుని వున్నారు. అంతదాకా కనిపించని వ్యక్తి ఒక్కసారిగా అతనిముందు ప్రత్యక్షమయ్యాడు.

"నీ పేరు?" అడిగాడతను అరుణ్ కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

"జనార్దనం!" అన్నాడు అరుణ్. అతని గొంతులో ఏదో మార్పు వచ్చింది.

"నువ్వెప్పుడు చనిపోయావు?"

"ఆరు నెలల క్రితం!"

"ఎలా చనిపోయావు?"

"హత్య చేయబడి."

"ఎవరు చేశారు హత్య?"

"మా చిన్నాన్న. ఆస్తికోసం!"

"ఇది మరెవరికైనా తెలుసా?"

"నాకు తప్ప మరెవరికీ తెలియదు."

"మంచిది. నువ్వెళ్ళొచ్చు."

అరుణ్ లేచి నిల్చున్నాడు. ఒక్కసారిగా పెనుగాలి వీచింది. చితిమంట ఆ గాలికి మరింత ప్రజ్వలంగా వెలుగుతోంది. నక్కల ఊళలు కర్ణకఠోరంగా వినిపిస్తున్నాయి.

అయితే అవేవీ అరుణ్ చెవులకు తాకటంలేదు. అతను కలలో నడుస్తున్నవాడిలా స్మశానం నుంచి బయటికొచ్చి కంకరరోడ్డెక్కాడు. పదడుగులు వేసి కుప్పలా కూలిపోయాడు.

ఆ మరుక్షణమే అతనికి స్పృహ తప్పిపోయింది.

# 2

అతనికి స్పృహ తెలిసేసరికి తన యింట్లో తన పడగ్గదిలో వున్నాడు. మంచం చుట్టూ అన్నయ్య' చిన్నాన్న, తల్లి, చెల్లెలు కూచుని తన ముఖంలోకి ఆత్రుతగా, ఆందోళనగా చూస్తూండటం కనిపించింది.

అరుణ్ గభున లేచి కూచున్నాడు.

"ఏమిటి, నాకేమయింది? మీరెందుకిలా నా చుట్టూ మూగి వున్నారు?" అనడిగాడు అయోమయంగా.

అన్నయ్య కిశోర్ చెప్పాడు. "అర్ధరాత్రి నాకెందుకో మెలకువవచ్చి చూస్తే గదిలో నువ్వు లేవు. తలుపులన్నీ తీసి వున్నాయి. వెంటనే మన కారు తీసుకుని రోడ్డున వెతుక్కుంటూ బయల్దేరాను. స్మశానానికి దగ్గర్లో స్పృహతప్పి పడున్నావు. నేను భయపడి నీ నాడి చూశాను. కొట్టుకుంటోంది. వెంటనే కార్లో పడుకోబెట్టి తీసుకొచ్చాను."

అరుణ్ ఆశ్చర్యంగా అన్నవంక చూసి, "నేను స్మశానం దగ్గర్లో స్పృహతప్పి పడిపోయానా? అసలు నేను మన గేటు దాటి వెళ్ళడం కూడా నాకు గుర్తులేదు." అన్నాడు.

తల్లి కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ, "బాబూ, ఇది రెండోసారి. వారం రోజులక్రితం మొదటిసారిగా ఇలాగే యింట్లోంచి అర్ధరాత్రిపూట వెళ్ళిపోయావు. అయితే ఆ రోజు మనకు తెలిసిన పెద్దమనిషి వేదా సెకండ్ షో చూసి కార్లో వస్తూ నిన్ను గుర్తుపట్టి, ఎక్కించుకుని తీసుకొచ్చి అప్పగించాడు. మళ్ళీ ఇప్పుడిలా చేశావు" అన్నది.

అరుణ్ ఆమెవంక గాజుకళ్ళతో చూసి, "నిజంగా ఏం జరిగిందో నాకు తెలియదమ్మా! నాకేమాత్రం గుర్తు

లేదు. రాత్రి తొమ్మిదిన్నరవరకు ఇంగ్లీషు నవల చదువుకుని మంచినీళ్ళు తాగి పడుకున్నాను. మళ్ళీ ఇప్పుడే మెలకువ వచ్చింది" అన్నాడు.

అరుణ్ చిన్నాన్న అతనివంక సూటిగా చూస్తూ, "గుర్తు తెచ్చుకో! వారం రోజుల క్రితం వెళ్ళినప్పుడు కూడా నాకేం గుర్తులేదన్నావు. అప్పుడు రోడ్డు ప్రమాదం జరిగి వుండేదని, తృటిలో తప్పిపోయిందని నిన్ను తెచ్చిన వేదాగారు చెప్పారు. రెండోసారి క్షేమంగా బయట పడ్డావు—సమయానికి కిశోర్ మేలుకొని చూడటంవల్ల!" అన్నాడు. ఆయన పేరు ప్రసాదరావు.

అరుణ్ ఆయనవంక చూసి, "నాకేం గుర్తు రావటం లేదు చిన్నాన్నా! అంతా అయోమయంగా వుంది" అన్నాడు. అతని తల వేయి సమ్మెటలతో కొడుతున్నట్టు ఒకటే నొప్పి. చెవుల్లో ఏదో హోరు. తల పట్టుకుని మంచం మధ్య అలాగే కూచుండిపోయాడు.

"అన్నయ్యనెందుకలా వేధిస్తారు? కాసేపు విశ్రాంతిగా పడుకోనివ్వండి. ఏదయినా గుర్తొస్తే తెల్లారాక చెపుతాడు కదా!" అన్నది అరుణ్ చెల్లెలు స్రవంతి. అన్న పరిస్థితికి ఆమె చాలా బాధపడుతోంది.

"నేను తమ్ముడి గదిలో పడుకుంటా నీరాత్రికి. మీ రందరు వెళ్ళిపొండి" అన్నాడు కిశోర్.

తల్లి, ప్రసాదరావు, స్రవంతి ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

కిశోర్ తమ్ముడి పక్కనే మంచం వేసుకొని, "పడుకో అరూ, ఇంకేమీ ఆలోచించవద్దు ప్రశాంతంగా నిద్రపో!" అన్నాడు అనునయంగా.

అరుణ్ పడుకున్నాడేగాని, చాలాసేపటివరకు నిద్ర

రాలేదు. ఏవేవో పిచ్చి ఆలోచనలు ముసురుకొంటున్నాయి.

తనకి గతంలో ఎప్పుడూ యిలా నిద్రలో నడిచే లక్షణంలేదు. ఇప్పుడు కొత్తగా యిదేమిటి? తమ కుటుంబంలో కూడా ఎవరికీ ఇలాంటి వ్యాధిలేదు. తనకి సంక్రమించిందేమిటి?

అరుణ్ బాగా కలవారి కుటుంబంలో పుట్టాడు. అతని తండ్రి పెద్ద బిజినెస్ మేగ్నెట్. ఎలాంటి వ్యాపారం తలపెట్టినా లక్షలకు లక్షలు లాభాలు కురిశాయి. పట్టిందల్లా బంగారమయింది. కోటికి పడగలెత్తాడు.

అయితే విధి వక్రించి ఆకస్మాత్తుగా రోడ్డు ప్రమాదంలో దుర్మరణం పాలయ్యాడు. ఊరి పొలిమేరల్లో స్మశానం సమీపంలో ఆయన వస్తూన్న చెవర్లెట్ కారును లారీ ఢీకొని తుత్తునియలు చేసేసింది.

అప్పటిదాకా అన్నగారికి సాయంగా ఆయన వ్యవహారాలు చూస్తున్నాడు ప్రసాదరావు. ఆయన హఠాన్మరణంతో అన్ని వ్యవహారాలు అతనే తన భుజస్కంధాలమీద కెత్తుకున్నాడు. అప్పటికి ప్రశాంతికి పదేళ్ళుంటాయి. కిశోర్ కి పన్నెండేళ్ళు.

ఇది జరిగి దాదాపు పదేళ్ళు కావస్తోంది.

ఇప్పుడు కిశోర్ చిన్నాన్నతో కలిసి తమ ఫ్యాక్టరీకి వెళ్ళివస్తూన్నాడు. చాలావరకు వ్యాపార రహస్యాలు ఆకళింపు చేసుకున్నాడు.

అరుణ్ బి.కామ్ ఫైనలియర్ పరీక్షలు రాశాడు, ఆ సంవత్సరమే. రిజల్ట్సు రావలసి వుంది. ఎం.కామ్ చెయ్యాలనుకొంటున్నాడు.

ప్రశాంతి ఎం.బి.బి.యస్ మొదటి సంవత్సరంలో వుంది. అది ఆమె తండ్రి ఏంబిషన్. బతికుండగా కూతుర్ని డాక్టర్ని చేస్తానని అందరితో ఆనందంగా చెప్తూండేవాడాయన. ప్రశాంతికి అదంతా గుర్తుంది. అందుకే పట్టుదలగా చదివి, మెడికల్ ఎంట్రన్స్‌లో ఫస్టు రాంక్ తెచ్చుకొని మెడిసిన్‌లో సీటు తెచ్చుకొంది.

ఛార్టర్డ్ అకౌంటెంట్‌గా పెద్ద పేరు సంపాదించాలని అరుణ్ విషయంలో అతని తండ్రి కోరుకొనేవాడు. అందుకే అరుణ్ కామర్సు తీసుకున్నాడు. ఓపక్క ఎం.కామ్. చేస్తూ సి.ఏ. చెయ్యాలని అతను ప్లాన్ చేసుకున్నాడు ప్రస్తుతం ఈవెనింగ్ కాలేజీలో సి.ఏ. కోర్సుకి హాజరవుతున్నాడు కూడా.

అరుణ్ చాలా తెలివైనవాడు. అయిదున్నర అడుగుల పొడవుతో సన్నగా అయినా బలంగా వుంటాడు. స్ఫురద్రూపి. ఎండలో నడిస్తే కందిపోతాడనిపించే శరీరచ్ఛాయ. మనస్తత్వం కూడా చాలా సున్నితం. ఎవర్ని నొప్పించడు. ఎవరైనా చిన్నమాటన్నా పడడు.

అలాంటి అరుణ్ ప్రవర్తనలో అనుకోకుండా వచ్చిన ఈ ఆకస్మిక వింత పరిణామానికి అతని కుటుంబ సభ్యులంతా విచారసముద్రంలో మునిగిపోయారు.

వారం రోజుల క్రితం అతడు నిద్రలో నడుస్తూ వెళ్ళిన సమయానికి అతని గదిలో మరెవరూ లేరు. ఈసారి కూడా అతను ఒంటరిగానే పడుకొని నిద్రపోతుండగా అదే సంఘటన రిపీట్ అయింది.

అందుకే ఇకమీదట తమ్ముడ్ని రాత్రిళ్ళు ఒంటరిగా నిద్రపోనివ్వకూడదని, తను తోడుగా పడుకోవాలని నిర్ణయించుకున్నాడు కిశోర్.

# 3

"అమ్మా, అన్నయ్యని చిన్నాన్న హత్య చేయించాడు" రవీంద్ర మాటలకి ఉలిక్కి పడింది విశాలాక్షి.

"ఏమిట్రా రవీ, నువ్వు చెప్తున్నది? జనార్దనాన్ని మీ చిన్నాన్న హత్య చేయించాడా? నువు కలగాని కంటున్నావా? జనార్దనం సముద్ర స్నానానికి వెళ్ళి చనిపోయాడు. అది అందరికీ తెలిసిన విషయమే! జనార్దనం చనిపోయిన రోజున మీ చిన్నాన్న ఊళ్ళోకూడా లేరు."

"అదేనమ్మా ఆయన గొప్పదనం! తనమీదికి అనుమానం రాకుండా చాలా తెలివిగా ఊళ్ళోలేకుండా ప్రయాణం పెట్టుకొని, సమయానికి ఎక్కడున్నించో ఊడిపడి పని పూర్తిచేసుకొని వెళ్ళిపోయాడు."

"నేను నమ్మను. మీ చిన్నాన్న అలాంటివారుకాదు. జనార్దనాన్ని చంపాల్సిన అవసరం అతనికేముంది?"

"ఆ విషయమే నాకూ అంతు బట్టడంలేదు. అన్నయ్యని చంపడంవల్ల చిన్నాన్నకేం లాభముంది?"

"నువ్వు పొరబడుతున్నావు రవీ. అనవసరమైన అపోహలతో నీ మనసు పాడుచేసుకోకు, నా మనసు పాడు చెయ్యకు!"

"అమ్మా, చిన్నాన్నమీద నేరారోపణ చెయ్యటం నా అభిమతం కాదు. అన్నయ్యది ప్రమాదవశాత్తు సంభవించిన మరణం కాదు—హత్య అని తెలిసినప్పట్నించీ నా మనసు మనసులోలేదు. అందుకు సహేతుకమైన కారణం తెలుసుకోనేవరకు నాకు మనశ్శాంతి వుండదు!"

"అసలు నీకీ అనుమానమెందుకొచ్చింది?"

"అవసరమొచ్చినపుడు, చెప్పాల్సిన సందర్భం వచ్చినపుడు తప్పక చెప్తాను" అన్నాడు రవీంద్ర.

విశాలాక్షి కొడుకు వంక సాలోచనగా చూసింది.

ఆమెకిద్దరే కొడుకులు. జనార్దనం, రవీంద్ర.

రవీంద్ర రెండు నెలల పిల్లాడుగా వున్నప్పుడే ఆమె భర్త ఫ్యాక్టరీలో ప్రమాదానికి గురై చనిపోయాడు. అప్పటికి జనార్దనం అయిదేళ్ళ పిల్లాడు. అప్పట్నుంచీ కొన్నాళ్ళపాటు పుట్టింట్లో వున్నది విశాలాక్షి.

జనార్దనం పెరిగి పెద్దాడయ్యాక మళ్ళీ సిటీ వచ్చారు తల్లీకొడుకులు ముగ్గురు. జనార్దనం తండ్రి పనిచేసి ప్రమాదానికి గురైన ఫ్యాక్టరీలోనే అకౌంటెంటుగా ఉద్యోగం సంపాదించాడు. తండ్రి ప్రమాదానికి గురైనందున ఆ ఫ్యాక్టరీలోనే కొడుక్కి ఉద్యోగమివ్వటం న్యాయమని భావించాడు కిశోర్.

ఆ ఫ్యాక్టరీ కిశోర్ తండ్రి స్థాపించినదే!

జనార్దనం చిన్నాన్న పోలారావు అదే ఫ్యాక్టరీలో ఫోర్మన్ గా పనిచేస్తున్నాడు.

పోలారావు తన అన్న కుటుంబం వాళ్ళ పుట్టింట్లో ఉన్నంతకాలం వాళ్ళెలా వున్నారో, ఏం కష్టపడుతున్నారో ఓసారి చూడాలని ఏనాడూ ప్రయత్నించలేదు. పైగా జనార్దనం ఉద్యోగంకోసం ప్రయత్నిస్తూన్నపుడు కూడా సాయం చెయ్యలేదు.

అయినా జనార్దనం ఆ ఉద్యోగానికి కావలసిన అర్హతలు కలిగివుండటం, కిశోర్ కి అతనిపట్ల సానుభూతి యేర్పడటం—యీ రెండూ జనార్దనానికి ఉద్యోగాన్ని సంపాదించి పెట్టాయి.

ఆ తర్వాతినుంచే పోలారావు ఆ యింటికి మళ్ళీ రాకపోకలు సాగించాడు. జనార్దనం మాత్రం చిన్నాన్నపట్ల చాలా విముఖత్వం ప్రదర్శించేవాడు. కష్టాల్లో ఉన్నపుడు

ముఖం చాటు చేసి, తనో గుర్తింపున్న ఉద్యోగం సంపాదించుకోగానే, తనకి అధిక సహాయం ఏదీ అవసరం లేదని నిర్ధారణ చేసుకున్నాక తను యింటివైపు తొంగి చూశాడు. అందుకే చిన్నాన్నపట్ల జనార్దనానికి సదభిప్రాయంలేదు. పాలిటెక్నిక్‌లో సివిల్ కోర్సు చదువుతున్న రవీంద్రకి కూడా చిన్నాన్నపట్ల మంచి అభిప్రాయం లేదు.

విశాలాక్షి మాత్రం మరది యిన్నాళ్ళకయినా తన యింట కాలు పెట్టినందుకు చాలా ఆనందించింది. కొడుకుల్ని మందలించి చిన్నాన్నతో సత్సంబంధాలు ఏర్పరచుకోమని ఒత్తిడి చేసింది.

తల్లిని బాధపెట్టడం ఇష్టంలేక అన్నదమ్ములిద్దరు చిన్నాన్నను పలకరించటం అలవాటు చేసుకున్నారు.

ఆ తర్వాత రెండు నెలలకి ఏదో పండగ సందర్భంగా సముద్ర స్నానానికి వెళ్ళిన జనార్దనం లోతున స్నానం చేస్తూ మునిగిపోయాడు. మరో గంట తర్వాత అలలు అతడి శవాన్ని ఒడ్డుకు విసిరేశాయి. అతడు ప్రమాదవశాత్తూ మునిగి చనిపోయాడని అందరు నిర్ధారించారు.

కాని ఇప్పుడు రవీంద్ర, జీర్ణించుకోలేని విషయం చెప్పగానే విశాలాక్షి తెల్లబోయింది. నమ్మలేదు. కాని ఎందుకో ఆమె మనసులో అస్పష్టంగా అనుమాన వీచికలు కదలాడాయి జనార్దనం చనిపోవటానికిముందు జరిగిన ఓ సంఘటన గుర్తుకొచ్చింది.

ఆ సంఘటన తలచుకొనేకొద్దీ ఆమెలోని అనుమానం మరింతగా బలపడసాగింది. రవీంద్ర మాటల్ని అందు కన్వయించుకుంటే ఆమెకేదో స్ఫురించినట్టే అనిపించింది.

అలా జరగటాని కవకాశముంది!

కాని .... కాని .... కోలారావు అంత దుర్మార్గుడా? చిన్న విషయానికే అన్న కొడుకుని, రక్త స్పర్శ వున్న వాడ్ని చంపుతాడా?

విశాలాక్షి మెదడు ఆలోచనలతో వేడెక్కిపోయింది.

## 4

"ఈ రోజునించీ నేను నీ గదిలోనే పడుకొంటున్నాను" అన్నాడు కిశోర్.

రాత్రి పదిగంటలు.

అప్పటిదాకా 'మర్కెంటైల్ లా' చదువుతున్న అరుణ్ పుస్తకంనించి తలెత్తి అన్నవైపు చూసి చిన్నగా నవ్వి, "నేనేమైనా చిన్నపిల్లవాడినా?" అన్నాడు.

"చిన్నపిల్లవాడవు కాదుగాబట్టే నీ గదిలో పడుకొంటున్నాను. నాన్నగారు నీమీద పెట్టుకున్న ఆశల్ని నిజం చెయ్యటానికి నా వంతు బాధ్యత నేను నిర్వర్తించాలి కదా!" అన్నాడు కిశోర్ నవ్వుతూ.

"నేనింకా ఓ గంట చదువుకుంటాను. లైటుంటే నీకు నిద్రపట్టదు కదా! బెడ్ లాంప్ వేసుకుంటానులే!" పెద్ద లైటు తీసెయ్యబోయాడు అరుణ్.

కిశోర్ వారించి, "ఉండనివ్వు, నేనుకూడా అప్పుడే నిద్రపోవటంలేదు. ఫ్యాక్టరీ అకౌంట్స్ రాసుకుంటాను" అన్నాడు ఫైళ్ళు ముందేసుకొని టేబిల్ దగ్గరకు కుర్చీ లాక్కుంటూ.

అరుణ్ అన్నవైపు ఓ సారి చూసి తిరిగి తన పుస్తకంలో లీనమయిపోయాడు.

పదకొండు గంటలయింది.

"నాకు నిద్రొస్తోంది. పడుకుంటాను" అన్నాడు అరుణ్ ఆవలిస్తూ.

కిశోర్ కి కూడా నిద్రొస్తోంది. అయినా బలవంతాన నిరోధించుకుంటున్నాడు.

అరుణ్ పడుకున్న పదినిమిషాల్లోనే గాఢ నిద్రలో మునిగిపోయాడు.

అతని వంకే చూస్తూ నిద్రనాపుకోవటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తున్నాడు కిశోర్.

సరిగ్గా అప్పుడే గోడ గడియారం పన్నెండుగంటలు కొట్టింది.

కిశోర్ కి నిద్రనాపుకోవటం తలకు మించిన పనయ్యింది. తమ్ముడి పక్కనే వున్న బెడ్ మీద నడుము వాల్చాడు. మరు నిమిషానికే గుర్రుపెట్టి నిద్రపోయాడు.

సరిగ్గా పన్నెండున్నర గంటలయింది.

"అరుణ్, లే....నిద్రలే...." అంటూ వినిపించింది మంద్ర స్వరంలో.

అరుణ్ దిగ్గున లేచి కూచున్నాడు మంచంమీద. అతని చెవుల్లో సముద్రపు హోరు. అతని కళ్ళు యెక్కడో చూస్తున్నాయి. అసంకల్పితంగానే లేచి మంచం దిగాడు.

"రా....నడచిరా....తిన్నగా వచ్చెయ్యి!" చెవిలో రొద. మెల్లగానే అయినా అతి స్పష్టంగా వినిపించింది రొద మధ్య.

అరుణ్ ముందుకు అడుగులు వేశాడు. ఎటూ చూడటంలేదు. ఎక్కడో శూన్యంలోకి చూస్తున్నాయి కళ్ళు.

కిశోర్ మంచి నిద్రలో వున్నాడు. ఏ ఉద్దేశంతో అరుణ్ పక్కన మంచం వేసుకొని అంతదాకా యెదురు చూశాడో ఆ ఉద్దేశం నెరవేరనే లేదు.

అరుణ్ అలా అలా ముందుకు నడిచి, తీసి వున్న తలుపులగుండా గేటు బయటకొచ్చి రోడ్డెక్కాడు.

రోడ్లు నిర్మానుష్యంగా వున్నాయి. అంతటా అంధకారం అలముకొని వుంది.

అరుణ్ అలా నడుస్తూనే వున్నాడు ముందుకి... ఇంకా యింకా ముందుకి....

తారు రోడ్డునుంచి కంకర రోడ్డుకి తిరిగాడు.

స్మశానంలోకి ప్రవేశించాడు.

ఓ పక్కగా చితి మండుతూనే వుందింకా. నక్కల ఊళలు వినిపిస్తూన్నాయి.

అరుణ్ నడుస్తూనే వున్నాడు.

నిన్నటి ప్రదేశం రాగానే టక్కున నిల్చిపోయాడు.

నేలమీద చతికలబడ్డాడు. చితి మంట అతని ముఖంలో ప్రతిఫలిస్తోంది భయంకరంగా.

అతని పక్కనే తవ్వబడ్డ సమాధి గోతులు.

ఆ గోతిలోనించి అంతక్రితమే పాతబడ్డ శవాన్ని బయటకితీసి నేలమీద పరుండబెట్టారెవరో.

అకస్మాత్తుగా ఆ వ్యక్తి ప్రత్యక్షమయ్యాడు. నిన్న అరుణ్‌ని ప్రశ్నించిన వ్యక్తి! జనార్దనం ఆత్మని ఆవాహన చేసిన వ్యక్తి.

అతని చేతిలో మనిషి ముంజేతి ఎముక వుంది. దాంతో శవం తలనుంచి కాళ్ళదాకా, మళ్ళీ కాళ్ళనుంచి తల దాకా తాకుతూ యేవో మంత్రాలు జపిస్తూన్నాడు. తెలుగు సంస్కృతంకాని మరో భాష అది! పైశాచిక భాష!

శవం ఓ స్త్రీమూర్తిది!

ఆ వ్యక్తి దాదాపు ఆరడుగుల పొడవున్నాడు. ఒంటి

మీద తుండులాంటి గుడ్డ తప్ప మరేవిధమైన ఆచ్ఛాదనా లేదు! ఆ గుడ్డను నడుంచుట్టూ కట్టుకున్నాడు.

ఒంటినిండా విబూది పూసుకున్నాడు. ముఖాన విబూది అడ్డ పట్టీలుగా పూసుకున్నాడు. మెళ్ళో పూసలదండలున్నాయి. కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా ఉన్నాయి. చితి వెలుగుపడి, అవి మరింత భయంకరంగా అయ్యాయి.

ఆ స్త్రీ శవాన్ని తాకించిన ఎముకను అరుణ్ కళ్ళకు తాకించాడు. అతని తలమీద మూడుసార్లు దాంతో కొట్టాడు. ఎముకతో అరుణ్ కూచున్న స్థలంచుట్టూ వలయాకారంగా గీశాడు. కాలుతున్న చితినుండి అగ్ని కణాలు ఓ పగిలిన మట్టిపాత్రలో తెచ్చాడు.

రక్తంలా ఎర్రగా ఉన్న ద్రవాన్ని ఆ నిప్పులో పోశాడు ఆ వ్యక్తి. ఒక్కసారిగా పెద్ద పొగ లేచింది. అరుణ్ ముఖం ఆ పొగలోకి వంచాడా వ్యక్తి. అరుణ్ దగ్గుతో ఉక్కిరిబిక్కిరయ్యాడు. కొంతసేపటివరకు మామూలు స్థితికి రాలేకపోయాడు.

ఆ వ్యక్తి అరుణ్ కళ్ళలోకి సూటిగా చూశాడు.

అరుణ్ కళ్ళు మత్తుతో జోగుతున్నాయి. ఎటో చూస్తున్నాయి. ముందుకి వెనక్కి పూనకం వచ్చినవాడిలా మెల్లగా ఊగుతున్నాడు.

ఆ వ్యక్తి అరుణ్ వంక తీక్షణంగా చూసి, "ఎవరు నువ్వు?" అన్నాడు.

"నేను సుజాతను" అన్నాడు అరుణ్. చిత్రంగా అతని గొంతు స్త్రీ గొంతుగా మారిపోయింది.

"నువ్వు బతికి వున్నావా?"

"లేదు. నిన్న ఉదయం చనిపోయాను."

"ఎందుకు చనిపోయావు?

"నా భర్త, అత్త చంపేశారు."

"చంపేశారా?"

"అవును. కిరోసిన్ పోసి నిప్పంటించారు."

"అయితే ప్రమాదవశాత్తు చీరకొంగుకు నిప్పంటుకొని చనిపోలేదా?"

"లేదు, లేదు. బలవంతాన కాల్చి చంపేశారు. నా భర్త నన్ను కదలకుండా పట్టుకుంటే, అతని తల్లి కిరోసిన్ పోసి నిప్పు పెట్టింది."

"ఈ విషయం ఎవరికైనా తెలుసా?"

"ఎవరికీ తెలియదు. పోలీసులకి తెలిస్తే గొడవవుతుందని అప్పటికప్పుడు తెచ్చి పాతేశారు."

"వెళ్ళు ... వెళ్ళు .... వెళ్ళిపో!" అన్నాడా వ్యక్తి.

అరుణ్ ఒక్కసారిగా వెనక్కి విరుచుకు పడిపోయాడు.

ఆ వ్యక్తి ఆ స్త్రీ శవాన్ని సమాధి గోతిలో పూడ్చి పైన మట్టి కప్పేశాడు. ఆ వెంటనే అరుణ్ దగ్గరకొచ్చి ఎముకతో అతని మాడుమీద ముమ్మారు కొట్టి స్మశానంలో ఎటో మాయమయ్యాడు.

పదినిమిషాల తర్వాత అరుణ్ లేచాడు. చుట్టూ ఒకసారి చూసి కెవ్వున అరిచాడు. కొద్ది క్షణాలవరకు తనెక్కడున్నదీ అర్థం కాలేదు. అర్థమయిన వెంటనే స్పృహ తప్పి పడిపోయాడు—స్మశానం నడిబొడ్డులో.

మరో పదినిమిషాల తర్వాత తమ్ముడ్ని వెతుక్కుంటూ భర్రున కార్లో వచ్చి స్మశానం దగ్గర ఆగాడు కిశోర్.

కిందికి దిగి లోపలకు పరుగెత్తాడు.

సరిగ్గా అప్పుడే ఎవరో కారు పక్కగా మెరుపులా మెరిసి మాయమయ్యారు.

కిశోర్ స్మశానం మధ్యలో శవంలా పడున్న అరుణ్ ని గుర్తుపట్టి, మోకాళ్ళమీద వంగి ముక్కు దగ్గర చెయ్యి పెట్టి చూశాడు. ఊపిరి ఆడుతోంది.

రెండు చేతుల్తోను అరుణ్ని ఎత్తుకొని, కారు దగ్గరకు నడిచాడు. బరువుతోను, ఒకరకమైన ఆందోళన భయంతోను అతని శరీరం పూర్తిగా చెమటతో తడిసిపోయింది.

అతికష్టంమీద కారు దగ్గరకు నడిచాడు. వెనక తలుపులు తెరిచి వున్నాయి. ఆ ఆందోళనలో అవెందుకు తెరిచి వున్నాయో ఆలోచించలేదు కిశోర్. వెనక తలుపులు మూసి ముందుకొచ్చి స్టీరింగ్ దగ్గర కూచుని కారు స్టార్ట్ చేయబోయాడు.

స్టార్ట్ కాలేదు.

మళ్ళీ మళ్ళీ సెల్ఫ్ కొట్టాడు. స్టార్ట్ కాలేదు.

కారు దిగి ముందుకొచ్చి బోనెట్ ఎత్తి బ్యాటరీ, ప్లగ్ అన్నీ చెక్ చేసుకున్నాడు. ఫ్యూయల్ సప్లై సరిగా వుందని నిర్ధారణ చేసుకున్నాడు.

అంతా సవ్యంగానే వుంది. మరి కారెందుకు స్టార్ట్ కావటంలేదు?

బోనెట్ మూసి మళ్ళీ డ్రైవింగ్ సీట్లో కూచుని స్టార్టు చేశాడు. బుర్రుమని శబ్దం చేస్తున్నదేగాని స్టార్ట్ కాలేదు.

అప్పుడు సమయం రాత్రి రెండుగంటలు దాటి యిరవై అయిదు నిమిషాలయింది.

స్మశానం ముందు ఆ సమయంలో ఒంటరిగా వున్నానన్న ఆలోచన రాగానే అతని వెన్నున యేదో జరజర పాకినట్టయింది. సన్నగా ఒణుకు ప్రారంభమయి శరీరమంతా పాకింది. అంతక్రితం స్మశానం నడిబొడ్డులో సమా

ధుల మధ్య అరుణ్ ని ఎత్తుకొని వచ్చినపుడు కూడా భయమనిపించలేదు.

కాని, మంచి కండిషన్ లోవున్న కారు అకస్మాత్తుగా చెడిపోవటం గమనించిన ఆ క్షణంలో, ఆ అర్ధరాత్రి సమయం, ఒంటరితనం, పరిసరాలు అతనికి భయోత్పాతం కలిగించాయి.

సరిగ్గా అప్పుడే ఓ వ్యక్తి కారు వెనకవైపు నుంచి డ్రైవింగ్ సీటు దగ్గరకొచ్చాడు.

హెడ్ లైట్సు వెలుతురు కెదురుగా నిల్చున్నాడు.

అతను నవ్వుతున్నాడు. వికృతంగా చాలా వికృతంగా నవ్వుతున్నాడు. అతనికి ఎడమకన్ను లేదు. ఆ స్థానంలో నల్లటిగుంట వుంది. ఆ గుంటకిందుగా ముఖమంతా నల్లగా మచ్చలు పడివుంది.

కుడివైపు కనుగుడ్డు పైకి పొడుచుకువచ్చింది. ఆ గుడ్డు నుంచి తెల్లటి సొనలాంటి పదార్థం స్రవిస్తోంది. పెదాలుండాల్సిన స్థలంలో చర్మంలేదు. పళ్ళు వికృతంగా కనిపిస్తున్నాయి.

ఆ ఆకారాన్ని చూస్తూనే కిశోర్ చిన్నగా కేక పెట్టాడు. అతని కనుగుడ్లు ఆశ్చర్యంతోను, భయంతోను పెద్దవయ్యాయి. నిలువెల్లా ఒణికిపోతున్నాడు. నాలుక పిడారిపోయింది.

ఆ వికృతరూపుడు ముందుకి మరింత ముందుకి.... కిశోర్ కి సమీపంగా వస్తున్నాడు.

కిశోర్ సీటుకి అతుక్కుపోయాడు.

"నువ్వు ...నువ్వు.... క్యామలరావు...." అన్నాడు కీచుగా కిశోర్.

ఆ వ్యక్తి వికటంగా నవ్వుతూ ఇంకా యింకా ముందుకి

వచ్చాడు. చేతులు కిశోర్ ముఖంమీదికి చాచాడు.

అంతే! కెవ్వున అరుస్తూ కారు తలుపు భళ్ళున తెరుచుకుని రెండో పక్కనుంచి కారు దిగి శరీరం చలనం లేకుండా తారురోడ్డు మీదికి పరుగెత్తాడు కిశోర్.

వెనకనుంచి ఆ ఆకారం ఇంకా నవ్వుతూనే వుంది గుండెలు దద్దరిల్లేటట్టు.

# 5

కారు శబ్దం విని కలత నిద్రనుంచి మేల్కొన్నది స్రవంతి. పక్కనే నిద్రిస్తున్న తల్లిని లేపింది.

లైటు వేసి బాల్కనీలోకి వచ్చింది స్రవంతి. తల్లి కంగారుగా లేచి "ఏమిటమ్మా?" అన్నది.

స్రవంతి బాల్కనీలోకి వచ్చేటప్పటికి తమ కారు గేటుదాటి వెళ్ళిపోవటం కనిపించిందామెకు.

అందులో ఎవరున్నారు? కొంపతీసి అరుణ్ అన్నయ్య నిద్రలోనే కారు డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళిపోవటంలేదు కదా!?....

"అమ్మా, కిందికి వెళ్దాంరా! అరుణ్ అన్నయ్య గది తలుపులు తెరిచివున్నాయి." అన్నది మెట్లవైపు పరుగు లాంటి నడకతో ఉరుకుతూ.

తల్లి శాంతమ్మ కూతుర్ని అనుసరించింది.

గదిలోకి అడుగుపెడూనే, "అరుణ్ అన్నయ్యేకాదు, తోడు పడుకున్న కిశోరన్నయ్య కూడా లేడు." అన్నది స్రవంతి విస్తుపోయి, ఖాళీగావున్న బెడ్స్‌వైపు చూస్తూ.

శాంతమ్మ నిల్చోలేనట్టు నేలమీద కూలబడిపోయింది.

"చిన్నాన్నను లేపుతల్లీ! ఏమిటమ్మా. యిది? ఈ ఇంటి కేదో చేటుకాలం వచ్చినట్టుంది. బంగారంలాంటి బిడ్డ ఇలా ఎందుకూ కాకుండా పోతున్నాడేమిటి భగ

తంతుడా!.... వాడిని చల్లగా చూడు." ఆమె మనసు, ఆక్రోశిస్తోంది.

స్రవంతి చిన్నాన్న గది తలుపులు కొట్టింది.

ప్రసాదరావు కళ్ళు నులుముకుంటూ తలుపు తెరిచి, స్రవంతిని చూసి, "ఏమిటమ్మాయీ, ఏమయింది?" అనడిగాడు.

"అన్నయ్యోళ్ళద్దరు కనిపించటంలేదు చిన్నాన్నా! తలుపులన్నీ తెరిచివున్నాయి. ఇంతక్రితమే మన కారును తీసుకుని ఎవరో వెళ్ళటం చూశాను. ఇద్దరన్నయ్యల్లో ఎవరో తెలియదు!" చెప్పింది స్రవంతి.

ప్రసాదరావు చకచక గుసులు మార్చుకున్నాడు.

"ఏ కారు తీసుకు వెళ్ళారు?" అడిగాడు.

"షెవర్లెట్. మారుతి కారు తాళాలు మీ దగ్గరే వుంటాయి కదా!?" అన్నది స్రవంతి.

ప్రసాదరావు ప్రత్యేకం మారుతి కారు వాడతాడు ఇంట్లో తక్కినవాళ్ళందరు - ముఖ్యంగా పిల్లలు ముగ్గురు షెవర్లెట్ ఉపయోగిస్తారు.

ప్రసాదరావు అరుణ్ గదివైపు నడిచాడు అక్కడ కాంతమ్మ ఇంకా నేలమీద కూల బడివున్నది!

ప్రసాదరావుని చూసి లేచి నిల్చుందామె. భర్తపోయి నప్పట్నుంచి ఆడపొడుచుపా మరది ముందు పడక తప్పటం. లేదామెకు. భర్త వుండగా ఆమె ఏనాడూ గది దాటి బయటికి రాలేదు. రాణివాసం స్త్రీలా బతికింది.

ప్రసాదరావు మౌనంగా వెనుతిరిగి గరాజ్ వైపు అడుగులు వేశాడు మారుతి కారు బయటకి తీశాడు

సరిగ్గా అప్పుడే పనుగులు పెట్టూ వచ్చాడు కిశోర్.

ప్రసాదరావు ఇంజన్ ఆపి కిందకి దిగి కిశోర్ కెదురెళ్ళి "ఏమిటి, ఏం జరిగింది?" అనడిగాడు.

కిశోర్ రెండు నిమిషాలవరకు ఏం మాట్లాడలేక పోయాడు. ప్రవంతి పరిస్థితి గమనించి చల్లటి మంచినీళ్ళు తీసుకునివచ్చి యిచ్చింది.

గటగట తాగేసి మళ్ళీ మరో గ్లాసు కావాలని అడిగాడు కిశోర్.

తర్వాత చెప్పాడు జరిగిన సంగతి:

కాంతమ్మ గొల్లుమన్నది. "అయితే చినబాబుని స్మశానంలో ఒంటరిగా వదిలిపెట్టేసి వచ్చేశావా? ఎంత పొరపాటు చేశావు?" అన్నది.

"పద వెళ్దాం! కారేదో కారణంచేత చెడిపోయి వుండొచ్చు పెట్రోలుందా టాంకులో....?" అడిగాడు ప్రసాదరావు.

"ఉండాలి! ఉదయమే టాంకు ఫుల్ చేయించాను. ఎంతో డిస్టెన్స తిరగలేదు" చెప్పాడు కిశోర్ మారుతి కారెక్కుతూ.

ఆ పాటికే కారు స్టార్టు చేశాడు ప్రసాదరావు.

మరో పదినిమిషాల తర్వాత మారుతికారు స్మశానం చేరుకున్నది.

కిశోర్ గుండె పీచు పీచుమంటున్నది. మళ్ళీ ఆ వికృత రూపుడ్ని చూడవలసి వస్తుందేమోనని అపరిమితంగా వణికి పోతున్నాడు. అయితే చిన్నాన్నకి ఆ వింత వ్యక్తి గురించి చెప్పలేదు. తనకే భయంవేసి పారిపోయివచ్చానని, కారు స్టార్టు కాకపోవటంవలననే వచ్చేశానని చెప్పాడు.

ప్రసాదరావు మారుతికారు దిగి ఫెర్లాట్ దగ్గరకు నడిచాడు.

వెనక సీట్లో వాళ్ళు ఇటుక చూపులని స్పృహ లేని స్థితిలో వున్నాడు అరుణ్.

ముక్కు దగ్గిర వేలు పెట్టి చూశాడు, శ్వాస ఆడుతోంది. సంతృప్తిగా తలాడించి, డ్రైవింగ్ సీట్లో కూచున్నాడు తలుపు తెరచి.

కిశోర్ ఊపిరి బిగబట్టుకుని చూస్తున్నాడు! ఆ వికృత రూపం మళ్ళీ ఎప్పుడు ఎలా ప్రత్యక్షమవుతుందోనని గుబులుగా, భయంగా ఉంది!

అదీగాక తను డ్రైవింగ్ సీటు తలుపు, యిటుపక్క తలుపు తెరచి పారిపోయాడు. కాని ఇప్పుడు ఆ రెండు తలుపులు వేసేసి వున్నాయి. వెనక మూసిన తలుపులు తెరచి వున్నాయి. ఎవరు చేశారాపని?

ప్రసాదరావు ఇంజన్ స్టార్టు చేశాడు.

మరుక్షణమే షెవర్లెట్ స్టార్టయింది.

కిశోర్ నిర్ఘాంతపోయాడు. ఇదేమిటి? తను దాదాపు అరగంట కష్టపడ్డా స్టార్టు కాలేదు. ఇప్పుడు ఇలా స్టార్టు చెయ్యగానే అలా స్టార్టయింది. చిత్రంగా అనిపించింద తనికి.

"కిశోర్, నువ్వా కారు డ్రైవ్ చేసుకురా. నేను దీని విషయం చూస్తాను." అన్నాడు ప్రసాదరావు షెవర్లెట్ ని ఇంటిదారి పట్టిస్తూ.

మరో పదిహేను నిమిషాల తర్వాత రెండు కార్లు కిశోర్ ఇంటి ఆవరణలోకి ప్రవేశించాయి.

ప్రసాదరావు, కిశోర్ అరుణ్ ని మోసుకుని అతని గదిలోకి తీసుకువెళ్ళి పక్కమీద పడుకో బెట్టారు.

స్రవంతి, శాంతమ్మ ఆత్రుతగా బెడ్ దగ్గరకు చేరుకున్నారు.

అప్పుడు తెల్లవారుఝామున నాలుగ్గంటలయింది.

ప్రసాదరావు అరుణ్‌ని తట్టి లేపాడు. అరుణ్‌లో ఎలాంటి కదలికా లేదు. ఎంతకీ లేవలేదు.

కిశోర్ ఫోన్ దగ్గరకు పరుగెత్తాడు. డాక్టరుకి ఫోన్ చేశాడు.

డాక్టర్ వచ్చి అరుణ్‌ని పరీక్షించాడు. మెలకువ రావటానికి ఇంజక్షన్ ఇచ్చాడు.

పది నిమిషాల తర్వాత అరుణ్ నిద్రనుంచి లేచినట్టు పక్కమీద కదిలి, కళ్ళు తెరిచాడు. లేవబోయి మళ్ళీ వెనక్కి వాలిపోయాడు.

"పడుకో బాబూ, లేవద్దు!" అన్నది శాంతమ్మ వచ్చే దుఃఖాన్ని అదిమిపట్టి

అరుణ్ ఆమె వంక విచిత్రంగా చూసి, "ఎవరు నువ్వు? అసలు ఎవరు మీరింతా? ఇక్కడికెందుకొచ్చారు? వెళ్ళిపొండి; నేనిక్కడికి రాను. వెళ్ళండి!" అంటూ అరిచాడు.

అందరు నిర్ఘాంతపోయారు, డాక్టర్‌తో బాటు.

"డాక్టర్ " అన్నాడు ప్రసాదరావు ఇంకేమి చెప్పటానికి నోరురాక.

డాక్టరు అరుణ్‌ని సమీపించాడు. అతన్ని పరీక్షించటానికి స్టెతస్కోప్ గుండెలకి ఆనించబోయాడు. అంతే, డాక్టర్ని చాచి లెంపకాయ కొట్టాడు అరుణ్.

ఊహించని ఈ పరిణామానికి నిశ్చేష్టుడై తూలి గోడ మీద పడ్డాడు డాక్టరు.

"గెటవుట్ ...పొండి, ఇక్కడ్నుంచి వెంటనే వెళ్ళిపొండి!" అంటూ అరిచాడు అరుణ్.

అతని కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా వున్నాయి. వికృ

తంగా నవ్వుతున్నాడు. అతని ముఖంలోకి చూడటానికే వాళ్ళంతా భయపడుతున్నారు. అంత భయంకరంగా వుందతని రూపం!

ప్రసాదరావు చొరవగా ముందుకొచ్చాడు. అరుణ్ వైపు తీక్షణంగా చూశాడు. అరుణ్ అంతకంటె తీక్షణంగా చూశాడు.

అరుణ్ చెంపలు రెండు ఛెళ్లు ఛెళ్ళున చరిచాడు ప్రసాదరావు.

అరుణ్ పెద్ద కేక పెట్టి వెనక్కి విరుచుకుపడి పోయాడు. మరుక్షణం అతనికి స్పృహతప్పిపోయింది.

# 6

"నాన్నా. చెల్లాయి ప్రమాదవశాత్తు చీరకొంగు అంటుకొని చనిపోలేదు. చంపేశారు." అన్నాడు శేఖర్ లోకనాథంతో.

లోకనాథం విస్తుపోయి చూశాడు "ఏమిటి శేఖర్, సుజాత ప్రమాదవశాత్తు చనిపోలేదా? ఎవరు చెప్పారు నీకు?" అన్నాడు.

"ఎవరు చెప్పితే నేం. సుజాతది బలవన్మరణం! బావ, అతని తల్లి కిరోసిన్ పోసి కాల్చేశారు. అందుకే మనం వెళ్ళేలోపల సమాధి చేసేశారు చెల్లాయిని."

"నువ్వు అపోహపడుతున్నావు. పోలీసులకి తెలిస్తే కర్మ చెయ్యనివ్వరని, ఆటంకాలొస్తాయని భయపడి అర్జంటుగా సమాధి చేసేశారని చెప్పారు కదా! సుజాత భర్త గోపీ ఉత్తముడు. అతని తల్లి కూడా చాలా సౌమ్యురాలు. వాళ్ళంటే కిట్టని వాళ్ళెవరో చెప్పిన మాటలు నిజమని నమ్మేశావు, అవునా?"

"లేదు నాన్నా! నాకు చాలా నమ్మకంగా తెలిసింది.

చెల్లాయిని పాతిపెట్టిన సమాధి తవ్విచూద్దాం. డాక్టరు పరీక్ష చేయిద్దాం. పోస్టుమార్టంలో నిజానిజాలు తెలిపోతాయి."

"శేఖర్, పిచ్చి పిచ్చిగా మాట్లాడకు. సమాధి చేసిన పిల్లను మళ్ళీ బయటకు తవ్వటం ఎంతమాత్రం మంచిది కాదు. పుణ్యలోకాలు పొందవలసిన బిడ్డకు ఆత్మశాంతి దొరకదు. ఆ ఆలోచనే మంచిదికాదు."

"నాన్నా, మీరింకా అమాయకత్వంలో వుండి మాట్లాడుతున్నారు. గోపీ ఉత్తముడనుకొంటున్నారు. కాని నాకు తెలిసిందేమిటంటే, అతనికి మరోచోట మరో అమ్మాయి వుంపుడుగత్తెగా వుందని, ఆమె కోసమే చెల్లాయిని పొట్టన బెట్టుకున్నాడని! అతనితల్లి కూడా సుజాతను వేధించుకు తినేది!"

"నీ అభిప్రాయం సహేతుకంగా లేదు. ప్రతిరోజూ పేపర్లలో ఇలాంటి కేసులు గురించి చదువుతున్నాం. అయితే అవన్నీ కట్నం తేలేదనే కక్షలో చేస్తున్న దురాగతాలు. కాని మనం సుజాతకి కట్నం దండిగా ఇచ్చాం. అల్లుడు యేది కావాలంటే క్షణాలమీద ఇచ్చే వాళ్ళం. పెట్టుపోతల్లో యేనాడూ లోటు చెయ్యలేదు. సుజాతను చంపుకోవటంవల్ల వాళ్ళకే నష్టం. నీ అనుమానం నిరాధారం."

"నాన్నా, నేను ముందే చెప్పాను. మరో పిల్ల వల్లో పడి, చెల్లాయిని అడ్డం తొలగించుకున్నాడని! నా అనుమానం ఉత్త అనుమానంమాత్రమే కాదు. అందుకు పటిష్టమైన సాక్ష్యాధారాలున్నాయి. సుజాతను నిర్దాక్షిణ్యంగా, రాక్షసంగా చంపినందుకు గోపీని అతని తల్లిని ఊరికంబ మెక్కిస్తాను. చెల్లాయి ఆత్మకు శాంతి కలిగిస్తాను" శేఖర్

విసుగుగా వెళ్ళిపోయాడక్కడనుంచి.

లోకనాథం అతను వెళ్ళిన వైపే సాలోచనగా చూస్తూ నిల్చుండిపోయాడు.

అతను ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా యీ మధ్యనే రిటైరయ్యాడు. అతనికి సుజాత, శేఖర్ ఇద్దరే సంతానం.

సుజాతను మూడేళ్ళక్రితమే గోపీకిచ్చి వైభవంగా పెళ్ళిచేశాడు. సుజాత గ్రాడ్యుయేట్. గోపీ కిశోర్ ఫ్యాక్టరీలో మెకానికల్ ఇంజనీరు. కట్నకానుకలు ఘనంగా ఇచ్చి చేశాడు లోకనాథం.

శేఖర్ బి.టెక్ ఫైనలియ్యర్లో వున్నాడిప్పుడు. అతనికి ఆవేశం పాలెక్కువ. సుజాతను ప్రాణసమానంగా చూసుకొనేవాడు శేఖర్. తన బావగారు ఇంజనీరు కావటం తండ్రి ఇంజనీరే కావటం, తనూ ఇంజనీరింగ్ కోర్సు చదవటం అతనికి చాలా ఆనందం కలిగించే అంశాలయ్యాయి.

ఇంజనీరు బావంటే ప్రాణం పెట్టేవాడు. అయితే ఆ బావ చెడు వ్యసనాలకు లోనయ్యాడని తాగుడు, జూదమే కాకుండా అమ్మాయిల వేటగాడని, ప్రత్యేకం ఓ అమ్మాయిని చేరదీసి వేరే యింట్లో పెట్టాడని తెలిసిన రోజున శేఖర్ మండిపడ్డాడు.

అన్నాళ్ళుగా గోపీపైనున్న సదభిప్రాయం దూది పింజెలా ఎగిరిపోయింది. మంచులా కరిగిపోయింది.

గోపీ తనకన్న పెద్దవాడు, పైగా చెల్లెలు భర్త. చాలా సున్నితమైన వ్యవహారం. భార్యాభర్తల మధ్యకి మూడో మనిషి అడ్డురావటం మంచిదికాదని తెలియని అమాయకుడు కాదు శేఖర్.

అందుకే తనంతట చెల్లెలు చెప్పిందేమోనని ఎదురు

చూశాడు. పుట్టింటికి వచ్చినప్పుడల్లా సుజాతనుంచి ఆ విషయాలు రాబట్టాలని చూశాడు. ఆమె చాలా గుంభనగా ఆ విషయాలను దాచేసేది. ప్రసంగం పెరగనిచ్చేది కాదు.

కాని శేఖర్ అంత తేలిగ్గా వదల్లేదా విషయం. కొందరు స్నేహితులతో రహస్యంగా ఇన్వెస్టిగేట్ చేశాడు. నిజాలు బయటపడ్డాయి. ఆధారాలతో బాటు తండ్రికి వివరంగా తెలియచెప్పాలనుకున్నాడు.

ఇంతలోనే ఎవరూ ఊహించని ఘోరం జరిగిపోయింది. చెల్లాయి గ్యాస్ స్టౌవ్ అంటుకొని కాలిపోయిందని గోపీ టెలిగ్రామిచ్చాడు. తండ్రి, తను వెళ్ళేసరికి ఖననం చేసేశారు. చుట్టుపక్కల వాళ్ళుకూడా అది ప్రమాదవశాత్తూ జరిగిందేనని చెప్పటంతో నిజమేననుకున్నాడు లోకనాథం.

కాని శేఖర్ తేలిగ్గా నమ్మలేదు. అంత అర్జంటుగా ఖననం చెయ్యటం అతనిలోని అనుమానాన్ని మరింత బలపర్చింది. అయితే బయటపడలేదు.

తండ్రితో బాటు ఓసారి చెల్లాయి సమాధిని దర్శించి పుష్పగుచ్ఛాలు ఉంచి వచ్చేశాడు. ఆ క్షణంలోనే మనసులో దృఢంగా నిశ్చయించుకున్నాడు—

"చెల్లీ, నీ చావుకు కారకులైనవాళ్ళ అంతు చూస్తాను. నీ ఆత్మకు శాంతి చేకూరుస్తాను" అని.

ఆ తర్వాత అతను చేసిన ప్రయత్నంవల్ల అసలు విషయం బయటపడింది.

## 7

"ఎవరైనా సైకియాట్రిస్టుకి చూపిస్తే మంచిదనుకొంటున్నాను" అన్నాడు డాక్టరు సుధాకర్.

ప్రసాదరావు, కిశోర్ అతని వంక ప్రశ్నార్థకంగా

చూశాడు.

"తమ్ముడి కేసు పరిస్థితి ఎలా వుందని మీరు ఫీలవుతున్నారు డాక్టర్?" అనడిగాడు కిశోర్.

సుధాకర్ సాలోచనగా చూసి, "ఫిజికల్లీ హి ఈజ్ ఆల్‌రైట్! కాని అతను మానసికంగా బాగా బలహీనపడిపోయాడు—ఎందుకో బాగా భయపడిపోయాడు.... స్మశానం మధ్య పడుకున్నాడని అన్నాడు కదా....!" అన్నాడు.

"తమ్ముడు స్వతహాగా పిరికివాడు డాక్టర్! అందుకే భయపడివుంటాడు. కాని అర్ధరాత్రి దాటాక ఒంటరిగా స్మశానానికి నడిచి వెళ్ళటం ఎంతో ధైర్యవంతులకి గాని సాధ్యంకాని పని. ఈ ద్వంద్వ ప్రవృత్తి యేమిటో అంతుబట్టడంలేదు."

"కొందరిలో ఇలాంటి ప్రవృత్తి వుండటం అసహజం కాదు. పిరికివాళ్ళు ఒక్కోసారి ఎంతో ధైర్యంగా ప్రవర్తించటం, హత్యలు చేయటం, సాహసాలు చేయటం నాకు తెలుసు. అదే ద్వంద్వ ప్రవృత్తి."

"అయితే మీ సలహా ఏమిటి?"

"మనస్తత్వవేత్తను చూడటమే అన్నివిధాల సరయినదని నా అభిప్రాయం. ఇలాంటి విషయాలు సైకియాట్రిస్టు అయితేనే సరిగా డీల్ చేయగలుగుతాడు. నాకు తెలిసిన సైకియాట్రిస్టు వున్నారు రెఫర్ చెయ్యమంటారా?"

"చెప్పండి.... వెంటనే కన్సల్టు చేస్తాం. ఈర్ర వాడి పరిస్థితి నానాటికీ తీసికట్టుగా వుంది. ఇలా వదిలేస్తే ఎలాంటి విపరీత పరిణామాలకి దారితీస్తుందో అనూహ్యంగా వుంది" అన్నాడు, అంతవరకు మౌనంగా వారి

సంభావణ వింటున్న ప్రసాదరావు.

"ఆయన పేరు మేఘనాథ్. ఫారిన్ రిటర్న్డ్. ఆయన ఇలాంటి కేసుల్ని సమర్థవంతంగా ట్రీట్ చేస్తారు. అందుకే ఆయన్ని సజెస్టు చేస్తున్నాను."

"డాక్టర్ వాదో సందేహం...." కిశోర్ ఆగాడు.

"ఏమిటది?"

"తమ్ముడిలా అయిపోవటానికేదైనా దుష్టశక్తిని ప్రయోగించారేమో ఎవరైనా..?"

"వాడ్డూయూ మీన్? చేతబడి కావచ్చునవా?"

"అలాంటిదిగాని .... దయ్యమేదైనా ఆవహించటం గాని ..."

"స్టాపిట్! మీరలాంటి మూఢనమ్మకాలని పట్టుకొని వేళ్ళాడుతూ ట్రీట్‌మెంట్ అలక్ష్యం చేశారంటే చేజేతులా అతన్ని పోగొట్టుకుంటారు. అతను చాలా నీరసంగా వున్నాడు. బలమైన ఆహారం మందులు చాలా అవసరం."

కిశోర్ వెంటనే సర్దుకొని, "అబ్బే, భూతవైద్యుల చుట్టూ తిప్పుతానని మీరనుకొంటున్నారల్లే వుంది; నేను వాటికి వ్యతిరేకిని.... ఇలా వింతగా ప్రవర్తించేవాళ్ళు ఈమధ్య యెక్కువైపోయారు. అందుకని అలా అడిగాను" అన్నాడు.

సుధాకర్ ఏదో అనబోతుండగా అరుణ్ పక్కమీద కదిలాడు. అందరు ఆత్రంగా అతన్ని సమీపించారు. ఆడవాళ్ళు అనవసర ఆందోళనతో చికాకుపరుస్తారని వాళ్ళని ఆ గదిలోకి రావద్దని ముందుగానే చెప్పాడు డాక్టరు.

అరుణ్ లేచి కూచున్నాడు పక్కమీద.

డాక్టర్ సుధాకర్ అతనికి దూరంగా స్టూల్ లాక్కొని కూచున్నాడు. అంతక్రితం జరిగిన అనుభవం అతనింకా మరచిపోలేదు. రోగి మానసిక పరిస్థితి అస్తవ్యస్తంగా వుందని తెలిసికూడా సాహసించటం మూర్ఖత్వమనిపించుకుంటుందని తెలుసతనికి.

అరుణ్ కళ్ళు తెరిచి ఆ గదిలోని ముగ్గురి వంక పరిశీలనగా చూశాడు. అయితే అతని చూపులో స్థిరత్వం లేదు. ఎవరిమీద నిలబడటంలేదు.

సుధాకర్ అతనివైపు చూసి, "మిస్టర్ అరుణ్.... అరుణ్...." అని పిలిచాడు.

అరుణ్‌నించి రెస్పాన్స్‌లేదు. అతని కళ్ళు పత్తికాయల్లా విచ్చుకున్నాయి. "అరుణ్ ఎవరు? నా పేరు శ్యామలరావు...." అన్నాడు.

ముగ్గురు నిర్ఘాంతపోయారా మాటలకి. ముఖ్యంగా కిశోర్ ముఖాన నెత్తురుచుక్కలేదు. పాలిపోయి వుంది. ఏమిటీ విచిత్ర పరిస్థితి?

సుధాకర్ మెల్లగానే, అయినా గంభీర స్వరంలో చెప్పాడు. "నీ పేరు అరుణ్....శ్యామలరావు కాదు."

"నో నా పేరు శ్యామలరావు. నువ్వెవరు?" అన్నాడు అరుణ్ సుధాకర్ వైపు కోపంగా చూస్తూ.

"నేను డాక్టర్ని. మీ ఫేమిలీ డాక్టర్ సుధాకర్ని."

"డాక్టర్‌వా, యాక్టర్‌వా? ఇక్కడెవరూ పేషెంట్సు లేరు. నీకిక్కడేం పని?"

"ఊరికే ఫ్రెండ్లీగా వచ్చాను. పేషెంట్ కోసంకాదు. చూసిపోదామని....అంతే!"

"వాళ్ళిద్దరు ఎవరు?"

"అతను మీ అన్నయ్య కిశోర్. ఈయన మీ

చిన్నాన్న ప్రసాదరావుగారు."

"డామిట్, అబద్ధాలు చెప్పకు. నాకు అన్నలుగాని, తమ్ముళ్ళుగాని లేరు — అక్క తప్ప! ఆ అక్క కూడా చచ్చిపోయింది నా కళ్ళముందే! చిన్నాన్నగాని పెదనాన్నగాని లేరు! నీలా అబద్ధాలు చెప్పే వాళ్ళంటే నా కసహ్యం. నువ్వు ఖచ్చితంగా యాక్టర్ వే!"

ముగ్గురు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. కిశోర్ ఆసక్తిగా వింటున్నాడా మాటల్ని. శ్యామలరావు చనిపోయి రెండు నెలలయింది. అతని అక్క కూడా అప్పుడే చనిపోయింది. ఈ సంగతులన్నీ అరుణ్ ఎలా చెప్పగలుగుతున్నాడు?

కిశోర్ అరుణ్ ముఖంలోకి పరీక్షగా చూస్తూన్న సమయంలోనే అరుణ్ అతనివంక తీక్షణంగా చూశాడు. వికృతంగా నవ్వాడు. ఆ నవ్వు అరుణ్ నవ్వు కాదు.... అవును....అది శ్యామలరావు గొంతులాగానే వుంది. అతనిలాగే నవ్వేవాడు. అయితే ఆ నవ్వు వికృతంగా వుండేది కాదు.

అరుణ్ కిశోర్ కళ్ళల్లోకి చూస్తున్నాడు. "హల్లో నేను గుర్తొచ్చానా? నిన్ను తేలిగ్గా వదులుతాననుకోకు. నిన్ను, నీ కుటుంబాన్ని సర్వనాశనం చేస్తాను. అప్పుడు గాని నా కసితీరదు. నా పగ చల్లారదు" అన్నాడు.

కిశోర్ గుడ్లప్పగించి చూస్తూన్నాడు. "ఏమిటి, ఇతని మాటల కర్థం? శ్యామలరావు ఆత్మ అరుణ్ ని ఆవహించిందా? శ్యామలరావు తనమీద కక్షవహించాడా? అందుకే అరుణ్ ని ఆవహించి, తనకి జరగబోయే పరిణామాల గురించి హెచ్చరిస్తున్నాడా? తన కుటుంబం మీద పగసాధిస్తాడా?

డాక్టర్ సుధాకర్ అరుణ్ వంక చూసి, "మిమ్మల్నోసారి చెకప్ చెయ్యొచ్చునా?" అనడిగాడు. అరుణ్ ఇలా వింతగా ప్రవర్తిస్తున్నపుడు అతని హార్ట్ బీట్, పల్స్ రేటు చూడాలని అతని అభిప్రాయం. కాని, అరుణ్ అంగీకరించాలమిచ్చలేదు.

"డోంట్ టచ్ మి! నేను బాగానే వున్నాను. ప్లీజ్ గో అవే!" అరిచాడు అరుణ్.

సుధాకర్ జంకాడు. తను యింకా చొరవ చేసుకుంటే జరగబోయే పర్యవసానం గ్రహించాడు.

ప్రసాదరావు అరుణ్ వంక అనునయంగా చూసి, "బాబూ, అరుణ్ కాఫీ తాగుతావా?" అన్నాడు.

"కాఫీ తాగను. రక్తం తాగుతాను. ఉందా?" అన్నాడు వికటంగా నవ్వుతూ అరుణ్.

మళ్ళీ అతిన్ని మాట్లాడించే సాహసం యెవరూ చెయ్యలేదు. మీదపడి కరుస్తాడో, రక్తం తాగుతాడో అనూహ్యంగా వుంది.

కిశోర్‌కైతే ఒళ్ళంతా చెమట్లు పట్టేసి, భయాందోళనలతో సన్నగా వణుకు మొదలయ్యింది. అరుణ్ యే క్షణంలోనైనా తన మీద పడి కరుస్తాడేమోనని సందేహం పట్టి పీడిస్తోంది.

శ్యామలరావు పగ సాధించబోతున్నాడా? తన ప్రాణ సమానుడైన తమ్ముడిని నాశనం చేసి రెండురకాలుగా తనమీద కక్ష తీర్చుకుంటున్నాడు. తప్పు చేసింది తనైతే, దండన అమాయకుడైన అరుణ్‌కా? ఇది అన్యాయం. తను సాగనివ్వకూడదు!

అయితే తను గతరాత్రి స్మశానం దగ్గర చూసినది శ్యామలరావు ప్రేతాన్నా? చచ్చేటపుడు యెలాంటి

రూపంలో తనకి చివరిసారిగా కనిపించాడో, అదే రూపంతో ప్రత్యక్షమయ్యాడు.

అదెలా సాధ్యం? చనిపోయిన మనిషి మళ్ళీ అదే రూపంతో కనిపించటం ఎక్కడైనా వుందా? తను భ్రమపడ్డాడా? లేక భయపడ్డాడా? ఒంటరితనంవల్ల, పిరికితనంవల్ల తను చిత్త చాంచల్యానికి లోనయ్యాడా? అంతా చిత్రంగా వుంది!

సరిగ్గా అప్పుడే అరుణ్ పెద్దగా కేక వేసి విరుచుకు పడిపోయాడు. అతనికి వెంటనే స్పృహ తప్పిపోయింది.

డాక్టర్ సుధాకర్ ఆత్రుతగా అరుణ్ పల్స్ హార్ట్ బీటింగ్ చూశాడు. నార్మల్ కన్న ఎక్కువగా వుండటం గమనించి సాలోచనగా తలూపాడు.

తన వంక ఆత్రుతగా చూస్తున్న కిశోర్ని, ప్రసాద రావుని చూసి మందహాసం చేసి, "హీ ఈజ్ ఆల్ రైట్! కాని మానసికంగా బాగా అలిసిపోయాడు. అతనికి విశ్రాంతి బాగా కావాలి! అంతే కాదు, బలమైన ఆహార మివ్వాలి. స్పృహలోకి వస్తే మళ్ళీ వింతగా ప్రవర్తిస్తాడేమో! సెలైన్ అరేంజి చెయ్యనా?" అన్నాడు సుధాకర్.

"సెలైనా? తమ్ముడు నోటితో ఆహారం తీసుకోవ టానికి నిరాకరిస్తే అప్పుడు చూద్దాం. ఈసారి తెలివిలోకి వచ్చాక మనల్ని గుర్తిస్తాడేమో! అది కన్ఫర్మ్ చేసు కున్నాక మీరన్నట్టు సెలైన్ ట్రై చేస్తే బావుంటుంది" అన్నాడు కిశోర్.

"ఓ.కే., దెన్! నేను మళ్ళీ ఓ గంట తర్వాత వస్తాను. రెగ్యులర్ పేషెంట్స్ ఎదురుచూస్తుంటారు. ఈలోపల అరుణ్ లేచి ఎబ్నార్మల్ గా ప్రవర్తిస్తే

నాకు ఫోన్ చెయ్యండి, వెంటనే వస్తాను" అంటూ లేచాడు సుధాకర్.

కిశోర్, ప్రసాదరావు మౌనంగా తల ఊపారు.

తలుపుదాకా వెళ్ళాక మళ్ళీ వెనుతిరిగి, "అతన్ని కొట్టడంగాని, అతనితో వాదన పెంచుకోవటంగాని చెయ్యొద్దు. మెంటల్ డిప్రెషన్‌కి దారితీసే ప్రమాద ముంది. అప్పుడు, హి విల్ బి అవుటాఫ్ అవర్ హేండ్స్!" అన్నాడు సుధాకర్.

"అలాగే డాక్టర్!" అన్నారిద్దరు ఒకేసారి.

సరిగ్గా అప్పుడే అరుణ్ లేచికూచున్నాడు.

కిశోర్, ప్రసాదరావు అతన్ని సమీపించారు.

# 8

"ఏమిటి రవీ, యిలా వచ్చావు? ఫోం చేశావా? దా, కూచో!" అన్నాడు పోలారావు.

"నేను కూచోవటానికి రాలేదు. నీ విషయం తేల్చు కోవటానికే వచ్చాను" అన్నాడు రవీంద్ర సూటిగా చిన్నాన్న వంక చూస్తూ.

"నా విషయమా? ఏమిటి రవీ, వింతగా మాట్లాడు తున్నావు?"

"నటించకు! జనార్దనం అన్నయ్యని నువ్వే చంపే శావు."

"నీకు పిచ్చెత్తిందా ఏం? జనార్దనాన్ని నేను చంపడ మేమిటి? అయినా ఆర్నెల్ల తర్వాత నువ్వీ ప్రసక్తి తేవటంలో అంతరార్థ మేమిటి?" కోపంగా అన్నాడు పోలారావు.

"నిజం నిలకడమీద తేలటం అనాదిగా వస్తూన్నదే! ఈసారికూడా అలాగే ఆలస్యమయింది — ఆర్నెల్లు!"

"రవీ, నీకు మతిపోయింది. అసలు జనార్దనాన్ని చంపాల్సిన అవసరం గాని, అగత్యంగాని నాకు లేదు. నువ్వెత్తి పుణ్యానికి నామీద అభాండా లేస్తున్నావు!"

"నా దగ్గర సాక్ష్యాధారాలున్నాయి. అమ్మకూడా చెప్పింది నువ్వు ఆస్తికోసం అన్నయ్యని గతంలో ఓసారి బెదిరించావని....!"

పోలారావు వికటంగా నవ్వాడు.

"ఆస్తి....ఆస్తి....ఎక్కడిది మీకు? లేని ఆస్తికోసం జనార్దనాన్ని చంపానంటావా? నీకు నిజంగానే పిచ్చెత్తింది. వెంటనే స్పెషలిస్టుని కల్సి చూపించుకో."

"స్టాప్ దిస్ నాన్సెన్స్! నాకలాంటి చిత్తచాంచల్యం లేదు. నేను బాగానే వున్నాను. ఆస్తి అంటావా, అది వుందో లేదో నాకంటే నీకే బాగా తెలుసు."

"ఏం తెలుసు? ఆస్తే వుంటే మీరందరు అన్నాళ్ళు అగచాట్లు పడాల్సిన అగత్యమే లేకపోయేది కదా!"

"పైకి అందరు అనుకునేమాటే అది! కాని మా నాన్నగారు బతికుండగానే లక్షరూపాయలు ఖరీదుచేసే ఇళ్ళస్థలాలు సంపాదించారని, వాటికి సంబంధించిన పత్రాలు నీదగ్గరే చిక్కుపడిపోయాయని, నువ్వు ఆ స్థలాలను పరిచితులకు బేరం పెట్టావని, వాటిని అమ్మటానికి జనార్దనం అన్నయ్య సంతకం కావలసి వచ్చిందని అన్నయ్య సంతకం పెట్టడానికి నిరాకరించాడని, నువ్వు బెదిరించావని—అన్నీ తెలిశాయి నాకు."

"ఓహో, చాలా తెలిశాయన్నమాట! ఏవో సాక్ష్యాధారాలున్నాయన్నావు కదా! అవేమిటో చూపించు"

"చూపించాల్సిన వాళ్ళకి తప్పకుండా చూపిస్తాను. స్వార్థంతో అన్నగాడుకని కూడా చూడకుండా నిర్దా

క్షుణ్ణంగా ఓ అమాయకుడిని పొట్టన పెట్టుకున్నావు. నిన్నంత తేలిగ్గా వదలను."

"ప్రగల్భాలు కట్టిపెట్టు. జనార్దనం ప్రమాదవశాత్తు సముద్రంలో మునిగి చనిపోయాడు. ఇక నువ్వారోపిస్తూన్న పథకాలవిషయం నాకేం తెలియదు. మీ నాన్న బతికుండగా ఏమీ సంపాదించలేదు. నేను జనార్దనాన్ని ఓసారి సంతకం పెట్టమన్న మాట నిజమేగాని, యీ విషయంలో కాదు."

"మరో కథ అల్లుతున్నారా?"

"అంత ఖర్మేంపట్టలేదు నాకు. నువ్వనవసరంగా నన్నుమానిస్తున్నావుగాబట్టి నీ అపోహాల్ని తొలగించటానికే చెప్తున్నాను."

"ఏమిటది?"

"మీ అన్నయ్య ఫ్యాక్టరీలో అకౌంటెంటు. అప్పుడప్పుడు కంపెనీ కేష్ బాంకులో కట్టడం, డ్రా చెయ్యటం కూడా అతనిమీదే పెట్టేవారు. ఆ ఉద్యోగానికి నేను సెక్యూరిటీ ఇచ్చాను. అందుకుగాను కొంత డబ్బు కంపెనీకి డిపాజిట్ కట్టాను. కాబట్టే జనార్దనానికి ఆ ఉద్యోగం దొరికింది. ఆ సొమ్మును ప్రతి నెల తన జీతం నించి ఇవ్వటానికి జనార్దనం ఒప్పుకున్నాడు. తీరా నేను డబ్బు కట్టాక తను నెల నెలా డబ్బివ్వటానికి నిరాకరించాడు."

"అబద్ధం! అన్నయ్య అలాంటివాడు కాదు. నిజంగా నువ్వు సెక్యూరిటీ ఇచ్చివుంటే తల తాకట్టు పెట్టయినా డబ్బు చెల్లించేసి వుండేవాడు. కాని పక్షంలో నెల నెల తీర్చటానికి సంతకమైనా చేసి వుండేవాడు. కాని

అన్నయ్య సంతకం పెట్టనని నిరాకరించాడంటే అతడో బలమైన కుట్ర అయివుండాలి!"

"కుట్రా? అతనిమీద ఎవరు కుట్రపన్నుతారు?"

"ఎవరో ఎందుకు — నువ్వే! మా తండ్రి పోయినప్పట్నించీ ఈనాటి దాకా మా ఆలనా పాలనా చూశావా? ఈనాడు అన్నయ్య ప్రయోజకుడయితే, ఎలా వాడ్ని ఉద్యోగంనించి బయటకి పంపేయ్యాలా అని ప్లాన్ చేశావు. ఉద్యోగం నించి పంపలేక ఏకంగా పైకి పంపేశావు."

"గెటౌట్! మరో క్షణం నా కళ్ళముందున్నావంటే ఏం చేస్తానో నాకే తెలియదు. పోనీలే రక్తసంబంధీకులు కదా అని నాకు చేతనైన సహాయం చేస్తే, చివరికి నా మీద అభాండాలు వేసి అవమానకరంగా మాట్లాడతావా? వెళ్ళిక్కడ్నుంచి!"

"వెళ్తాను మిస్టర్ పోలారావ్! నీ అకృత్యాలు అన్నీ బయట పెడతాను. అన్నయ్యనెందుకు ఎలా హత్య చేశావో అన్నీ వివరాలతో పోలీసులకి చెప్పటానికే వెళుతున్నాను. వాళ్ళే చూసుకుంటారు తక్కిన కథ."

"ఆగు!" వెనకనించి అరిచాడు పోలారావు. ఇప్పుడతని చేతిలో నిగనిగ మెరుస్తున్న పిస్తోలు ఉంది. అది తిన్నగా రవీంద్రకే గురిచేయబడివుంది!

# 9

శేఖర్ చాలా సేపట్నుంచీ ఆ పాన్‌షాపు దగ్గర ఎదురు చూస్తున్నాడు. ముఖానికి పేపరడ్డం పెట్టుకొని ఆటే పరీక్షగా చూస్తున్నాడు.

అంతకితమే తన బాధ గోపీ ఆ యింట్లోకి వెళ్ళాడు. అతను మళ్ళీ బయటకొస్తాడని చూస్తూన్నాడు. గంట

యినా బయటకు రాలేదు.

స్కూటర్ బయట స్టాండు వేసి వున్నది.

సాయంత్రం ఆరు గంటలయింది.

ఆ ఇల్లు గోపీ ఉంపుడుకత్తెదని శేఖర్ కి తెలుసు. ఆమె వల్లోపడి చెల్లాయి సుజాతని నిలువునా ప్రాణం తీసేశాడు గోపీ. అలాంటి కిరాతకుడ్ని నరరూప రాక్షసుడ్ని ఎట్టి పరిస్థితుల్లోను ప్రాణాలతో వదలకూడదని నిర్ణయించుకున్నాడు శేఖర్.

అయితే చట్టానికి సాక్ష్యాధారాలు కావాలి. వాటిని కోర్టులో రుజువు చెయ్యగలగాలి. అప్పుడే గోపీకి శిక్ష పడుతుంది.

కాని తను చట్టాన్ని తన చేతుల్లోకి తీసుకోవాలను కుంటున్నాడు. తనే న్యాయమూర్తిగా తన చెల్లెలుకు జరిగిన అన్యాయానికి గోపీకి శిక్ష విధించాలనుకుంటు న్నాడు. అతనికి ఆ పనిగా సాయపడిన అతని తల్లిని కూడా శిక్షించాలి! పరోక్షంగా అతన్ని ప్రేరేపించిన ఈ ఉంపుడుకత్తెను కూడా విడిచిపెట్టకూడదు!

సుజాత గురించి తలచుకునే కొద్దీ శేఖర్ రక్తం సల సల మరుగుతోంది. నిర్దాక్షిణ్యంగా అమాయకురాలైన చెల్లెల్ని పొట్టన పెట్టుకున్న ఈ రాక్షసుల్ని నిలువునా నరికెయ్యాలి.

అప్పుడే సుజాత ఆత్మకు శాంతి!

శేఖర్ పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

మరో అరగంట తర్వాత గోపీ బయటికొచ్చాడు. వెనకనే గుమ్మందాకా వచ్చిన మెరుపు తీగను చూసి పళ్ళు పటపటలాడించాడు. నిజానికి ఆ అమ్మాయి సుజాత అంతటి అందగత్తె కాదు. కాని గోపీ ఎలా పడ్డాడీమె

తల్లో? కామం గుడ్డిది.

గోపీ స్కూటర్ మీద వెళ్ళిపోయాడు.

శేఖర్ చకచక ఆ గుమ్మం మెట్లెక్కాడు. తలుపు పైన టకటక చప్పుడు చేశాడు.

"ఎవరు?" అన్న సన్నటి స్వరం వినిపించింది.

"నే నే!" అన్నాడు పొడిగా.

తలుపులు తెరుచుకున్నాయి. ఆమె బయటికి తొంగి చూసి శేఖర్ ని చూసి వెంటనే తలుపులు మూసుకో బోయింది.

శేఖర్ మెరుపు వేగంతో తలుపు సందున కాలు పెట్టి నెట్టుకుంటూ లోపలికి వెళ్ళిపోయాడు. ఆ వెనకనే తలుపు మూసి బోల్టు పెట్టేశాడు.

"ఎవరు....ఎవరునువ్వు....వెంటనే బయటికి వెళ్ళక పోయావంటే అందర్నీ పిలిచి అల్లరి చేస్తాను" బెదిరించింది ఆమె.

శేఖర్ చేతిలో తళుక్కున మెరిసింది బటన్ నైఫ్! "పిలుస్తావా? ఇప్పుడు పిలు....నీ పిలుపు శాశ్వతంగా ఆగి పోతుందో లేదో, చూద్దువుగాని!" అన్నాడు.

ఆమె భయంతో బిగుసుకుపోయింది.

"న....నన్నేం చెయ్యకు....నీకేం కావాలో తీసుకుపో...." అన్నది. గొంతు పొడారిపోయి, చెమటలతో ఆమె శరీరం తడిసిపోయింది.

"నాక్కావలసింది నీ దగ్గర లేదు. నువ్విచ్చేది నా కక్కర్లేదు."

"నీకేం కావాలన్నా సరే తీసుకుపో నే వద్దు చెప్పను. కాని, నన్నేం చెయ్యకు...." భయంగా చూసిందతని వంక.

"నీ పేరేమిటి?" అడిగాడు శేఖర్.

"సుందరి" అన్నదామె.

"ఓహో, అపురూప సౌందర్యవతివనీ సుందరి అని పేరు పెట్టుకున్నావు? ...ఊఁ! ఏం కావాలన్నా ఇస్తానన్నావు కదా, నువ్వే కావాలి! రా." అన్నాడు శేఖర్ ఆమె చెయ్యిపట్టుకొని.

సుందరి ఒక్క క్షణం ఆలోచించి, "నీ కోరిక తీరుస్తాను. నన్నేం చెయ్యకుండా వదిలేస్తావా?" అన్నది....

"నీకేమి హాని చెయ్యకపోతే నువ్వు నాతో గడపటానికి సిద్ధమేనన్నమాట! నీవు శీలంపోయినా, ప్రాణం నిలబడితే చాలు, అవునా?"

"ప్రాణంపోతే రాదుకదా!"

"ఓహో! ఇంత శీలవతివనా నిన్ను గోపీ ఉంచుకున్నాడు?"

"గోపీ సంగతి నీకెలా తెలుసు? నువ్వెవరు?"

"నేనెవరో నీవు తెలియాల్సిన అవసరం లేదు. కాని ఓ అమాయకురాలిని చంపించినందుకు, ఆమె బంధువుల్ని శోకసముద్రంలో ముంచి నువ్వు ఆ గోపీగాడితో కులుకుతున్నందుకు నిన్నేం చేసినా పాపంలేదు!"

సుందరి భయంగా చూసింది. "నేనెవర్నీ చంపించలేదు. నాకేం తెలియదు" అన్నది.

"అలాగా! సుజాతని చంపించింది నువ్వు కాదూ? నీ వల్లో పడికదూ, ఆ నికృష్టుడు అగ్నిసాక్షిగా పెళ్ళాడిన భార్యను కిరోసిన్‌తో తగలేశాడు?! ఏం నువ్వు ఆమె కన్నా అందగత్తెవా? ఆమె కాలిగోటికి కూడా సరిపోలవు." శేఖర్ ఒక్కో అడుగే ఆమె దగ్గరకు వేస్తుంటే ఆమె మరింత వెనక్కి పోతోంది. గోడ

అడ్డొచ్చింది. గోడకు ఆనుకుని నిల్చుండిపోయింది.

"నువ్వే అందాన్ని నమ్ముకుని వచ్చుసి సంసారాన్ని మంటపెట్టేశావో, ఏ అందాన్ని నమ్ముకుని నా చెల్లెలి జీవితాన్ని మట్టిలో కలిపేశావో, ఏ అందం చూసి మోహించి ఆ గోపీగాడు నీ వెంట పడ్డాడో—ఆ అందం నీకు శాశ్వతంగా లేకుండా చేస్తాను." అంటూ ముందుకొచ్చి ఆమె రెండు బుగ్గలమీదా కత్తితో పొడవుగా గాట్లు పెట్టాడు శేఖర్.

ఆమె కెవ్వున అరవబోయింది. చటుక్కున నోరు మూసేశాడు.

ఆమె ముఖమంతా రక్తమయమయిపోయింది. బాధతో భయంతో ఆమె ముఖంలోకి ప్రేతకళ వచ్చేసింది.

శేఖర్ ఆమె జుట్టు చేతిలోకి తీసుకుని కసుక్కు కసుక్కు ఆమెజడ కోసి పారేశాడు. ఆ తర్వాత ఆమె చెవులు ముక్కు కోసేశాడు. శూర్పణఖ ముక్కు చెవులు కోసిన లక్ష్మణుడిని తలపింప చేస్తున్నాడు శేఖర్. అతని ముఖం క్రోధంతో అరుణిమదాల్చింది. మూడో నేత్రం తెరిచిన శివుడిలా, దక్షయజ్ఞాన్ని నాశనం చేసిన వీరభద్రుడిలా మహోగ్రంగా ఉన్నాడు.

బాధ భరించలేక గోడు గోడున ఏడుస్తోంది సుందరి. ఆమె దుస్తులంతా రక్తమయం! భయంతో, ఆందోళనతో, బాధతో ఆమె మెరుక్షణం స్పృహతప్పి నేలమీద కుప్ప కూలిపోయింది.

సరిగ్గా అప్పుడే బయట గుమ్మందగ్గర గోపీ నిల్చుని తలుపు తడుతున్నాడు.

శేఖర్ కొద్ది క్షణాలు అలాగే నిల్చుండిపోయాడు. తప్పించుకుని పోయే మార్గం గురించి ఆలోచిస్తూ.

# 10

"ఎలావుంది అరుణ్ ఒంట్లో?" కిశోర్. ప్రసాద రావు ఒకేసారి అడిగాడు.

అరుణ్ కాస్త ఆశ్చర్యంగా చూసి, "నాకేం? నేను బాగానే వున్నానే! చాలా సేపు నిద్రపోయినట్టున్నాను. బాగా ఆకలిగావుంది.... టైమెంత?" అన్నాడు.

కిశోర్ చెప్పాడు "మధ్యాహ్నం రెండున్నరయింది. లే, లేచి ముఖం కడుక్కునిరా! నీకోసమని మేం కూడా భోంచెయ్యకుండా చూస్తున్నాం."

వెళ్ళిపోబోయిన సుధాకర్ అరుణ్ లేవటం చూసి వెనక్కి వచ్చాడు.

సుధాకర్ని అంతదూరంలో చూస్తూనే "హలో డాక్టర్! రండి, రండి! ఏమిటిలా వచ్చారు?" అన్నాడు అరుణ్, ముఖంలో నవ్వు తెచ్చుకుంటూ.

సుధాకర్ మందహాసం చేస్తూ, "ఊరికే నే వచ్చాను. హౌ డు యూ డూ?" అన్నాడు.

"ఓ.కే. ఫైన్! అలా సోఫాలో కూర్చోండి" అన్నాడు అరుణ్ మంచం దిగి కుర్చీలో కూచుంటూ.

సుధాకర్ అరుణ్ దగ్గరగా వచ్చి అతన్ని పరిశీలనగా చూస్తూ "ఏమిటి డల్‌గా వున్నారు....!?" అన్నాడు, యథాలాపంగా అన్నట్టు. అంటూనే అరుణ్ చేతిని స్నేహపూర్వకంగా నొక్కుతూ పల్స్ రేటు గమనించాడు.

నార్మల్‌గావుంది!

"కూచోండి ఇప్పుడే వస్తాను" అంటూ బాత్‌రూం వైపు నడిచాడు అరుణ్.

సుధాకర్ కిశోర్ వంక చూసి, "అతనిప్పుడు చాలా మామూలుగా ఉన్నాడు. ఇంతక్రితం వింతగా ప్రవర్తించిన

మనిషి ఇతనేనా అనిపించేటట్టున్నాడు. అతనిలోని ఈ ద్వంద్వ ప్రవృత్తిని మన సర్వ నిపుణుడయితేనే ఖచ్చితంగా బాగు చెయ్యగలుగుతాడు. మేఘనాధ్‌ని కన్సల్టు చేయటంలో అలక్ష్యం చెయ్యొద్దు" అన్నాడు.

కిశోర్ "అలాగే సర్. మీరు చాలా శ్రమ తీసుకున్నారు. వెళ్ళిరండి! అవసరమైతే ఫోన్ చేస్తాను." అన్నాడు.

సుధాకర్ వెళ్ళిపోయాడు.

మరో అయిదు నిమిషాల తర్వాత అరుణ్ తిరిగొచ్చి. "నేను రెడీ! పదన్నయ్యా భోంచేద్దాం!" అన్నాడు.

అప్పటికే డైనింగ్ టేబిల్ దగ్గర శాంతమ్మ, స్రవంతి అన్నీ సర్ది సిద్ధంగా ఉన్నారు. అరుణ్ వింత ప్రవర్తనకి ఇద్దరు బాగా కంగిపోయారు. డాక్టర్ వద్దన్నాడని గదిలోకి రాలేదు కాని బయటినుంచి ఎప్పటికప్పుడు అరుణ్ ప్రవర్తనని వారిద్దరు పరిశీలిస్తూనే వున్నారు.

అరుణ్ వాళ్ళిద్దర్నీ చూసి, "ఏమ్మా నువ్వూ ఇంకా భోంచెయ్యలేదా? హాయ్ స్రవంతీ," అంటూ పలకరించాడు.

శాంతమ్మ కొడుకువంక ఆప్యాయంగా ప్రేమగా చూసింది. ఇంత సౌమ్యుడైన కుర్రాడ్ని ఏదో దుష్టశక్తి పీడిస్తోంది. వాడి బంగారు భవిష్యత్తుని, ఆరోగ్యాన్ని నాశనం చేస్తోంది. ఎన్నాళ్ళు ఈ శిక్ష?

కిశోర్ ప్రసాదరావుతో ఇంకా గదిలోనే ఉన్నాడు.

"చిన్నాన్నా, మేఘనాధ్‌కి ఫోన్ చెయ్యనా?" అంటున్నాడు.

ప్రసాదరావు తలూపి, "కాసేపే కన్సల్టు చెయ్యటంలో తప్పులేదుగా! ఇప్పుడు మామూలుగానే వున్నాడు. కాని

ఎప్పుడెలా మారిపోతాడో చెప్పలేంకదా!" అన్నాడు.

కిశోర్ ఫోన్ దగ్గరకు నడిచాము.

డయిల్ చేశాను. అవతల్నుంచి రెస్పాన్స్ వచ్చింది.

"మేఘనాథ్ గారు ఊళ్ళో లేరండి. బాంబే వెళ్ళారు. రేపు ఉదయానికొస్తారు." అన్నారు అవతల్నుంచి.

కిశోర్ వెంటనే, "రాగానే కిశోర్ ఫోన్ చేశాడని, అర్జంటుగా రమ్మన్నాననీ చెప్పండి." అంటూ ఫోన్ క్రేడిల్ చేసి "పద చిన్నాన్నా! భోంచేదాం" అన్నాడు.

భోజనాల దగ్గర చాలా బుద్ధిగా కూచున్నాడు అరుణ్. మామూలుగానే తిన్నాడు.

అప్పుడు మధ్యాహ్నం మూడున్నరగంటలయ్యింది.

కిశోర్ తనగదిలో కూచుని ఆలోచిస్తున్నాడు. సుధాకర్ మాట కాదనలేక సైకియాట్రిస్ట్‌కి ఫోన్ చేశాడే గాని, ఏ భూత వైద్యుడినో పిలిపించి వుండాల్సిందేమోనని పదే పదే అనిపిస్తోంది.

ఖచ్చితంగా శ్యామలరావు ఆత్మే అరుణ్‌ని పట్టుకొంది, అనుమానం లేదు! శ్యామలరావు చనిపోయి తన మీద కక్ష తీర్చుకుంటున్నాడు. తనని వచ్చి సాధిస్తున్నాడు. అమాయకుడైన అరుణ్‌ని పట్టి పీడిస్తూ తనని ఆత్మక్షోభ కలిగిస్తున్నాడు.

శ్యామలరావు!....తను అన్యాయమే చేశాడు ఆ కుటుంబానికి. కావాలని చేసిన తప్పు కాదు. కాని తప్పు తప్పే! అది నిప్పులా నిండు జీవితాల్ని బలితీసుకొంది. అందుకు శ్యామలరావు తనకి శిక్ష విధించాలి. అరుణ్ ఏం చేసాడు?

ఎలా ఈ సమస్యని పరిష్కరించాలి? శ్యామలరావు ఆత్మని ఎలా వదిలించుకోవాలి? ఈ రాత్రి మళ్ళీ అరుణ్‌ని

అవహిస్తాడా? అరుణ్ ని ఆవహించినప్పుడు అరుణ్ మాటలు అచ్చం శ్యామలరావు మాటల్లాగే ఉంటున్నాయి. ఆ చూపు, నవ్వు—అంతా శ్యామలరావే!

స్మశానంలో తనకి స్పష్టంగా కనిపించింది శ్యామల రావు దెయ్యం! అయితే మామూలుగా కాదు, చాలా వికృతంగా. తను భ్రమపడ్డాడా? లేక తను చేసిన పాపం తనకి అనుక్షణం గుర్తొచ్చి తనే అలా ఫీలవుతున్నాడా?

తల విదిలించాడు కిశోర్. ఏది ఏమైనా తన గురించి అరుణ్ బలై పోకూడదు! ఇది తనకి, శ్యామలరావుకి మధ్యనున్న వైరం! తనే తేల్చుకోవాలి! అరుణ్ కిందులో భాగం లేదు.

కిశోర్ ఆలోచనలమధ్య ఫ్యాక్టరీకి వెళ్ళకుండానే గడిపేశాడు. ప్రసాదరావు వెళ్ళాడు.

రాత్రి ఎనిమిదిగంటలకే భోజనాదులు ముగించి అరుణ్ గదిలో పుస్తకాలు ముందేసుకుని కూచున్నాడు కిశోర్.

అరుణ్ అతనికన్న వెనగ్గా గదిలోకి వచ్చాడు.

కిశోర్ తమ్ముడివంక చిరునవ్వుతో చూసి, "ఈ రాత్రికి కూడా నీ గదిలోనే పడుకుంటాను." అన్నాడు.

అరుణ్ భుజాలెగరేసి, "అభ్యంతరమేముంటుంది? విత్ ప్లజర్!" అన్నాడు.

కిశోర్ ఏమయినాసరే, ఆ రాత్రంతా మేలుకొనే ఉండాలని గట్టిగా నిర్ణయించుకున్నాడు మనసులో.

అరుణ్ తొమ్మిదిన్నరవరకు క్లాసు పుస్తకాలు తిరగేశాడు. రెండురోజులుగా క్లాసులకి పోవటంలేదు. పగలైతే ఫరవాలేదు గాని, ఈవెనింగ్ కోర్సు కాబట్టి సాయంత్రం ఆరునించి రాత్రి పదిగంటలదాకా

ఉంటాయి క్లాసులు. తల్లిదండ్రుల ఒకటే గొడవ.

తనకైతే సి.ఏ. కోర్సంటే ప్రాణం! ఎం.కామ్‌లో చేరటానికి ముందే ఆ కోర్సు పీరియడ్‌ అంతవరకు కవర్ చేసెయ్యాలని దృఢనిశ్చయంతో ఉన్నాడు! ఈ అనారోగ్య పరిస్థితికల్ల అనుకోకుండా బ్రేక్ పడింది.

పుస్తకాలు చూస్తూ చూస్తూనే అలాగే నిద్రలోకి జారిపోయాడు అరుణ్.

కిశోర్ క్రీగంట తమ్ముడ్ని చూస్తూనే ఉన్నాడు. అతని చర్యల్లోగాని, ప్రవర్తనలోగాని ఏదైనా మార్పు గోచరిస్తుందేమోనని జాగ్రత్తగా కనిపెట్టుకుని ఉన్నాడు.

పది గంటలు కొట్టింది గడియారం.

మేడమీద గదుల్లో లైట్లు వెలుగుతున్నాయి. అంటే తల్లి, స్రవంతి ఇంకా మేలుకునే ఉన్నారన్నమాట! కింది గదిలో పడుకున్న చిన్నాన్న కూడా బహుశా నిద్ర పోయివుండడు! ఆయన గదిలో కూడా లైటు వెలుగుతున్నది.

వాతావరణంలో ఎలాంటి మార్పు కనిపించలేదు.

కిశోర్ అలాగే ఏదో పని కల్పించుకుని మెలకువగా ఉన్నాడు. ఆ సాయంత్రమే నిద్రరాకుండా నిరోధించే కాప్స్యూల్ వేసుకున్నాడు. అది సుధాకర్ యిచ్చాడు.

డాక్టరిచ్చిన మందు పనిచేస్తోందనటానికి ఆవలింతలు కూడా రావటంలేదు కిశోర్‌కి. ఫ్రెష్‌గా అప్పుడే నిద్ర లేచినట్టు ఉత్సాహంగా ఉంది.

పన్నెండున్నర గంటలయింది.

సరిగ్గా అప్పుడే వాతావరణంలో చెప్పలేనంత మార్పు కనిపించింది. గాలి రివ్వున వీచింది. కిటికీ తెరలు కదిలాయి. తలుపులు కొట్టుకున్నాయి.

గాల్లో ఏదో గుర్తు తెలియని మార్పు స్పష్టంగా గోచరించింది. గదిలో ఎవరో మసలుతున్నట్టు భ్రాంతి.

కిశోర్ నిద్రపోతున్నట్టు కళ్లు మూసుకుని పక్కకు తిరిగి పడుకుని, గదిని క్రీగంట పరిశీలిస్తున్నాడు. ముఖ్యంగా అరుణ్ మంచంవైపు దృష్టిని కేంద్రీకరించాడు.

చటుక్కున దీపాలు ఆరిపోయాయి. కావాలనే గదిలోని దీపం తీసెయ్యకుండా అట్టే పెట్టాడు కిశోర్. గదిలో జరిగేదంతా చూడాలని అతని ఉద్దేశం!

కాని ఒక్కసారిగా గదిలో గాఢాంధకారం అలముకోగానే కిశోర్ ఉలిక్కిపడ్డాడు. చీమ చిటుక్కుమన్నా వినిపించేటంత నిశ్శబ్దం అలముకొని ఉంది.

సరిగ్గా అప్పుడే అరుణ్ మంచంలో లేచి కూచున్నాడు.

కిశోర్ ఊపిరి బిగబట్టి చూస్తున్నాడు.

అరుణ్ నించున్నాడు. ముందుకి నడుస్తున్నాడు. అంత క్రితం తను జాగ్రత్తగా బోల్టు పెట్టి వుంచిన తలుపులు తెరుచుకుని వుండటం చూసి విస్తుపోయాడు కిశోర్. ఇదెలా జరిగింది? తను భ్రమపడుతున్నాడా?

అరుణ్ గది బయటకు వెళ్ళిపోతుండగా మెల్లిగా లేచాడు కిశోర్. గుమ్మం దగ్గరకు వెళ్ళి బయటికి చూశాడు. అప్పటికే అరుణ్ గేటుదగ్గరికి వెళ్ళిపోయాడు.

చిత్రం! మెయిన్ గేట్ కూడా బార్లా తెరచివున్నది.

అరుణ్ గేట్లోంచి బయటకు నడిచి రోడ్డెక్కాడు. వీధిలైట్లు కూడా వెలగటంలేదు. సప్లయి ఫెయిల్యూర్ లా వుంది!

అరుణ్ తిన్నగా నడుస్తూ వెళ్ళిపోతున్నాడు. ఎంతో అలవాటైన దారిలో బాగా అలవాటయినవాడిలాగా

చురుగ్గా అడుగులు వేస్తూ వెళ్తున్నాడు.

కిశోర్ జాగ్రత్తగా అనుసరించి వెళ్తున్నాడు.

అరుణ్ మామూలుగానే స్మశానంవైపు నడుస్తున్నాడు. కంకర రోడ్డుమీదికి మరలాడు అరుణ్.

కిశోర్ తనూ అరుణ్ వెంట స్మశానంలోనికి నడిచాడు.

అరుణ్ ఏకాగ్రతతో స్మశానం మధ్యకు వెళ్తున్నాడు. కిశోర్ అతన్ని అనుసరిస్తున్నాడు.

స్మశానమంతా జాగ్రత్తగా పరిశీలిస్తూనే అరుణ్ని అనుసరిస్తున్నాడు కిశోర్.

అరుణ్ నడుస్తున్నాడు. ఓ గొయ్యిదగ్గర ఆగాడు. అది సమాధి గొయ్యి! అప్పటికే ఎవరో ఆ గొయ్యి తవ్వి వుండాలి.

అరుణ్ ఎవరో చెప్పినట్టుగా ఆ గొయ్యి పక్కనే కూలబడ్డాడు. బాచిపట్టు వేసుకున్నాడు.

గోతివంక చూసి త్రుళ్ళిపడ్డాడు కిశోర్.

గోతిపక్కనే ఓ శవం వెల్లకిలా పడుకో బెట్టబడి వుండటం కూడా కనిపించింది.

ఆ గోతికి కుడివైపు బ్రహ్మజెముడు చెట్లు చాలా ఒత్తుగా పెరిగివున్నాయి. కిశోర్ మెల్లగా ఎవరి దృష్టి పడకుండా జాగ్రత్తలు తీసుకుంటూ బ్రహ్మజెముడు మొక్కల వెనక్కి చేరాడు.

ఇప్పుడు అతనికి ఆ చుట్టుపట్ల జరిగేదంతా కనిపిస్తోంది వినిపిస్తోంది.

చీకటి దట్టంగా అలముకొని వుంది!

కిశోర్ అరుణ్ వంక చూస్తూన్నాడు. అరుణ్ బుద్ధిమంతుడిలాగా కూచుని వున్నాడు. ఏ ఆలోచన లేకుండా

నిర్వికారంగా నిశ్చలంగా కూచునివున్నాడు.

సరిగ్గా అప్పుడే ఎక్కణ్ణుంచో ఓ వ్యక్తి హడావిడిగా వచ్చి గొయ్యి పక్కన కూచున్నాడు,

కిశోర్ ఊపిరి బిగబట్టి చూస్తూన్నాడు. అటువంటి వ్యక్తి నిదివరలో యెక్కడయినా చూశానేమోనని గుర్తు చేసుకోవటానికి ప్రయత్నిస్తూన్నాడు. గతంలో ఎక్కడా చూసిన గుర్తు రావటంలేదు.

ఆ వ్యక్తి శవం పక్కనున్న శవం ఒంటికి, తన చేతిలో వున్న ముంజేతి ఎముకను తలనుంచి కాళ్ళదాకా, కాళ్ళ నుంచి తలదాకా తాకిస్తున్నాడు. ఏవేవో మంత్రాలు జపిస్తున్నాడు. తెలుగు, సంస్కృతంగాని ఏదో భాష — పైశాచిక భాష!

కిశోర్ పరీక్షగా అతనివంకే చూస్తూన్నాడు.

అతను ఒంటినిండా దట్టంగా విబూది పూసుకున్నాడు. ముఖాన విబూది అడ్డబొట్లు! మెళ్ళో పూసల దండలు. కళ్ళు ఎర్రగా చింతనిప్పుల్లా వున్నాయి. దూరంగా మండుతోన్న చితి వెలుగు అతని ముఖంమీద ప్రతిఫలిస్తోంది!

కిశోర్ ఆశ్చర్యంగా చూస్తున్నాడు—అంతక్రితం స్మశానంలో ఎక్కడా చితి వెలుగులేదు. ఒక్కసారిగా ఆ వెలుగు ఎక్కడ్నించి వస్తోంది?

అతను అరుణ్ వొంటికి ముంజేతి ఎముకను తాకిస్తున్నాడు. ముందుగా కళ్ళను తాకించాడు. ఆ తర్వాత అతని తలమీద దాంతో మూడుసార్లు మెల్లిగా కొట్టాడు. ఎముకతో అరుణ్ కూచున్న స్థలం చుట్టూ వలయాకారంగా గీశాడు.

కిశోర్ ఇక ఆలస్యం చెయ్యలేదు.

ఈ తంతు జరగనివ్వకూడదు! అతను అరుణ్‌ని ఏదో

మత్తులోకి తీసుకు వెళ్ళటానికి ప్రయత్నిస్తున్నాడు. అతని ప్రయత్నం కొనసాగనివ్వకూడదు!

అంతే! రివ్వున వారిద్దరి మధ్యకు ఒక్కసారిగా పరుగు పెట్టాడు కిశోర్.

అదే అతను చేసిన పొరపాటు!

ఆ వ్యక్తి ఒక్కక్షణం తొట్రుపడ్డాడు కిశోర్‌ని చూసి. ఆ తర్వాత ఏం జరగనట్టు హడావిడిగా అక్కడ్నుంచి మెరుపులా మాయమై చీకట్లో వెళ్ళిపోయాడు.

కిశోర్ అతని వెంట పరుగెత్తాడు. కాని, అప్పటికే ఆలస్యమయ్యింది. అతని జాడ లేదు!

ఎముకలు, ఎండు చితుకులు అతని కాళ్ళ కింద ఫెటిల్లుమని పగుల్తున్నాయి. కుండ పెంకులు చిట్లుతున్నాయి.

ఇప్పుడు స్మశానంలో ఎక్కడా మండుతున్న చితి గాని, వెలుగు గాని లేవు! కనీసం పొగ కూడా లేదు.

కిశోర్‌కి అంతా విచిత్రంగా వుంది!

అతనెక్కడికి మాయమయ్యాడు? తను చూసింది నిజమేనా? లేక భ్రమపడ్డాడా?

తనది భ్రమ కాదని సమాధి గొయ్యి రుజువు చేస్తోంది. గోతిపక్కన పడున్న శవం యింకా అక్కడే అలాగే వుంది!

అప్పుడు పడింది కిశోర్ చూపు తమ్ముడిమీద!

వెల్లకిలా విరుచుకుపడిపోయి స్పృహ లేకుండా పడున్నాడు అరుణ్.

కిశోర్ మోకాళ్ళమీద వంగి అరుణ్ ముక్కు దగ్గర వేలు పెట్టి చూశాడు.

శ్వాస ఆడుతోంది! కాని చాలా బలహీనంగా.

వాడి చూశాడు—అది కూడా బలహీనంగానే వుంది.

ఇప్పుడేం చెయ్యాలి? అరుణ్‌ని అనుసరించి వచ్చే హడావిడిలో కారు జోలికి పోలేదు. వెంట కారుంటే ఎంత బావున్ను!

ఇప్పుడు అరుణ్‌ని యెలా మోసుకుపోవాలి?

కిశోర్ వంగి అరుణ్‌ని లేపి భుజంమీద వేసుకో బోయాడు. కాని అరుణ్ తోటకూర కాడలా వేలాడి పోతున్నాడు. చేతుల్లో నిలబడటంలేదు.

ఏం చెయ్యాలో తెలియని అగమ్యస్థితిలో అతని కళ్ళముందు మెరుపులు మెరిశాయి. అప్రయత్నంగా కళ్ళు మూతలు పడ్డాయి కిశోర్‌కి.

# 11

రవీంద్ర కొద్ది క్షణాలు కర్తవ్య విమూఢుడిలా నిల్చుండిపోయాడు.

పోలారావు వికటంగా నవ్వాడు. అతని చేతిలోని పిస్తోలు యే క్షణంలోనైనా పాగలు కక్కటానికి సిద్ధంగా సేఫ్టీ కాచ్ కూడా తప్పించబడి వుంది.

"ఇప్పుడు చెప్పు బిడ్డా, నా అకృత్యాలని బయట పెడతావా? నీ అన్నను నేను హత్య చేశావా? సాక్ష్యాధారాలు నీ దగ్గరున్నాయా? ...వాటిని యమధర్మరాజుకు చూపించు. భూలోకంలో ఎవరూ చూసే అవకాశం లేదుగా మరి!...." పోలారావు ట్రిగ్గర్ మీద వేలుంచాడు.

రవీంద్రలో తెగింపు వచ్చేసింది. చిన్నాన్న యెంతకయినా తెగించగల దుర్మార్గుడని, కిరాతకుడని పూర్తిగా అర్థమైపోయింది. అన్నను చంపినట్టే తనని కూడా

చం పేయటానికి వెనుతియ్యటం లేదు.

తండ్రిని కూడా పోలారావే చం పేశాడేమో .. !?

మొదటిసారిగా పీంద్రకు తన తండ్రి మరణం వెనక

చిన్నాన్న హస్తం ఉండివుండొచ్చునని తట్టింది.

అతని మస్తిష్కం చాలా తీవ్రంగా ఆలోచిస్తోంది.

ప్రస్తుతం ఇంట్లో పోలారావు తప్ప మరెవరూ లేరు. తను, పోలారావు మాత్రమే ఆ గదిలో వున్నారు. తనని కాల్చి పారేయటానికి సంసిద్ధంగా వున్నాడు పోలారావు. రివాల్వర్ కి సైలెన్సర్ అమర్చాడని తను గ్రహించగలడు.

రవీంద్ర చాలా వేగంగా, పోలారావు ఏమాత్రం ఊహించటానికి కూడా వీలుకానంత వేగంగా పోలారావు మీదికి ఎగిరి గుండెలమీద తన్నాడు.

పోలారావు అంతదూరంలో వెల్లకిలా పడిపోయాడు. రివాల్వర్ ఎగిరి దూరంగా పడింది.

ఖంగ్ మన్న శబ్దం వినిపించింది.

పోలారావు వెంటనే లేవలేకపోయాడు. నడుములు పట్టుకుపోయాయి.

ఈ లోపల పరిస్థితిని తన అదుపులోకి తెచ్చుకున్నాడు రవీంద్ర. లేవబోతున్న పోలారావుని పొట్టలో తన్నాడీ సారి. బాధగా మూలిగి ఉండచుట్టుకుపోయాడు పోలారావు.

రవీంద్ర ఒక్క అంగలో రివాల్వర్ దగ్గరకెళ్ళి దాన్ని చేతిలోకి తీసుకున్నాడు.

"కదలకు మిస్టర్ పోలారావ్! నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తాను" అన్నాడు రవీంద్ర కర్కశంగా.

పోలారావు నిస్సహాయంగా చేతులెత్తేశాడు.

రవీంద్ర అతన్ని నిప్పులు కురిసే కళ్ళతో తీక్షణంగా చూసి, "నిన్ను పినతండ్రిగా చెప్పుకోవటానికి నాకు సిగ్గేస్తోంది. లోకంలో నీలాంటి పినతండ్రులు వుంటారని జీవితంలో మొదటిసారిగా తెలిసింది. నాకు చాలా ఆనందంగా వుంది! ఈ క్షణంలో నిన్ను కాల్చిపారేసినా అడ్డుకునేవాళ్ళు లేరు.... చెప్పు, అన్నయ్యని ఎందుకు చంపావో చెప్పు!..." అన్నాడు.

అతని చేతిలోని రివాల్వర్ సూటిగా పోలారావు గుండెలకు గురిచేయబడివుంది.

పోలారావు అటుఇటు చూశాడు. తప్పించుకునే దారి కోసం వెతుక్కుంటున్నాడని రవీంద్ర గ్రహించాడు.

"పోలారావ్, నీ ట్రిక్కులు నా దగ్గర పనిచేయవు. అనవసరంగా ప్రాణాలు పోగొట్టుకోకు .... ఊఁ.... చెప్పు....అన్నయ్యని ఎందుకు చంపావు? అతను నీకేం అపకారం చేశాడని యింత ఘోరానికి పూనుకున్నావు?" హుంకరించాడు రవీంద్ర.

"నువ్వు చెప్పావుకదా, మీ నాన్న సంపాదించిన స్థలం గురించి! అది నిజమే! అది లక్షరూపాయలు కాదు కదా, పదివేలు కూడా ఖరీదు చెయ్యని రోజుల్లో ఆ స్థలాన్ని సంపాదించాడు మీ నాన్న. అప్పట్లో నాకు సగం స్థలం ఇమ్మని అడిగితే 'నా కిద్దరు కొడుకులున్నారు, వాళ్ళకి యిల్లు కట్టుకోవద్దా?' అని నవ్వేశాడు.

"నాకు ఒళ్ళు తెలియని కోపం వచ్చేసింది. ప్రమాదాన్ని సృష్టించి నేనే మీ నాన్నను చంపేశాను. అయితే ఆ స్థలం పత్రాలు దక్కించుకోవటానికి చాలా శ్రమపడ్డాను. తీరా చూస్తే ఆ పత్రాలన్నీ మీ అన్న

పేర మార్పించాడు మీ నాన్న అంతక్రితమే.

"జనార్దనం మేజరైతేగాని స్థలం అతని పరం కాదు. అంతదాకా కోర్టు అధీనంలోనే వుంటుంది ఆస్తి. ఈ విషయం తెలిసి హతాశుడనయిపోయాను. ఈ లోపల మీరంతా మీ అమ్మ పుట్టింటికి వెళ్ళిపోయారు.

"తిరిగొచ్చి జనార్దనం మళ్ళీ అదే ఫ్యాక్టరీలో ఉద్యోగం సంపాదించుకున్నాడు. మేజరయ్యాడు. ఓ రోజు జనార్దనాన్ని సముద్రస్నానం నెపంతో బీచ్‌కు తీసుకువెళ్ళాను. ఆస్తి నా పేర పవర్ అఫ్ పట్టా రాసివ్వమని నయాన చెప్పాను. అందుకు లక్షరూపాయలిస్తానని ఆశ పెట్టాను.

"జనార్దనం వినలేదు. ఆ స్థలం విషయం తనకు ముందే తెలుసునని యీ రోజు అది పదిలక్షల విలువ చేస్తుందని తను త్వరలోనే ఆ స్థలం సగం అమ్మి ఆ సొమ్ముతో మిగిలిన స్థలంలో ఫ్యాక్టరీ కట్టుకోబోతున్నానని. తను చిట్టిపాపాయిని కాదని పొగరుగా సమాధానం చెప్పాడు.

"జనార్దనం ఎట్టి పరిస్థితుల్లోను నాకు లొంగడని అర్థం చేసుకున్నాను. అతని నిర్లక్ష్యంలో ఫ్యాక్టరీ లావాదేవీల్లో తెల్లకాగితం మీద సంతకం పెట్టిన విషయం గుర్తొచ్చింది. ఫ్యాక్టరీలో చేరే సమయంలో సెక్యూరిటీ కోసం నేను సంతకాలు చేయించిన కాగితాల్లో ఒకటి నా దగ్గరుండిపోయింది. దాన్ని పవర్ అఫ్ పట్టాకి ఉపయోగించుకోవాలనుకున్నాను.

"ఈ ఆలోచన రాగానే నేను ఆలస్యం చెయ్యలేదు. అదురుబాటుగా కూచున్న జనార్దనాన్ని వెనక నుంచి రివాల్వర్ మడమతో గట్టిగా కొట్టి స్పృహ తప్పించి ఆ తర్వాత సముద్రంలో ముంచేసి ఇంటికొచ్చేశాను.

“ఉన్నదున్నట్టు అంతా చెప్పేశాను. నా నేరం ఒప్పుకున్నాను. మీ కందరికీ అన్యాయం చేశాను, నిజమే! అందు కిప్పుడు పశ్చాత్తాపపడుతున్నాను....ఒక్క విషయం అడుగుతాను, నిజం చెప్పు! నీకు నామీద యెందు కనుమానం వచ్చింది? జనార్ధనం హత్య చేయబడ్డాడని నీ కెవరు చెప్పారు?”

“అవన్నీ నీ కనవసరం. నీతో , ముచ్చటలాడుతూ చేసేటాని కొక్కడు నేనొచ్చింది. వెంటనే మా నాన్నగారు అన్నయ్య పేర రాసిన ఆ పత్రాలు, అన్నయ్య సంతకంతో వున్న బ్లాంక్ పేపరు నాకు అప్పగించు.”

“ఓ, అవా? సేఫ్టీ కోసం బాంక్ లాకర్లో దాచాను....”

“ఏ బాంక్? లాకర్ నంబరెంత? కీస్ ఏవి?”

“ఇస్తాను. సిండికేట్ బాంక్. లాకర్ నంబర్ థర్టీత్రీ” పోలారావు లేచి పక్కకి అడుగేశాడు.

“ఎక్కడికి?”

“తాళాలు అడిగావు కదా! టేబిల్ సొరుగులో ఉన్నాయి తీసిస్తాను.”

రవీంద్ర యేదో చెప్పబోయాడు. ఇంతలోనే పోలారావు మెరుపువేగంతో టేబిల్ మీదున్న ఫ్లవర్ కేస్ అందుకొని రవీంద్ర చేతిమీదకు విసిరాడు.

అంతే! రవీంద్ర చేతిలోని రివాల్వర్ యెగిరి అంత దూరంలో పడింది. అతను దానికోసం అటు అడుగువేసే లోపల యెగిరి గంతేసి రివాల్వర్ అందుకున్నాడు పోలారావు.

“ఏరా పిచ్చిరా, నామీదే తిరుగుబాటు చేస్తావా?

పైగా నా నుంచి రహస్యాలు సేకరిస్తావా?" అంటూ రివాల్వర్ గురిచూసి కాల్చాడు.

ప్రమాదాన్ని గుర్తించిన రవీంద్ర చటుక్కున నేల మీద బోర్లాపడుకుండిపోయాడు.

సరిగ్గా అప్పుడే తలుపులు తెరుచుకుని గదిలోకి అడుగు పెట్టిన వ్యక్తి గుండెల్లో దూసుకు పోయింది బుల్లెట్.

"అమ్మా!" అంటూ ఆ వ్యక్తి కిందవాలిపోవటం, "బాబూ, సురేంద్రా!" అంటూ పోలారావు గావుకేక పెట్టి ఆ వ్యక్తి దగ్గరకు పరుగెత్తుకువెళ్ళటం ఒకేసారి జరిగాయి.

ఆ వ్యక్తి—పోలారావు ఒక్కగానొక్క కొడుకు సురేంద్ర!— మెడిసన్ మూడో సంవత్సరం చదువుతున్నాడు.

రవీంద్ర వూహించని రీతిలో జరిగిపోయిన సంఘటనకు కొంతసేపు నిర్ఘాంతపోయి అంతలోనే తేరుకొని ఒక్క అంగలో పోలారావుమీద కురికి అజాగ్రత్తగా వున్న పోలారావు చేతి నుంచి రివాల్వర్ లాక్కుని అతని కణతకు గురిపెట్టాడు.

పోలారావు పిచ్చిగా నవ్వాడు. మళ్ళీమళ్ళీ నవ్వాడు. తర్వాత కుమిలి కుమిలి ఏడ్చాడు.

"చంపెయ్యి రవీంద్రా! చెట్టంత కొడుకుని చేతులార చంపుకున్నాక నేను బతికి ప్రయోజనం లేదు, నీ తండ్రిని అన్నను చంపిన కిరాతకుడ్ని—నీ ఇష్టమొచ్చిన శిక్షను విధించుకో!" అన్నాడు నిర్లిప్తంగా.

"నేను నీలా రాక్షసుడ్ని కాదు. నాకు రక్తదాహం లేదు. న్యాయంగా మాకు రావలసిన ఆస్తి మాకిచ్చేస్తే

చాలు! ఆ పత్రాలు అప్పగించు. నేను వెళ్ళిపోతాను"
అన్నాడు రవీంద్ర. అతని చేతిలోని రివాల్వర్ పోలా
రావుకే గురిచేసి వుంది. పోలారావు మాటల్ని నమ్మటం
మూర్ఖత్వమనిపించుకుంటుందని అతనికి బాగా తెలుసు.

పోలారావు యాంత్రికంగా లేచి ఐరన్ సేఫ్ దగ్గరకు
నడిచాడు రవీంద్ర అతని వెన్నుకి రివాల్వరు ఆనించి
అతని వెనకే నడిచాడు.

ఐరన్ సేఫ్ తెరిచి సీక్రెట్ లాకర్లోంచి దస్తావేజులు,
మరికొన్ని పత్రాలు తీసి రవీంద్ర చేతి కిచ్చాడు పోలా
రావు

రవీంద్ర వాటి నందుకోటానికి చేయి చాచాడు.
అంతే! పోలారావు ఆ చేతిని పట్టుకుని మెలితిప్పేశాడు.
కర కర మని చప్పుడు చేస్తూ రవీంద్ర చేయి విరిగి
పోయింది. అదే సమయంలో కాలితో రవీంద్ర చేతిమీద
పూని తన్నాడు పోలారావు. రివాల్వరు ఎగిరి అల్లంత
దూరంలో పడింది.

మరుక్షణం పోలారావు చేతిలో రివాల్వరు ప్రత్యక్ష
మయ్యింది.

రవీంద్ర విరిగిపోయిన చేయి పెడుతున్న నరకయాత
నను లెక్క చేయకుండా ఒంటిచేత్తో పోలారావుమీద
తిరగబడ్డాడు. ఎగిరి తన్నాడు.

ఇద్దరూ నేలమీద పడ్డారు.

రివాల్వరు ఢామ్మని పేలింది.

## 12

తలుపుమీద టకటక మని చప్పుడు!

"సుందరీ.... సుందూ" పిలుస్తూన్నాడు గోపీ ఆ
గొంతును వెంటనే గుర్తుపట్టాడు శేఖర్. అతను గోపీ!

శేఖర్ మనసులో అప్పటికప్పుడే స్థిరనిశ్చయం రూపు దిద్దుకుంది. గోపీని ట్రాప్ చెయ్యటానికి సరైన అదను దొరికింది. తన చెల్లెలు జీవితాన్ని నాశనం చేసిన దుష్టుడ్ని ఉరికంబమెక్కించటానికి చక్కటి అవకాశం!

శేఖర్ మోకాళ్ళమీద వంగి సుందరిని ముట్టుకొని చూశాడు. చల్లగా తగిలింది శరీరం. శేఖర్ కంగారుగా ఆమె ముక్కు దగ్గర వేలు పెట్టి నిర్ఘాంతపోయాడు.

ఆమె శ్వాస ఆడటంలేదు! గాయాలతో కాదు— షాక్‌తో చనిపోయిందామె.

తను ఆమెను చంపాలనుకోలేదు. వికృతంగా కురూపిగా తయారు చెయ్యాలనుకున్నాడు. కాని జరిగిందేమిటి?

తనిప్పుడు హంతకుడు! ఒక హత్యకైనా యెన్ని హత్యలకైనా శిక్ష ఒకటే! ఉరికంబం! తనకిక సంకోచం గాని, భయంగాని లేవు.

అంతదాకా గోపీని చంపాలనుకున్న ఆలోచనని మరోవిధంగా మార్చుకున్నాడు.

తలుపు అదే పనిగా కొడుతున్నాడు గోపీ. కిటికీలో నించి చూసి గోపీ అని ఇందాకే నిర్ధారణ చేసుకున్నాడు శేఖర్.

తలుపు ఓరగా తెరిచాడు.

"ఏమిటింత ఆలస్యం? ఏం చేస్తున్నావు లోపల?" అనుకుంటూ లోపలకి అడుగుపెట్టిన గోపీని వెనకనుంచి వాటేసుకొని అతని ముక్కుమీద గుడ్డతో అదిమాడు శేఖర్—తను ఊపిరి బిగబట్టి.

తియ్యటి వాసన. అటు యిటు గింజుకున్నాడు గోపీ. కాని క్లోరోఫాం పని చెయ్యటంతో తల పక్కకి వాల్చేసి నేలమీదకు జారిపోయాడు.

శేఖర్ టేబిల్ మీదున్న ఆపిల్ ముక్కల్ని. దాన్ని కోసిన కత్తిని చూసినప్పుడే ఆ కత్తిమీద గోపీ వేలిముద్రలుండే అవకాశముందని గ్రహించాడు. కర్చీఫ్‌తో కత్తిని తీసుకొన్నాడు. దాన్ని నేలమీద పెట్టి, గోపీ కుడిచేతిలో గట్టిగా బిగించి వేలిముద్రలు పడేవరకు నొక్కిపట్టి తర్వాత కర్చీఫ్‌తో దాన్ని పట్టుకున్నాడు.

ఇంతక్రితం దానిమీద వేలిముద్రలు పడివుండకపోతే ఇప్పుడు స్పష్టంగా పడివుంటాయి! ముందు జాగ్రత్తకోసం అలా చేయక తప్పదనుకున్నాడు.

కత్తిని సుందరి కడుపులో దించేశాడు కళ్ళు మూసుకుని. ఆ క్షణం అతడనుభవించిన చిత్తక్షోభని వర్ణించటానికి మాటలు చాలవు చచ్చిన పాముని చంపడమంటే ఇదే కాబోలు ననుకున్నాడు వేదనగా.

కాని, కసి! గోపీమీద కక్ష తీర్చుకోవాలి. ఇంతకన్న మంచి అవకాశం వస్తుందో రాదో తెలియదు. వచ్చినపుడే దాన్ని వినియోగించుకోవాలి!

చటుక్కున బయటికొచ్చాడు. క్లోరోఫాం మత్తులో ఓ యిరవై నిమిషాలవరకు పడివుంటాడు గోపీ! ఈలోపల జరగవలసింది చాలా వున్నది.

బయటినుంచి గది తలుపు గొళ్ళెం పెట్టేశాడు. ఇంతలోనే మరో ఆలోచన వచ్చింది. తలుపులు తెరచుకుని గది లోపల్నుంచి వెనక తలుపు తెరచుకుని - దాన్ని బయటనుంచి గడియ పెట్టేశాడు.

గోపీకి ఈలోపల మెలకువ వచ్చినా లేచి పారిపోవటానికి వీల్లేకుండా జాగ్రత్త చేసుకున్నాడు. దొడ్డిగోడలు దాటుకొని చుట్టు తిరిగి వాళ్ళ వీధిలోకి వచ్చాడు. ఇప్పుడు వీధి తలుపు గడియ పెట్టేశాడు. అయిదు నిమిషా

అయిపోయిందప్పుడే.

క్లోరోఫాం చాలా తక్కువ మోతాదులో ప్రయోగించాడు.

దగ్గర్లో వున్న పబ్లిక్ బూత్‌లోకి దూరాడు. అప్పటికి పదినిమిషాలు గడిచింది. పోలీసులు రావటానికి మరో పది పదిహేను నిమిషాలు పడుతుంది. ఈలోపల గోపీ స్పృహలోకి వచ్చినా తలుపులు రెండువైపుల్నించి బంధించి వుంటాయి కాబట్టి అతను తప్పించుకుని పారిపోలేడు.

రిసీవర్ ఎత్తి డయల్ చేసి ఏభై పైసల నాణెం వేశాడు.

"హల్లో క్రైం బ్రాంచ్!" అని వినిపించింది అవతల్నుంచి.

శేఖర్ సుందరి ఇంటి అడ్రసు చెప్పి, "గోపీ అనే ఇంజనీరు తన ప్రియురాల్ని హత్యచేశాడు. మీరు వెంటనే బయల్దేరి యీ యింటికి వెళ్తే హంతకుడు రెడ్ హేండెడ్ గా దొరుకుతాడు" అన్నాడు.

"హల్లో, మీరెవరు?" అడిగాడు ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్.

"నేనెవరో తెలియాల్సిన అవసరం మీకు లేదు. ఫర్ యువర్ ఇన్ఫర్మేషన్, మరో రహస్యం కూడా చెప్తాను. ఇదే గోపీ రెండురోజుల క్రితం తన తల్లి సాయంతో భార్యను కిరోసిన్ పోసి తగలెట్టి, గప్ చిప్ గా స్మశానంలో పాతిపెట్టేశాడు. కావాలంటే వెళ్ళి వెరిఫై చేసుకోవచ్చు."

"థాంక్యూ ఫర్ యువర్ సివిక్ సెన్స్! ఏ స్మశానం? ఏ సమాధి? ప్లీజ్ గివ్ డిటెయిల్స్!"

శేఖర్ వివరాలు చెప్పాడు.

"ఇప్పుడే సుందరి ఇంటికి వెళుతున్నాం! లేదితే, మీ రెలర్లో చెపితే...." శ్రీనివాస్ అరోకిలో ఆగాడు.

వెంటనే డిస్కనెక్ట్ చేశాడు శేఖర్.

# 13

కళ్ళు తెరిచేసరికి తన గదిలో బెడ్ మీదున్నాడు కిశోర్. తన ముఖం మీదికి వంగి చూస్తూన్న తల్లిని, చెల్లెల్ని ఆత్రుతగా గదిలో పచార్లు చేస్తూన్న చిన్నాన్నను చూసి వెంటనే లేచి కూచున్నాడు.

"అమ్మా, తమ్ముడేడి?" అన్నాడు గదిలో దేని కోసమో వెతుక్కుంటున్నట్టు చూసి.

"అరుణ్ తన గదిలో హాయిగా నిద్రపోతున్నాడు" చెప్పాడు ప్రసాదరావు.

"నన్ను, తమ్ముణ్ణి స్మశానం దగ్గర్నుంచి యెవరు తీసుకొచ్చారు?" అడిగాడు కిశోర్.

"తమ్ముడు ఇంట్లోనే వున్నాడు కదా! నువ్వే స్మశానం దగ్గర పడున్నావు. చిన్నాన్న తీసుకొచ్చాడు. పదినిమిషా లయింది. నీకు మెలకువరావటంకోసమే యెదురుచూస్తూ న్నాం" శాంతమ్మ చెప్పింది.

కిశోర్ నిర్ఘాంతపోయి, "అదేమిటి, అరుణ్ ని నేను ఫాలో అయి స్మశానానికి వెళ్ళాను. కాదు లేకుండా వెళ్ళిపోయాను. వాడు స్పృహతప్పి పడిపోతే నేను ఎత్తుకొని స్మశానం బయటకు తీసుకురాబోయాను. ఇంతలో నా కళ్ళముందు యేవో మెరుపులు మెరిసి మైకం వచ్చి పడిపోయాను. ఆ తర్వాతేమయిందో నాకు తెలియదు" అన్నాడు.

శాంతమ్మ, స్రవంతి, ప్రసాదరావు తెల్లబోయి చూశారతని వంక.

"తమ్ముడేడి? నేను వెంటనే చూడాలి!" అన్నాడు కిశోర్ లేచి కూచుని.

ప్రసాదరావు కిశోర్ చెయ్యి పట్టుకున్నాడు ఆసరాకి.

"ఫరవాలేదు చిన్నాన్నా నేను నడవగలను!" అన్నాడు కిశోర్ అరుణ్ గదివైపు అడుగులేస్తూ.

అరుణ్ గది తలుపులు దగ్గరగా వేసి వున్నాయి.

ప్రసాదరావు తెరిచాడు.

మంచంమీద అరుణ్ ప్రశాంతంగా నిద్రపోతున్నాడు. గదిలో బెడ్‌లాంప్ వెలుగుతోంది.

కిశోర్ అరుణ్ దగ్గరగా వెళ్ళి అతని ముఖంలోకి చూశాడు. అంతక్రితం తమ్ముడితో బాటు తను ఆ గదిలోనే పడుకున్నాడు. మంచం, పక్క అలాగే వున్నాయింకా.

"నేనీ గదిలో తమ్ముడికి సాయం పడుకున్నానుకదా!" అన్నాడు కిశోర్.

"అవును బాబూ! ఎప్పుడు తలుపు తెరుచుకొని వెళ్ళి పోయావో తెలియదు. ప్రవంతి నేను నా గదిలో నిద్రపోయాం. అరుణ్ పక్కన నువ్వున్నావుకదా అని మేం నిశ్చింతగా నిద్రపోయాం. చిన్నాన్న వచ్చి చెప్పేవరకు మాకు జరిగిందేమిటో తెలియదు" చెప్పింది శాంతమ్మ.

ప్రశ్నార్థకంగా చిన్నాన్నవైపు చూశాడు కిశోర్.

"అవును కిశూ, అరుణ్‌కి నువ్వు తోడు పడుకున్నావు కదా అని నేనూ ఆదమరచి నిద్రపోయాను. అర్ధరాత్రి ఎందుకో మెలకువ వచ్చి చూస్తే అరుణ్ గది తలుపులు బార్లా తెరచి వున్నాయి. నా నిద్రమత్తు వదలిపోయింది. పక్కమీద అరుణ్ కోసం ముందుగా చూశాను. హాయిగా

నిద్రపోతున్నాడు.

"చిత్రంగా. నువ్వు లేవు బాత్ రూంలో, అరు బయటలో వెళ్ళుంటావనుకున్నాను. ఓ పదినిమిషాలు చూశాను. నువ్వు రాలేదు. బాత్ రూంలోను, ఆవరణలోను లేవు. కార్లు రెండూ వున్నాయి. మరో పది నిమిషాలు చూసినా నువ్వు రాకపోవటంతో కారేసుకుని బయల్దేరాను దార్లో యెక్కడా కనిపించలేదు. ఇంతలో కారు హెడ్ లైట్స్‌లో ఎవరో రోడ్డుమీద పడివుండటం చూసి ఆపాను.

"కారు దిగి చూద్దునుకదా, నువ్వే! ఎవరు రోడ్డు మీద పడేశారో అర్థం కాలేదు. శ్వాస బాగానే వుందని సంతృప్తిపడ్డాక నిన్ను కార్లో పడుకోబెట్టి ఇంటికి తీసుకొచ్చాను. అప్పటికీ నీకు స్పృహరాలేదు. నీ గదిలో పడుకోబెట్టి అమ్మను, స్రవంతిని లేపాను" చెప్పాడు ప్రసాదరావు.

కిశోర్ నిశ్చేష్టుడై విన్నాడు.

ఏమిటిది? తను స్మశానంవరకు తమ్ముడ్ని అనుసరించి వెళ్ళటం, అక్కడ తను చూసిన క్షుద్రదేవతోపాసకుడు, అరుణ్ మూర్ఛపోవటం, తను అతన్ని భుజాన్నెత్తుకుని రాబోతూ స్పృహతప్పి పడిపోవటం—ఇదంతా తన భ్రమా?....లేక కలా?....కల కాదని తెలుస్తూనేవుంది. తను నడిరోడ్డుమీద పడున్నాడని చిన్నాన్న చెపుతున్నాడు. చిన్నాన్న అబద్ధం చెప్పడు!

"పన్నెండున్నరకి కరెంటు పోయింది. మీరెవరైనా గమనించారా? — మళ్ళీ ఎప్పుడొచ్చింది?" అడిగాడు కిశోర్.

శాంతమ్మ స్రవంతి తమకి తెలియదన్నారు.

ప్రసాదరావు మాత్రం తను లేచేసరికి లైట్లు వెలుగుతూనే వున్నాయని చెప్పాడు.

కిశోర్ కి అంతా అగమ్యగోచరంగా వుంది. తల విదిలించాడు. అసలు ఏం జరిగింది? అరుణ్ ని లేపి అడిగితే..!? ప్రయోజనముండదు. అరుణ్ నిద్రలోనే నడిచి వెళ్ళాడు. బాహ్య స్పృహ తెలియని స్థితిలో ఏం జరిగిందో ఎలా జరిగిందో ఎలా చెప్పగలడు?

“రెస్టు తీసుకో కిశోర్, నీ మనసెందుకో బాగుండలేదు. ఇంతవరకు అరుణ్ నిద్రలో నడుస్తున్నాడని చింతిస్తూంటే, నువ్వు కూడా అదేవిధంగా ప్రవర్తించటం విచిత్రంగా వుంది. ఉదయం మాట్లాడుకుందాం!” అన్నాడు ప్రసాదరావు.

“నేను గదిలోనే పడుకుంటాను” అన్నాడు కిశోర్ అరుణ్ పక్కనున్న బెడ్ మీద కూచుంటూ.

అప్పుడు రాత్రి మూడున్నర గంటలయింది.

# 14

“అన్నయ్యా, అన్నయ్యా!” అంటూ అరుణ్ తట్టి లేపుతుండగా మెలకువ వచ్చి త్రుళ్ళిపడి లేచాడు కిశోర్.

అరుణ్ అప్పటికే స్నానం చేసి ఫ్రెష్ గా వున్నాడు.

తమ్ముడి వంక అయోమయంగా చూసి, “ఏమిటి?” అన్నాడు కిశోర్.

“ఫ్యాక్టరీకి వెళ్ళావేమోనని లేపాను” అన్నాడు అరుణ్ తప్పు చేసినవాడిలా తలతిప్పుకొని.

వాల్ క్లాక్ అప్పుడే తొమ్మిది కొట్టింది.

“అరరె, తొమ్మిదయిందా అప్పుడే!? చాలాసేపు నిద్రపోయినట్టున్నాను....” అనుకొంటూ బెడ్ మీదనుంచి లేచాడు.

స్నానాదికాలు ముగించుకుని ఫ్యాక్టరీకి వెళ్ళేసరికి అక్కడంతా హడావిడిగా వుంది.

కిశోర్ ఆశ్చర్యంగా మేనేజర్ని పిలిచి "ఏమిటి, అందరు యేదో ఆందోళన చేస్తూన్నట్టున్నారు!?" అనడిగాడు.

మేనేజర్ విష్ చేసి చెప్పాడు.

"నిన్న సాయంత్రం రెండు విచిత్రమైన సంఘటనలు జరిగాయి సార్! మన ఫోర్మన్ పోలారావు తన కొడుకును చంపేసి, కణతకు పిస్తోలు పేల్చుకొని చచ్చిపోయాడు సార్! పోలీసులు దర్యాప్తు చేస్తున్నారు. కుటుంబ కలహాలవల్ల విరక్తి చెంది యిలా చేసివుంటాడని అందరు చెప్పుకుంటున్నారు."

కిశోర్ నిర్ఘాంతపోయి విన్నాడు.

మేనేజరు మళ్ళీ చెప్పాడు.

"మన ఇంజనీర్ గోపీని కూడా నిన్నరాత్రి పోలీసులు అరెస్టు చేశారట సర్! అతని భార్య ఈమధ్యనే కాలి చనిపోయింది కదా! అది ప్రమాదవశాత్తూ జరిగినది కాదని గోపీ అతని తల్లి హత్యచేసి సమాధి చేశారని తేలిందట. పోస్టుమార్టం జరిగాక అది నిజమేనని నిర్ధారణయిందట.

అదీగాక గోపీ అతని ప్రియురాలు సుందరిని హత్య చేస్తూ రెడ్ హేండెడ్ గా పోలీసులకి దొరికిపోయాడట. అతని తల్లిని కూడా హత్యానేరం కింద పోలీసులు అరెస్టు చేశారట సర్!"

కిశోర్ కి ఒకదాని వెంట మరొకటి నమ్మశక్యంకాని విషయాలు ఎదురవటంతో స్తబ్ధుగా చాలాసేపు అలాగే కూచుండిపోయాడు.

నిన్న అన్నీ విడ్డూరాలే జరిగాయి, తన విషయంలో

కూడా నమ్మశక్యంకాని సంఘటనే జరిగింది. తను నిజంగానే భ్రమపడ్డాడా? భ్రమే అయితే స్మశానం వరకు వెళ్ళటం, అరుణ్‌ని స్మశానంలో చూడటం ఎలా సంభవించాయి? తను నడిరోడ్డుమీద ఎలా పడున్నాడు?

మేనేజరు యజమాని అనిమిత్తంగా ఉండటం గమనించి మెల్లిగా బయటకు వెళ్ళిపోయాడు.

సరిగ్గా అప్పుడే పోలీస్ ఇన్‌స్పెక్టర్ లోనికొచ్చాడు.

"అయామ్ ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్!" అన్నాడు తనని పరిచయం చేసుకుంటూ.

"వెరీ గ్లాడ్ టు సీయూ సర్!" అన్నాడు కిశోర్ ఇన్‌స్పెక్టరుతో కరచాలనం చేస్తూ.

"మీతో పర్సనల్‌గా మాట్లాడాలని వచ్చాను" అన్నాడు శ్రీనివాస్.

"చెప్పండి!" అన్నాడు కిశోర్ ముందుకి వాలి.

"మీ ఫ్యాక్టరీలో పనిచేసే యిరువురు ఉద్యోగుల విషయం ఎంక్వయిరీ చేయటానికొచ్చాను. ముఖ్యంగా ఇంజనీర్ గోపీ సంగతి. అతను స్త్రీలోలుడని, అతనికో ఉంపుడుకత్తె వుందని ఆమె పేరు సుందరి అని, తెలిసింది. ఈ విషయంలో మీకేమైనా ముఖ్య విషయాలు, మా కుపకరించేవి ఉంటే చెప్పండి!...." అన్నాడు శ్రీనివాస్.

"మీకు తెలిసిన విషయాలు కూడా నాకు ఈనాటి వరకు తెలియవు. అతని వ్యక్తిగత జీవితం గురించి నాకేమీ తెలీదు. సారీ!"

"ఆల్ రైట్! మరి, ఫోర్మన్ పోలారావు సంగతి!? అతను నిన్న కొడుకును చంపి, తను సూసైడ్ చేసుకున్నాడు."

"సారీ సర్! ఒన్స్ ఎగెయిన్ సారీ! అతని విషయాలు కూడా నాకు తెలియవు...."

"ఓకే దెన్!.... ఇప్పుడు మీ పర్సనల్ విషయాని కొస్తాను. మీకు శ్యామలరావు తెలుసా?"

పక్కలో బాంబు పడ్డట్టు ఉలిక్కిపడ్డాడు కిశోర్. అతని ముఖకవళికల్ని పరిశీలనగా చూస్తున్నాడు శ్రీనివాస్.

"శ్యామలరావా? ఏ శ్యామలరావు?"

"ఎంతమంది శ్యామలరావులు తెలుసు మీకు?"

"మీ కొక్క తెలిసిన శ్యామలరావు యెవరు?"

"మీ ఆఫీసులో స్టెనోగా పనిచేసి రెండు నెల్ల క్రితం ప్రమాదానికి గురై చనిపోయిన సుధ, ఆమె తమ్ముడు శ్యామలరావు గురించిన వివరాలు కావాలి. అక్క, తమ్ముడు కూడా కొన్ని నిమిషాల వ్యవధిలో చనిపోవటం, సుధ మీ స్టెనో కావటం, అనుమానాస్పద పరిస్థితుల్లో రెండు మరణాలు సంభవించటం—ఇవన్నీ మా డిపార్టుమెంటు మీ వ్యక్తిగత విషయాల్లో జోక్యం చేసుకోవలసిన అవసరం కల్పించాయి. గోష్ఠితో జరిగిన ఇంటరాగేషన్‌లో చాలా ఆసక్తికరమైన విషయాలు బయటపడ్డాయి" చెప్పాడు శ్రీనివాస్.

కిశోర్ కొన్ని క్షణాలు మాట్లాడలేదు. తర్వాత శ్రీనివాస్ వంక నిస్సహాయంగా చూశాడు.

"వాళ్ళిద్దరి మరణాలకి నేను కారకుడనని మీరు భావిస్తున్నారా?"

"ఆ విషయం యిప్పుడే చెప్పటం సాధ్యం కాదు. దర్యాప్తు జరగాల్సి వుంది"

"రెండు నెలల క్రితం సంభవించిన మరణాల మీద

దర్యాప్తు ఎప్పుడు టేకప్ చేశారా?"

"రెండేళ్ళ క్రితం కేసులను కూడా అనుమానం మీద తిరగతోడి దోషుల్ని అరెస్టుచేసి శిక్షించిన కేసులు కూడా చాలా టేకప్ చేశాను. పదిహేనేళ్ళ క్రితం హత్యచేసి తప్పించుకుని ఘరానాగా పెద్దమనిషిలా చెలామణి అవుతున్న కోటీశ్వరుడికి ఉరిశిక్ష వేయించి నెల కూడా కాలేదు. ఇంకా చెప్పమంటారా ఉదాహరణలు?!...."

"అక్కర్లేదు. కేవలం క్యూరియాసిటీ సేక్ అడిగాను. మీ క్కావలసిన వివరాలు అడగొచ్చు."

"థాంక్యూ! సుధ యెందుకు చనిపోయింది, యెలా చనిపోయింది? శ్యామలరావు మరణానికి దారితీసిన సంఘటనలు - అన్నీ మీ నోట వినాలని వచ్చాను. యేదీ దాచకుండా చెప్తారని విశ్వసిస్తున్నాను" అన్నాడు శ్రీనివాస్.

కిశోర్ ఇంటర్‌కమ్‌లో స్టెనోకి ఫోన్ చేసి "నేను మళ్ళీ ఫోన్ చేసేవరకు యెవర్నీ నా గదికి రానివ్వద్దు. అంతగా అవసరమైతే మేనేజర్ని చూడమనండి" అని చెప్పాడు తర్వాత శ్రీనివాస్ వంక చూసి చెప్పటం మొదలెట్టాడు కిశోర్ —

## 15

సుధ మధ్యతరగతి కుటుంబంలో జన్మించినా హైక్లాస్ ఫేమిలీ స్త్రీలా చాలా హుందాగా, అందంగా, డీసెంట్ గా వుంటుంది. మొదటిసారిగా ఉద్యోగంకోసం తన దగ్గరకు వచ్చినపుడు ఆమె అందాన్ని కొద్ది క్షణాల వరకు రెప్పవాల్చకుండా చూశాడు కిశోర్.

ఆమెకు ఇరవై యేళ్ళకు పైగానే వుండొచ్చు కాని

పద్ధెనిమిదేళ్ళ యువతిలా వుంది. ఆ రోజు చిన్న పువ్వు లున్న రోజ్ కలర్ చీర కట్టుకుని మేచింగ్ బ్లౌసు వేసు కుంది. చెవులకు రోజ్ కలర్ క్రిస్టల్స్ తాపిన రింగ్స్ పెట్టుకుంది. నుదుట రోజ్ కలర్ బింది పెట్టుకుంది. ఎడమ చేతికి రోజ్ కలర్ డిసోస్ గాజులు, కుడి చేతికి రిస్టువాచ్ పెట్టుకుంది. స్ట్రాప్ రోజ్ కలర్. రోజ్ కలర్ ఆమె శరీరం రంగుతో అద్భుతంగా మేచ్ అయింది.

ఇలాంటి సౌందర్యరాశికి, పెద్దింటి పిల్లకి ఉద్యోగంతో పనేమిటా అని ఆశ్చర్యపోయాడు కిశోర్. ఆ మాటే సుధతో అన్నాడు.

సుధ మనోహరంగా నవ్వింది. "ఈ వేషం లోకం కోసం సర్! నాన్న పోయాక కుటుంబభారం మోయా ల్సింది యింటికి పెద్దదానిగా పుట్టిన నేనే కదా! తమ్ము డింకా చదువుకొంటున్నాడు. మీకు నా క్వాలిఫికేషన్స్ నచ్చితే ఉద్యోగమివ్వండి" అన్నది.

కిశోర్ ఆమె సర్టిఫికెట్స్ చూశాడు. స్టెనోగ్రాఫర్ కు కావలసిన అర్హత లున్నాయి. ఆమె వినయం, నమ్రత, నడవడి అతనికి బాగా నచ్చాయి. అందగత్తెననే అహంకారం గాని, ఆడంబరం గాని ఆమెలో మచ్చుకైనా లేవు. ఆమె తమ ఫ్యాక్టరీకే గొప్ప సెంటరాఫ్ ఎట్రాక్షన్ అవుతుందనటంలో అతిశయోక్తి లేదు.

కిశోర్ నిమిషాలమీద అపాయింట్ మెంట్ ఆర్డర్ టైపు చేయించి సంతకం పెట్టి ఆమె కందించాడు.

సుధ మనసు ఆ క్షణంలో అతనిపట్ల కృతజ్ఞతతో నిండిపోయింది. రెండు చేతులు జోడించి హృదయపూర్వకంగా నమస్కారం పెట్టింది.

అది మొదలు ఆమె ఆ ఫ్యాక్టరీలో ఓ భాగమై

పోయింది. ఆమె ఆఫీసులో వుంటే సుందర నందనో ద్యానవనం గుబాళించినట్లుండేది. ఆమె తమతో కొద్ది క్షణాలు మాట్లాడితే చాలు, తమ జన్మ ధన్యమై పోయినట్లే భావించేవారు— ఆఫీసులోను, ఫ్యాక్టరీలోను కూడా.

అయితే, సుధ చాలా రిజర్వ్‌డ్. అవసరమైనదాని కన్న ఒక్క మాటకూడా ఎవరితోను మాట్లాడేది కాదు. కిశోర్ డిక్టేట్ చేసేటపుడు కూడా చాలా కామ్‌గా వుండేది. కిశోర్ మాత్రం ఆమెను చూస్తూ కామ్‌గా వుండటం కష్టమని తెలుసుకున్నాడు.

కిశోర్ త్వరలోనే తన మనసు ఆమెపట్ల ఆకర్షింపబడుతున్న విషయం గ్రహించాడు. అందుకతను సిగ్గుపడలేదు, పైగా సంతోషించాడు. ఇన్నాళ్ళు తను పెళ్ళి చేసుకోకుండా వుండిపోయింది యిలాంటి జంటకోసమేననిపించింది కూడా.

అతను సుధతో పెళ్ళి ప్రసక్తి తెచ్చినపుడు ఆమె ఆశ్చర్యపోలేదు. ఆమె కొన్నిరోజులుగా అతని చర్యల్ని చాలా శ్రద్ధగా గమనిస్తోంది. అతను తనతో మాట్లాడేటపుడు అతని కళ్ళలో మెరిసే కాంతి ఆమెకు అతను తనంటే యిష్టపడుతున్న నిజాన్ని చెప్పకనే చెప్పేది.

సిబ్బందిని, ఫ్యాక్టరీ వర్కర్సుని కొనచూపుతో శాసించగల కార్యదక్షుడు తన విషయంలో తత్తరపడటం, మాటలకు తడుముకోవటం చూసినపుడు ఆమెకు నవ్వొచ్చేది. ఎంతవారైనా కాంతాదాసులే కదా అనుకునేది. అతను తనని కోరుతున్నాడనే అనుకొందిగాని, తనని దేవతగా ఆరాధిస్తున్నాడని తనని పవిత్రంగా ప్రేమిస్తున్నాడని, తనని పెళ్ళి అనే పవిత్ర బంధంతో ముడివేసుకోవాలనుకుంటున్నాడని— అతను నోరు విప్పి చెప్పే

వరకు గ్రహించలేదు.

గ్రహించిన మరుక్షణం ఆమె ఆనందాతిరేకంతో కొద్ది సేపు మూగదై పోయింది. ఆ తర్వాత తన అదృష్టానికి తనే మురిసిపోయింది. ఆ పైన, తన లాంటి సామాన్యురాలికి అంత గొప్పవాడితో వివాహం సంభవమా అని భయపడింది. అతని పెద్దలు అడ్డుపడతారని సందేహించింది. కిశోర్ ఆమె అనుమానాలన్నీ పటాపంచాలు చేసేశాడు. తన చేతినున్న వజ్రపుటుంగరం ఆమె చేతికి తొడిగాడు. ఆ తర్వాత ఆ చేతిని ముద్దు పెట్టుకున్నాడు సున్నితంగా.

"ఇదే మన పెళ్ళికి గుర్తు! మనకి మానసికంగా పెళ్ళయిపోయినట్టే! త్వరలో పెద్దల సమక్షంలో పెళ్ళి చేసుకుందాం" అన్నాడు.

ఆమె తనువంతా పులకరించిపోయింది. అతని పాదాల మీద వాలి భక్తి ప్రపస్సంగా కళ్ళకద్దుకుంది. అతనామెను సందిట చేర్చుకుని సమాదరించాడు.

ఆ తర్వాత అనుకోకుండా యిద్దరు హద్దు మీరిపోయారు. అతడు తనని మోసం చెయ్యడని ఆమెకు తెలుసు—ఆమె మనసుకు తెలుసు. ఆమెను అన్యాయం చెయ్యాలనే దురాలోచన అతని కే కోశనా లేదు.

అయితే పరిస్థితులే అనుకూలంగా లేవు.

జపాన్ సాంకేతిక సహాయంతో ఎలక్ట్రానిక్ పరికరాల్ని తయారు చేయాలనే ఒప్పందం మీద ఆ దేశంలో ఆర్నెల్లు పర్యటించటానికి బయల్దేరి వెళ్ళాడు.

అయితే అతనొచ్చేసరికి చాలా విచిత్రాలు జరిగాయి. ఆమె చేతికున్న ఉంగరం వాళ్ళింట్లో ఓ తుఫాను సృష్టించింది. ఆమె తమ్ముడు శ్యామలరావు అప్పుడు ఫైనల్ బి. ఎస్సీలో వున్నాడు. సుధని యింట్లో నొక్కించి అడి

గాదు ఆ ఉంగరం గురించి. ఇప్పట్లో యేమీ అడగొద్దన్నదామె.

అయితే శ్యామలరావు అంతటితో సంతృప్తిపడి ఊరుకోలేదు. అక్కడ ప్రవర్తన గురించి ఫ్యాక్టరీలో ఎంక్వయిరీ చేశాడు. ఆమెకు కిశోర్‌తో వున్న సాన్నిహిత్యం గురించి తెలిసిపోయింది. తల్లితో చెప్పాడు. ఆమె నెత్తి నోరు బాదుకుంది. ఉద్యోగం అక్కర్లేదు— మానెయ్యమంది. తను ఉద్యోగం మానేస్తే ముగ్గురు పస్తు పడుకోవాల్సిందేనని సుధకు తెలుసు!

తల్లికి నచ్చచెప్పింది. తానేం తప్పుపని చెయ్యటంలేదని, వాళ్ళు భయపడేటట్టు యేం జరగదని హామీ ఇచ్చింది. అయితే మరో రెండు నెల్ల తర్వాత ఆమెకో నిప్పులాంటి నిజం తెలిసింది.

తను గర్భవతి! ఆమెకు ఆ నిజం తెలిసిన వెంటనే ముందు ఆనందమే కలిగింది. ఎందుకంటే ఆమె కిశోర్ని త్రికరణశుద్ధిగా ప్రేమించింది. అతను కూడా ఆమెను గాఢంగా ప్రేమించాడు. తనకి కల్లో కూడా అన్యాయం చెయ్యడు

అయితే అతను స్వదేశంలో లేనప్పుడే ఈ ప్రమాదం ముంచుకొచ్చింది. వెంటనే ఉత్తరం రాసిందతనికి. భయపడొద్దని, తనీ శుభవార్త విని చాలా ఆనందించానని మరో రెండు నెలల్లో తిరిగొస్తున్నానని, అంతగా అవమానమనిపిస్తే కొన్నాళ్ళు ఉద్యోగానికి సెలవు పెట్టేసి యింట్లోనే వుండమని ఉత్తరం రాశాడు.

అయితే ఆ ఉత్తరం ఆమెకు ఆనందం కలిగించలేదు. నలుగుర్లోను అవమానకరమైన పరిస్థితి ఎదురయ్యింది. ముఖ్యంగా తల్లి తమ్ముడు తనని నీతిలేనిదాన్ని చూసినట్టు,

ఓ అంటరానిదాన్ని చూసినట్టు చూస్తున్నారు. మరో పక్క రోజు రోజుకీ ఎత్తుగా తయారవుతున్న పొట్ట— కన్యగానే తల్లివి కాబోతున్నావు సుమా!—అని హెచ్చరిస్తోంది.

ఎలాగో అన్నిటినీ భరించి కిశోర్ ఆగమనం కోసం వెయ్యి కళ్ళతో ఎదురుచూసింది సుధ.

అతనొస్తున్న రోజున ఆమెకు పండుగే అయింది. ఎప్పుడెప్పుడు తనని గట్టిన పడేస్తాడా అని యెదురు తెన్నులు చూసింది.

కిశోర్ జపాన్ నుంచి తిరిగొచ్చాడు.

సుధ అతను ఆఫీసుకు రాగానే అతన్ని కల్సుకొంది. వెంటనే పెళ్ళి జరగాలన్నది.

కిశోర్ ఆఫీసు వ్యవహారాలన్నీ తను లేని సమయంలో ఆ సర్వస్వం కావటంవల్లను, ఓ పక్క బోనస్, తదితర కోర్కెలు చెల్లించకపోతే సమ్మె చేస్తామని వర్కర్సు బెదిరించటం వల్లను బాగా చికాకుల్లో ఉన్నాడు.

సుధ రాగానే పెళ్ళి విషయం నొక్కించటంతో సహనం కోల్పోయాడు. ఆమెను తూలనాడాడు. సరిగ్గా అప్పుడే శ్యామలరావు అదంతా విని కిశోర్ మీద తిరగబడ్డాడు, అపార్థం చేసుకుని.

దాంతో కిశోర్‌కు కోపంవచ్చి పిచ్చివాడై పోయాడు. బయటకు పొమ్మని అరిచాడు. సుధ మనసు తీవ్రంగా గాయపడింది. తమ్ముడ్ని తీసుకుని వెంటనే అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

ఆ రాత్రే నూతిలో దూకి ఆత్మహత్య చేసుకొన్నది. ఆ విషయం తెలిసిన శ్యామలరావు కోపంతో పెచ్చేగి పోయి కిశోర్ మీద ప్రతీకారం తీర్చుకోవటానికి బయ

గ్గిర వెళ్ళాడు.

ఆ సమయానికి కిశోర్ ఇంకా ఫ్యాక్టరి ఆఫీసులోనే వున్నాడు. ఆవేశంతో కేకలు పెడుతూ ఆతనిమీదికి వచ్చాడు శ్యామలరావు.

కిశోర్ మీదికి వస్తున్న శ్యామలరావును అల్లంత దూరంలోనే నైట్ వాచ్‌మన్, ఓ వర్కరు ఆపేశారు.

ఆ సమయానికి ఫ్యాక్టరీలో తయారవుతున్న సల్ఫ్యూరిక్ ఆసిడ్‌ని పరిశీలిస్తున్నాడు కిశోర్. అతని చేతిలో ఏసిడ్ ట్యూబ్స్ వున్నాయి.

శ్యామలరావు తనని నిరోధించిన యిద్దర్నీ గింజుకుని ఒక్కసారిగా కిశోర్ మీద దూకాడు. ఆ అదురుకు ఏసిడ్ ట్యూబ్స్ పగిలాయి. అంతే! శ్యామలరావు హృదయ విదారకంగా అరిచి రెండు చేతుల్తోను ముఖం మూసుకున్నాడు.

కిశోర్‌తో బాటు అక్కడున్న వారందరు, ఊహించని రీతిలో జరిగిపోయిన ప్రమాదానికి నిశ్చేష్టులై పోయారు.

శ్యామలరావు ఎడమకన్ను పూర్తిగా కాలిపోయి ఆ స్థానంలో నల్లటి గుంట మిగిలింది. కుడికన్ను గుడ్డు బెల్లు కొచ్చేసి తెల్లగా సొనలాంటి పదార్థం స్రవిస్తోంది. పళ్ళు వికృతంగా బయటికొచ్చేశాయి. ముఖమంతా మచ్చలు పడి పోయింది. బొబ్బలు లేచాయి.

హాస్పిటల్‌కు తరలించాలనుకునే లోపల శ్యామల రావు నరకయాతనపడుతూ ప్రాణాలొదిలేశాడు.

ఇది జరిగి దాదాపు రెండు నెలలయింది. దాదాపు అందరు ఆ సంఘటన మరచిపోయారు.

ఇప్పుడు ఇన్‌స్పెక్టరు వచ్చి దాన్ని మళ్ళీ కెలికాడు.

# 16

"అయితే ఏసిడ్ మీరు తాగాలని శ్యామలరావు ముఖం మీద పొయ్యలేదని ప్రమాదవశాత్తు అది నేల వచ్చి మీ మీద పడటం వల్ల చిందిందని మీరంటారు.... అవునా?!" అడిగాడు శ్రీనివాస్.

"అవును ఇన్‌స్పెక్టర్! నా తప్పేం లేదు. నేను ప్రయత్నపూర్వకంగా చేసిందేమీ లేదు. నేను నిర్దోషిని."

"సుధ చావు కూడా మీరు కారకులు కాదంటారా!?"

"నిజంగా నేను కారకుణ్ని కాదు సార్! ఆఫ్‌కోర్స్ ఆమె నావల్లనే గర్భవతయింది. నన్ను ఘోరంగా అపార్థం చేసుకుని, తొందరపడి ప్రాణాలు తీసుకొంది. ఈ రెండు నెల్లుగా నేనెంత కుమిలిపోతున్నానో ఆ భగవంతుడికే ఎరుక!"

"కానీ మీ ఇంజనీరు గోపీ చెప్పిన కథనం ప్రకారం, మీరు సుధని అవమానించి, ఆమె కడుపులోని బిడ్డకు మీరు తండ్రిని కానని తిరస్కరించి ఆమెను తీవ్రపద జాలంతో దూషించి ఆమె ఆత్మహత్యకు కారకులయ్యారని తెలుస్తోంది. ఏమైనా, ఇందులోని నిజానిజాలు నేను దర్యాప్తు చేస్తాను. ఈ లోపల మీరేమైనా చెప్పదల్చుకుంటే నాకు ఫోన్ చేసి చెప్పండి."

శ్రీనివాస్ లేచి కిశోర్‌తో కరచాలనం చేసి, బూట్సు టకటక లాడించుకొంటూ వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిన వెంటనే ఫ్రిజ్ లోంచి చల్లటి మంచి నీళ్ళు తీసుకుని గడగడ తాగాడు కిశోర్. కొద్ది నిమిషాల వరకూ అతను మామూలు మనిషిగా కాలేక

పోయాడు.

మరచిపోతున్న మధుగమైన బాధని మళ్ళీ ఇన్‌స్పెక్టరు కెలికాడు. ఆ జ్ఞాపకాలు తనని చుట్టుముట్టి సుధని తనే చంపేసినట్టు తనని దోషిగా వేలెత్తి చూపుతున్నాయి కళ్ళారా చూసిన శ్యామలరావు మరణం తన గుండెని కలచివేసింది.

అదే రూపంతో మొన్న స్మశానంలో కనిపించిన శ్యామలరావు నిజంగా ప్రేతమేనా? అచ్చం చనిపోయే ముందు శ్యామలరావు ఎలా వున్నాడో అదే రూపం!

గాడ్, తన మనసేదో భ్రాంతికి లోనవుతోంది. తన పెదవులో ఊపిరాడకుండా పీక నొక్కేస్తున్నట్టు, తను కళ్ళు మూసినా తెరిచినా భయంకరమైన స్మశాన సన్నివేశాలు తనని భయభ్రాంతుడ్ని చేస్తున్నాయి.

ఓ పక్క అరుణ్‌ని యేవో క్షుద్రశక్తులు పీడిస్తున్నాయని తను బాధపడుతుంటే తను కూడా వాటి ప్రభావానికి తలొగ్గవలసిన పరిస్థితి ఎదురయ్యింది. దానికి తోడు ఈ అభియోగం ఒకటి! ఇన్‌స్పెక్టరు మాటలే యింకా చెవుల్లో గింగురుమంటున్నాయి.

కిశోర్ అసహనంగా తల విదిలించాడు.

అప్పుడు గుర్తొచ్చిందతనికి — డాక్టరు సుధాకర్ సైకియాట్రిస్టు మేఘనాధ్‌కు అరుణ్‌ని చూపించమన్నాడు. తను గతరాత్రి ఫోన్ చేసే అతను నిన్నో రోజు తపాడని బొంబే వెళ్ళాడని జవాబు చెప్పారు. ఫోన్ చేసే....!?

ఫోన్ లాక్కుని మేఘనాధ్ నంబరు డయల్ చేశాడు. అది డైరెక్టు డయలింగ్ సౌకర్యమున్న ఫోను.

అవతల్నుంచి మేఘనాధ్ లైన్లో కొచ్చాడు.

క్లుప్తంగా అరుణ్ మానసిక పరిస్థితిని వివరించి "మీరోసారి సాయంత్రం మా ఇంటికి రాగలరా?" అడిగాడు కిశోర్.

రఘునాథ్ రెండు క్షణాలు ఏదో ఆలోచించి, "అలాగే వస్తాను. కేస్ ఈజ్ క్వైట్ ఇంట్రస్టింగ్!" అన్నాడు.

"థాంక్యూ సో మచ్!" అంటూ ఫోన్ క్రెడిల్ చేశాడు కిశోర్.

అతనికి తలంతా దిమ్ముగా, బాగా వేసటగా అనిపించింది. వెంటనే చిక్కటి కమ్మటి స్ట్రాంగ్ కాఫీ పడకపోతే తల పగిలిపోయేలా వుంది.

కాలింగ్ బజ్జరు నొక్కి అటెండర్ని పిలిచాడు.

## 17

పోలీస్ జీప్‌ను చూసి బయటికి తొంగి చూశాడు శేఖర్.

ఇన్‌స్పెక్టరు లోనికొస్తున్నాడు.

శేఖర్ గుండె ఝల్లుమన్నది. పోలీసు లెందుకు వస్తున్నట్టు? తన విషయం తెలిసిపోయిందా? తెలిసే అవకాశం లేదే....! ఏమో, పోలీసులు వేటకుక్కల్లాంటి వాళ్ళు. వాసన చూసి పసిగట్టేస్తారు నేరస్థుడ్ని.

లోకనాథం కూడా సమయానికి ఇంట్లోనే వున్నాడు. గోపీకి జరిగిన శాస్తికి అతనికి ఆనందం కలిగింది. కాని ఎంత చెడ్డా అల్లుడు! కూతురుతో కొన్నాళ్ళు కాపురం చేసినవాడు. అందుకే అది తలచుకున్నప్పుడల్లా చివుక్కుమనేది మనసు.

ఇన్‌స్పెక్టరు శ్రీనివాస్ లోనికొచ్చాడు.

శేఖర్ ముందుగదిలోనే వున్నాడు.

"హూ ఈజ్ మిస్టర్ శేఖర్?!" అనడిగాడు శ్రీనివాస్. గంభీరంగా.

శేఖర్ తలపంకించి, "నేనే! ఏం కావాలి మీకు?" అన్నాడు తడబాటు బయటకు ప్రదర్శించకుండా.

"గోపీ మీ బావగారే కదూ!"

"అవును."

"మీ చెల్లెలి భర్తా, అక్క భర్తా?"

"చెల్లెలి భర్త. నా చెల్లెలు పేరు సుజాత." చెప్పాడు శేఖర్. కొత్తవాళ్ళ మాటలు విని లోపల గదుల్లో వున్న లోకనాథం బయటికొచ్చాడు.

ఇన్స్పెక్టర్ని చూసి "ఏమిటు కావాలి సార్?" అనిడిగాడు లోకనాథం. "నేను సుజాత తండ్రిని" అని చెప్పాడు.

"గోపీ ఎలాంటివాడు? అతను మీ అమ్మాయిని హత్య చేశాడని మీకు ముందుగానే తెలుసా?" అడిగాడు శ్రీనివాస్,

"తెలియదండి. తెలిసుంటే పోలీస్ కంప్లెయింట్ ఇచ్చివుండేవాళ్ళం కదా! తర్వాత, అంటే అమ్మాయిని అర్జంటుగా పూడ్చేశాక చూచాయగా అనుమానం వచ్చింది. కాని చుట్టుపక్కలవాళ్ళు కూడా అది ప్రమాదవశాత్తు జరిగిన మరణంగా ధృవపరిచారు. దాంతో అనుమానించలేకపోయాం."

"గోపీకి మరో స్త్రీతో సంబంధముందని మీకు తెలుసా?"

"తెలియదు."

"మీకు తెలుసా శేఖర్?!"

శేఖర్ తల అడ్డంగా తిప్పి, "తెలియదండి. అతను

హత్యా నేరంమీద అరెస్టయిన విషయం తెలిశాక ఇవన్నీ పేపర్లో చదివాం" అన్నాడు.

"కాని గోపీ తన ఉంపుడుకత్తె సుందరిని హత్య చేయలేదు."

"మరి....?!"

"హంతకుడు వేరే వున్నాడు. అతనే హత్య చేసి, గోపీని ట్రాప్ చేసి, ఏం తెలియనట్టు మామకు ఫోన్ చేసి చెప్పాడు."

శేఖర్ తొట్రుపాటును కప్పిపుచ్చుకోవటానికి విశ్వ ప్రయత్నం చేస్తున్నాడు. శ్రీనివాస్ తదేక దీక్షతో అతనివంక గుచ్చి చూస్తున్నాడు.

లోకనాథం అడిగాడు. "మరి గోపీని హత్యానేరం మీద అరెస్టు చేసినట్లు విన్నాం!?"

"మీ అమ్మాయి సుజాతని హత్య చేశాడని నిర్ధారణగా రుజువయ్యింది. పోస్టుమార్టం రిపోర్టులవల్ల అది సాధ్యమయ్యింది. కాని సుందరిని అతను హత్య చేయలేదు. అతని వేలిముద్రలున్నా కత్తిని హంతకుడే కావాలని ఆమె పొట్టలో దిగవేశాడు. కాని, అంతకు చాలా సేపటి క్రితమే ఆమె ప్రాణాలు పోయాయని, అందుకే ఆమె పొట్ట నుంచి రక్తం స్రవించలేదని అతను గ్రహించి వుండడు."

"మరి గోపీని విడుదల చేసేశారా?" శేఖర్ గొంతులో దాచుకోవాలన్నా ఆత్రుత ఆగలేదు.

"లేదు. మీ అమ్మాయిని హత్య చేశానని ఒప్పుకున్నాడు. మాకు ఆధారాలు దొరికాయి. అతని తల్లి కూడా నేరం ఒప్పుకుంది."

"అయితే మీ రిప్పుడెందుకు వచ్చినట్టు?" లోక

నాథం ఆశ్చర్యంగా అడిగాడు.

"సుందరి కాంతకుడ్ని సగౌరవంగా తీసుకువెళ్ళామని!" అన్నాడు శ్రీనివాస్ కూల్‌గా.

"సుందరి కాంతకుడు డిక్కీ దెందుకుంటాడు?" లోకనాథం మరింత ఆశ్చర్యపోతున్నాడు.

సరిగ్గా అప్పుడే సార్జంట్ శివం, రాజా, అక్కడికి వచ్చారు. శివం చేతుల్లో బేడీలున్నాయి.

లోకనాథం నిర్ఘాంతపోయి చూస్తున్నాడు.

శ్రీనివాస్ శేఖర్ వంక తీక్షణంగా చూసి, "మిస్టర్ శేఖర్! సుందరిని హత్య చేసిన నేరానికి నిన్ను అరెస్టు చేస్తున్నాం!" అన్నాడు.

మరుక్షణం శివం శేఖర్ చేతులకు బేడీలు తగిలించాడు. శేఖరం నిశ్చలంగా నిల్చున్నాడు.

లోకనాథం ఇన్‌స్పెక్టరు చేతులు పట్టుకొని, "ఏమిటి ఇన్‌స్పెక్టరుగారూ! నా బిడ్డ హంతకుడా? మీరు పొరబడుతున్నారు" అన్నాడు.

శ్రీనివాస్ జేబులోంచి ఓ పర్సు తీసి లోకనాథంకి చూపించి, "ఈ పర్సు గుర్తుపట్టగలరా?" అన్నాడు.

లోకనాథంకి అది బాగా గుర్తు అయినా నోరు మెదపలేదు. పర్సువంకే చూస్తూ నిల్చున్నాడు.

ఇన్‌స్పెక్టరు పర్సు విప్పి లోపలవైపు అరలో వున్న శేఖరం ఫోటో చూపించి, "ఈ పర్సు శవం పక్కన దొరికింది. అంతేకాదు, మేము సుందరి ఇంటికి వెళ్ళేటప్పటికి గోపీ క్లోరోఫాం మత్తులో పడివున్నాడు. మేము తలుపులు విరగ్గొట్టి లోనికి ప్రవేశించాం. హత్య చేసి, క్లోరోఫాం వాసన చూసి స్పృహతప్పి శవంపక్కన పడుండే మూర్ఖుడెవడూ వుండడు ప్రపంచంలో.

"అందుకే మొదటే గోపీ హంతకుడు కాదని తెలిసిపోయింది మాకు. ఆ వెంటనే ఈ పర్సు మా కళ్ళపడింది. కేసు విడిపోయింది. అయినా గోపీని కస్టడీలోకి తీసుకున్నాం. ఎందుకంటే అతనిమీద వచ్చిన మరో అభియోగం ప్రూవ్ చేసుకోవటానికి సుజాత శవం తవ్వి పోస్టుమార్టం చేశాక గోపీ హంతకుడని కన్ఫర్మ్ చేసుకున్నాం.

"అంతే కాదు; హత్య చేశాక మాకు ఫోన్ చేసిన శేఖర్ గొంతు బాగా గుర్తు పెట్టుకున్నాను. మరో పాయింట్ — శేఖర్ సుజాత అన్న కావటం! అందుకే కక్షతో హంతురాల్ని ముఖం మీద కత్తితో కోసి హింసించి చంపాడు. అయితే ఆ మాత్రానికే ఆమె చనిపోలేదు. ముక్కు చెవులు కోసేశాడు కాబట్టి తను వికృతంగా మారిపోయానని షాక్‌తో చనిపోయిందామె.

"ఈ లోపల గోపీ లోనికొచ్చాడు. అప్పుడు వచ్చివుంటుంది శేఖర్‌కి — అతన్ని హత్యలో ఇరికించాలనే ఆలోచన! వెంటనే కార్యరూపంలో పెట్టాడు" అన్నాడు.

శేఖర్ తల దించుకున్నాడు.

## 18

మెట్లు దిగి బయటకు వెళ్ళబోతూ చటుక్కున ఆగిపోయాడు రవీంద్ర. అతని ఎడమచేతికి సిమెంట్ కట్టుంది. మెడలో జోలెలా వేసుకున్నాడు.

ఎదురుగా పోలీస్ జీప్ ఆగింది.

ఇన్‌స్పెక్టరు, పోలీసులు లోనికొస్తున్నారు.

రవీంద్ర గుండె వేగంగా కొట్టుకొంది. ఏమిటిది? పోలీసులకి నిజం తెలిసిపోయిందా? అయినా తనెవర్ని

హత్య చెయ్యలేదు తనెందుకు భయపడాలి? ...

ఇన్‌స్పెక్టరుతో వచ్చిన ఓ మధ్య వయస్కుడు రవీంద్రని చూపి "అవునండి అతనే!" అన్నాడు.

ఇన్‌స్పెక్టరు రవీంద్రని తీక్షణంగా చూసి, "నిన్న నువ్వు పోలారావింటికి వెళ్ళావు. నువ్వు లోపలికి వెళ్ళటం చాలామంది చూశారు. మరో అరగంట తర్వాత పోలారావు కొడుకు సురేంద్ర లోనికి వెళ్ళటం కూడా చూశారు. మరో పదినిమిషాల తర్వాత నువ్వు బయటికి పారిపోవటం కూడా చూశారు. మీ యిల్లు సోదా చెయ్యాలి. హత్యాస్థలంలో నువ్వుండటం నేరం! పోలారావుని ఆత్మహత్య అని తేలేవరకు నువ్వు హంతకుడిగా అనుమానితుడివే!" అన్నాడు.

"ఇన్‌స్పెక్టర్, నేను హత్య చెయ్యలేదు. అక్కడ నేను ఆ సమయంలో వున్నమాట నిజమే! కాని ఆ రెండు మరణాలతోను నా కెలాంటి సంబంధం లేదు. నేను నిరపరాధిని!" అన్నాడు రవీంద్ర. అతని గొంతులో ధ్వనించిన నిజాయితీని సిన్సియార్టీని గుర్తించాడు శ్రీనివాస్.

జరిగిందంతా వివరంగా చెప్పాడు రవీంద్ర. శ్రీనివాస్ శ్రద్ధగా విన్నాడు. అతని విరిగిన చేతిని, బాండేజిని చూశాడు. తల పంకించాడు.

"అసలు మీ అన్న జనార్ధనాన్ని పోలారావు హత్య చేశాడని నీకెలా తెలిసింది? ఆధార మేమిటి?" అడిగాడు శ్రీనివాస్.

రవీంద్ర వెంటనే మాట్లాడలేదు. ఆ తర్వాత నోరు విప్పి "మీ రెక్కడా అతని పేరు బయట పెట్టనంటే చెపుతాను" అన్నాడు.

"కేసులో యెవరి ప్రాముఖ్యత యెలాంటిదో తెలిసేనే కదా, పేరు బయట పెట్టేది, లేనిది తెలిసేది!" అన్నాడు శ్రీనివాస్.

రవీంద్ర కొద్ది క్షణాల తర్వాత, "మసేనయ్య చెప్పాడు" అన్నాడు.

"మసేనయ్యా?! అతను ఎవరు....?" అడిగాడు శ్రీనివాస్.

"ప్రేతాత్మలతో మాట్లాడే క్షుద్రదేవతా ఉపాసకుడు."

"ఉపాసకుడా? అతనికెలా తెలుస్తుంది?"

"చనిపోయిన వ్యక్తి శవం పూడ్చిపెట్టి వుంటేనే అతని విద్య ఫలిస్తుంది. శవాన్ని కాలిస్తే చెప్పలేడు. ....పాతిపెట్టిన శవం సమాధి దగ్గర అతను తన విద్యను ప్రయోగిస్తాడు. మనిషి చనిపోయిన ఓ సంవత్సరం వరకు ఆ మనిషి ప్రేతాత్మ ఆ సమాధి చుట్టుపక్కలే సంచరిస్తుందని, సంవత్సరం దాటిపోతే మళ్ళీ జన్మ యెత్తుతుందనీ మసేనయ్య విశ్వాసం.

"ఎవరో మసేనయ్య గురించి చెపితే, అన్నయ్య మరణం గురించి తెలుసుకోవాలనని మసేనయ్యను కల్సుకున్నాను. అతను నన్ను వివరాలన్నీ అడిగి మర్నాడు అర్ధరాత్రి దాటాక స్మశానానికి రమ్మన్నాడు. నేను అతను చెప్పినట్టే ఆ సమయానికి వెళ్ళాను.

"మసేనయ్య ముందు ఓ వ్యక్తి కూచుని వున్నాడు. చనువుగానే కుర్రాడిలా వున్నాడు. అన్నయ్య సమాధి తవ్వబడి వుంది. అప్పటికే ఆర్నెల్లయిపోయింది. అస్థిపంజరం తప్ప ఆకారం మిగల్లేదు. ఆ అస్థిపంజరంతోనే తన విద్యను ప్రయోగిస్తున్నాడు మసేనయ్య.

"ఆ పత్రాతని ఆవహించింది ఆ ప్రేతాత్మ తనని మా చిన్నాన్న సముద్రంలో ముంచి చంపేసినట్టు స్పష్టంగా చెప్పాడు. నేను స్పష్టంగా నా చెవులతో స్వయంగా విన్నాను. గొంతు కూడా అన్నయ్యదే! ఆ తర్వాత ఆ పత్రాడు నిద్రలో నడుస్తున్నవాడిలా వెళ్ళిపోయాడు.

"తర్వాత మసేనయ్య గొయ్యి పూడ్చేశాడు, అవి పంజరం పెట్టి. నేను అతని కివ్వాల్సిన సొమ్మిచ్చి ఇంటి కొచ్చేశాను" చెప్పాడు రవీంద్ర.

శ్రీనివాస్ ఆశ్చర్యంగా విన్నాడు. ఈ ఆధునిక కాలంలో కూడా ప్రేతాత్మలు ఆవహించటం, ఇదంతా నమ్మశక్యమైనదేనా? సరిగ్గా అప్పుడే అతనికి మరో విషయం గుర్తొచ్చింది. శేఖర్‌కి తన చెల్లెలు చంపబడిందని ఎలా తెలిసింది? అతను కూడా మసేనయ్యను అందుకు నియోగించాడా. చూడాలి. ఈ మసేనయ్య విషయం ఏదో వింతగానే ఉన్నట్టుంది!

"ఎవరా మసేనయ్య? ఎక్కడుంటాడు?" అడిగాడు రవీంద్రని శ్రీనివాస్. రవీంద్ర వివరాలు చెప్పాడు.

శ్రీనివాస్ అతనివంక తీక్షణంగా చూసి, "ఏది, ఏమైనా పోలారావుతో నువ్వు పెనుగులాడుతుండగానే గుండు అతని తలలోకి పేల్చబడింది అది నువ్వే చేశావో అతనే ప్రమాదవశాత్తు కాల్చుకున్నాడో వివరాలు తెలియాల్సి వుంది. అంతదాకా మా కస్టడీలో వుండక తప్పదు!" అన్నాడు.

సార్జంట్ రాజు బేడీలు పట్టుకుని నుంచున్నాడు. శ్రీనివాస్ వంక ప్రశ్నార్థకంగా చూశాడు.

"అతని మరో చెయ్యి గాయపడింది, బేడీలు వెయ్య

నక్కర్లేదు. అతన్ని అరెస్టు చేసినట్టే! తీసుకుపద" అన్నాడు శ్రీనివాస్.

రవీంద్ర మౌనంగా పోలీసుల వెంట నడిచి జీప్ ఎక్కాడు. తను నిర్దోషి! తనకు శిక్ష పడినా పడక పోయినా, తన కుటుంబాన్ని నాశనం చేసిన పోలా రావు తన పాపానికి శిక్ష ననుభవించాడు. తనని నిర్దోషిగా విడుదల చెయ్యటానికి కవసరమైన సమాచారం కేసెట్ రూపంలో తన దగ్గరుంది. పోలారావుతో వాదోప వాదాలు చేసేటప్పుడు తన దుస్తుల్లో దాచుకున్న మినీ టేప్ రికార్డర్లో అతను స్వయంగా చెప్పిన రహస్యాలన్నీ రికార్డయిపోయాయి. తన తండ్రిని చంపినట్టు కూడా పోలా రావు ఒప్పుకున్నాడు.

ఆ కాసెట్ భద్రంగా ఇంట్లో దాచాడు. తనమీద కేసు కోర్టుకి రాక తప్పదు అప్పుడు తన తరఫు లాయరుకి అది అందిస్తే సరిపోతుంది. తనిప్పుడు లక్షాధికారి! ఎంత ఖర్చయినా ఫరవాలేదు. నిర్దోషిగా నిరూపింపబడతాడు! తృప్తిగా లోలోన నవ్వుకున్నాడు రవీంద్ర.

## 19

"రండి, రండి!" సాదరంగా ఆహ్వానించాడు కిశోర్ సైకియాట్రిస్టు మేఘనాథ్ ని.

మేఘనాథ్ లోనికడుగు పెట్టాడు. దాదాపు ఆరడుగుల విగ్రహంతో ఎప్పుడూ చెదరని చిరునవ్వుతో, నలగని మల్లెపువ్వులాంటి తెల్లటి దుస్తుల్లో చక్కటి వర్ఛస్సుతో చూపరులను ఇట్టే ఆకర్షిస్తాడు మేఘనాద్.

"ఇతనే మా తమ్ముడు అరుణ్!" అంటూ పరిచయం చేశాడు కిశోర్.

మేఘనాథ్ అరుణ్ ని పరీక్షగా చూశాడు.

పైకి యేలాంటి అవలక్షణాలు వున్నట్టు కనిపించటం లేదు. చాలా మామూలుగా, నార్మల్ గా వున్నాడు.

"మీరేం చేస్తున్నారు?" అడిగాడు మేఘనాథ్.

చెప్పాడు అరుణ్.

"రాత్రిళ్ళు బాగా నిద్రపోతున్నారా?"

"ఒళ్ళేరగకుండా" అన్నాడు అరుణ్ నవ్వి.

"ఓసారి మీ గదికి వెళ్దామా?" అన్నాడు మేఘనాథ్.

"విత్ ప్లజర్!" అని లేచాడు అరుణ్.

ప్రసాదరావు ఇంకా ఫ్యాక్టరీ నుంచి రాలేదు. మేఘనాథ్ కోసమని ముందుగా బయల్దేరి వచ్చేశాడు కిశోర్.

అందరు అరుణ్ గదిలోకి వెళ్ళారు.

మేఘనాథ్ తన ఎక్స్‌రే కళ్ళతో గదంతా చాలా క్షుణ్ణంగా పరిశీలిస్తున్నాడు.

కిశోర్ తో చెప్పాడు మేఘనాథ్. "మీతో విడిగా కాసేపు మాట్లాడాలి!" అని.

"రండి. నా గదికి వెళ్దాం!" అన్నాడు కిశోర్.

"మళ్ళీ మీ దగ్గర కొస్తాను. మాట్లాడుదాం" అన్నాడు మేఘనాథ్ అరుణ్ తో.

అరుణ్ నవ్వుతూ తలూపాడు.

కిశోర్ గదిలో యిద్దరు కూర్చున్నాక కేసు పూర్వాపరాలన్నీ వివరంగా కనుక్కొన్నాడు మేఘనాథ్.

అతని ముఖం గంభీరముద్ర దాల్చింది. "పదండి, అరుణ్ తో మాట్లాడుదాం" అన్నాడు మేఘనాథ్.

ఇద్దరు అరుణ్ గదిలోకి వెళ్ళారు. మేఘనాథ్ అరుణ్ ని చూసి నవ్వి, "మిమ్మల్ని కొద్ది క్షణాలు హిప్నటైజ్ చేస్తాను. మీ కిష్టమేనా?" అనడిగాడు.

అరుణ్ నవ్వుతూ తలూపి "నేను హిప్నటిజం నేర్చుకోవాలని చాన్నాళ్ళుగా అనుకొంటున్నాను. అన్నయ్య వద్దని వారించాడు. ఆ కోరిక నేటిదాకా తీరలేదు" అన్నాడు.

మేఘనాథ్ కిశోర్ వంక ఆశ్చర్యంగా చూసి, "హిప్నటిజం పట్ల మీకు సదభిప్రాయం లేదా? ఎందుకు వద్దన్నారు?" అనడిగాడు.

కిశోర్ వెంటనే "దురభిప్రాయం మాత్రం లేదండీ! ఛార్టర్డు ఎకౌంటెంట్ కావలసినవాడు చదువు గురించి ఏకాగ్రత చెడగొట్టుకుని డైవర్ట్ అయిపోతాడని భయం. అంతే!" అన్నాడు.

మేఘనాథ్ నవ్వి, అరుణ్‌ని ట్రాన్స్‌లోకి తీసుకు వెళ్ళాడు. అతి స్వల్ప వ్యవధిలోనే అతడు డీప్ హిప్నసిస్‌లోకి వెళ్ళిపోవటం గమనించి ఆశ్చర్యపోయాడు. "హి ఈజ్ టూ సెన్సిటివ్!" అనుకున్నాడు మనసులో.

తర్వాత అతన్ని కొన్ని ప్రశ్నలు వేశాడు మేఘనాథ్. డీప్ హిప్నసిస్‌లో వుండగా అతను తన పేరు కూడా సరిగా చెప్పలేకపోయాడు. కాసేపు జనార్దనం అని, కాసేపు సుజాత అని మరోసారి మరొకటి చెప్పాడు.

"నువ్వు ప్రతిరోజూ అర్ధరాత్రి స్మశానానికి యెందుకు వెళుతున్నావు?" అనడిగాడు మేఘనాథ్.

"రాత్రి పన్నెండున్నరయ్యేసరికి నా చెవుల్లో యేదో హోరు వినిపిస్తుంది. ఎవరో నా చెవిలో మెల్లిగా లే.... లేచి తిన్నగా నడువు... స్మశానానికి సరాసరి వెళ్ళు.... వెళ్ళు వెళ్ళు....అంటూ చెపుతారు. నేను వెంటనే నిద్రలోనే నడుస్తూ స్మశానానికి వెళ్తాను. ఆ తర్వాత నా మీద యెవరో బరువు మోపినట్లు భ్రాంతి కలుగుతుంది.

తర్వాత యేం జరుగుతుందో, నేనేమి సమాధానం చెప్తానో నాకు తెలియదు.

"ఆ తర్వాత యెవరో వెళ్ళిపో.... ఇంటికి వెళ్ళిపో.... అంటున్నట్టు వినిపిస్తుంది.... లేచి వచ్చేస్తుంటే స్పృహ తప్పిపోతుంది. నేను మెలకువ వచ్చి చూసేసరికి నా గదిలో వుంటాను. అంతకుమించి యేం జరుగుతున్నదీ నాకు తెలియదు" చెప్పాడు అరుణ్.

"నిన్ను ప్రశ్నలడిగే వ్యక్తి ఎవరు?"

"తెలియదు?"

"ఏమడుగుతాడు?"

"గుర్తులేదు. వెంటనే మరచిపోతాను."

"ఇప్పటికి యెన్నిసార్లు స్మశానానికి వెళ్ళావు?"

"మూడుసార్లు"

"స్మశానంలో నీకు భయం వెయ్యదా?"

"ఊహు! ఇంకా యెంతో ధైర్యంగా వుంటుంది. ఎవరో అనుక్షణం నన్ను కనిపెట్టుకుని రక్షిస్తున్నట్టు నిశ్చింతగా వుంటుంది."

మేఘనాథ్ ప్రశ్నలడుగుతూనే ఆలోచిస్తున్నాడు.

ఇలిని మెదడుని తమ కంట్రోల్లో ఉంచుకొని ఆజ్ఞలు జారీచేస్తూ అతన్ని తన దగ్గరకు రప్పించుకుంటున్నారెవరో. అక్కడ అతన్ని హిప్నటైజ్ చేసి అతనిచేత ప్రశ్నలకు సమాధానాలు రప్పిస్తున్నారు.

ఆ ప్రశ్నలు ఎలాంటివి? వాటివల్ల ఎవరికి లాభం? మేఘనాథ్ తీవ్రంగా ఆలోచిస్తూన్నాడు. ఇంకా అరుణ్‌ని హిప్నటైజ్ చేయటంవల్ల లాభమేమీ వుండదని అతనికి తెలుసు. అరుణ్‌ని పోస్టుహిప్నసిస్‌కి తీసుకొచ్చి, కిశోర్‌తో అతని గదికి వెళ్ళాడు మేఘనాథ్.

"చివరిసారిగా జరిగిన సంఘటన మరోసారి చెప్పండి" అన్నాడు కిశోర్‌తో.

కిశోర్‌తో క్రితం రాత్రి జరిగిన సంఘటన గురించి, తను స్వయంగా స్మశానంలో ఆ ఉపాసకుడ్ని చూసినట్టు అతన్ని పట్టుకోవాలని పరుగెత్తినట్టు అతను పారిపోయినట్టు, తను అరుణ్‌ని ఎత్తుకొని వెళుతుండగా తనకి స్పృహ తప్పినట్టు మెలకువ వచ్చి చూసేసరికి తను తన గదిలో తన బెడ్ మీదున్నట్టు, అరుణ్ తన గదిలోంచి ఎక్కడికి వెళ్ళలేదని ప్రసాదరావు చెప్పినట్టు—అన్నీ వివరించాడు.

"అయితే అరుణ్ గదిలోనుంచి వెళ్ళినదీ లేనిదీ మీ అమ్మగారుగాని, చెల్లాయిగాని చూడలేదు, అవునా?"

"అవును. మా చిన్నాన్నకూడా నేను గదిలో లేనని తలుపులు బార్లా తెరిచివున్నాయని అనుమానం వచ్చి నాకోసం బయల్దేరానని చెప్పాడు."

"మరి మీ అమ్మగార్నిగాని, చెల్లాయినిగాని లేపి జరిగిందేమిటో వాళ్ళతో చెప్పలేదా?"

"లేదు. నేను లేకపోగానే ఆయనకు మరేం తోచలేదు. నేనుకూడా అరుణ్ లాగా నిద్రలో నడుస్తూ వెళ్ళిపోయానేమోనని భయపడి వెతుక్కుంటూ కార్లో బయల్దేరాడు. కార్లో రోడ్డుకి అడ్డంగా నేను పడివుంటే తీసుకొచ్చి బెడ్ మీద పడుకోబెట్టి అప్పుడు అమ్మనీ చెల్లాయినీ లేపి చెప్పాడు.

"అరుణ్ నిద్రలో నడిచి వెళ్ళిపోతుంటాడని తెలుసు కదా! అతను గదిలో ఒంటరిగా వుంటే అలాగే వదిలేసి, ఆడవాళ్ళకి మాటమాత్రంగానైనా చెప్పకుండా మీకోసం వెతుకుతూ వెళ్ళిపోయారన్నమాట!"

"అవును. నేను రోడ్డుమధ్య కనిపించటం అరుణ్

ఇంట్లో నే నిద్రపోతూ వుండటం నాకు చాలా ఆశ్చర్యం కలిగించాయి."

మేఘనాథ్ మెదడులో ఫ్లాష్ వెలిగింది.

"పదండి అరుణ్ గదికి వెళ్దాం" అంటూ చకచక అరుణ్ గదిలోకి నడిచాడు.

అరుణ్ మంచం దగ్గిర ఆగాడు మేఘనాథ్. అది సన్ మైకా తాపడం చేసిన రోజ్ వుడ్ కాట్. డన్ లప్ పరుపుమీద వంకాయపూవులాంటి దుప్పటి పరచి వుంది.

మంచం గోడకి దగ్గరగా వేసి వున్నది. రెండుపక్కల గోడల్ని తాకుతూ ఆరేంజి చేయబడి వుంది.

మేఘనాథ్ అరుణ్ మంచం తలవైపు పరుపు పైకెత్తాడు. అతని కళ్ళు మెరిశాయి.

డెకోలామ్‌కి అతికించబడి వున్న అయస్కాంతాన్ని పైకితీశాడు. రెండంగుళాల వ్యాసంతో వున్న గుండ్రటి బిళ్ళ కనిపించిందక్కడ.

మైక్రోస్పీకర్ అతిసూక్ష్మంగా అమర్చబడి వున్నది. సరిగ్గా అరుణ్ తలకి అతిసమీపంగా.

మేఘనాథ్ దాన్నించి కనెక్షన్ ఇవ్వబడ్డ అతి సన్నని దారంలాంటి వైర్‌ని కనుగొన్నాడు. అది మంచం నలువుపట్టె దిగువభాగంనించి టేప్‌తో మధ్య మధ్య అతికించబడి కాళ్ళవరకు సాగివున్నది.

మేఘనాథ్ కాళ్ళవైపువున్న డెకోలాం దిగువనున్న పట్టె దగ్గర చేతో తడిమాడు. వైరు అక్కడినించి కొన సాగి, పక్కగోడలోకి సన్నటి ఇనపగొట్టంద్వారా చొచ్చుకుపోయి వుండటం గమనించాడు.

"ఈ పక్క గది ఎవరిది?.... ఐమీన్, అందులో ఎవ రుంటారు?" అనడిగాడు మేఘనాథ్.

అంతదాకా అతని చర్యలను నోరు తెరచుకొని ఆశ్చర్యంగా చూస్తున్న కిశోర్ అరుణ్ తేరుకొని, "మా చిన్నాన్నగారు టున్నారందులో!" అన్నాడు.

"ఆయనున్నారా?"

"ఇంకా ఫ్యాక్టరీనుంచి రాలేదు" అన్నాడు కిశోర్.

"ఆ గది తాళాలు మీ దగ్గరున్నాయా?"

"లేవు. చిన్నాన్న దగ్గరే వున్నాయి. కారు తాళం చెవులతో బాటు బంచ్‌లో వుంటాయి. అవి యెప్పుడూ ఆయనతోనే వుంటాయి."

"ఆయనిప్పుడొస్తారా?"

"ఈపాటికి రావలసిందే! ఎందుకో రాలేదు!"

"ఆయనొచ్చేలోపల మనం ఆ గదినోసారి పరీక్షించాలి."

కిశోర్ అరుణ్ ఆశ్చర్యంగా చూశాడు. "అంటే మీరు ..."

"అవన్నీ తర్వాత వివరంగా చెప్తాను. వెనకవైపు నుంచి కిటికీలున్నాయి కదా! అద్దాలు పగలగొట్టి లోపలికి వెళ్దాం. అభ్యంతరమా?"

కిశోర్ యేదో చెప్పబోయాడు మేఘనాథ్ వారించి "నామీద నమ్మకముంటే మీరు నా చర్యలకి అడ్డు చెప్పకండి. ప్లీజ్!" అన్నాడు.

"ఆల్ రైట్! మీరేం చేసినా అభ్యంతరపెట్టను" అన్నాడు కిశోర్.

మేఘనాథ్ ఆవరణలోనించి వెనకవైపుకు వచ్చి కిటికీ అద్దాలు పగలగొట్టాడు. ఊచలు లేని కిటికీ అది!

కిటికీనించి లోపలికి దిగాడు.

అరుణ్ మంచం కాళ్ళవైపునుంచి సరాసరి ఆ గది

లో! ఇనపగొట్టం ద్వారా సన్నటి వైరు వచ్చివుండాలి! సరిగ్గా మంచం కాళ్ళవైపు ఆనుకున్న సరిహద్దు గోడ దగ్గర అల్మయిరా వుంది.

దాన్నిండా పుస్తకాలు నిలువుగా పేర్చబడి వున్నాయి. మేఘనాథ్ పుస్తకాల్ని తొలగించాడు.

అతని కళ్ళు మెరిశాయి.

అక్కడ మైక్ వున్నది! దాని చివరనున్న వైరు సరాసరి యినపగొట్టానికి కనెక్టు చేయబడి వుంది. ఆ ఇనపగొట్టం అరుణ్ గదిలోనుంచి ఈ గదిలోకి గోడకి రంధ్రం చేసి అమర్చారు.

కిటికీలోనుంచి అరుణ్, కిశోర్ కూడా దిగారు. వాళ్ళకి మైక్, దాని వైరు చూపించాడు మేఘనాథ్! వాళ్ళిద్దరు నిర్ఘాంతపోయి చూశారు.

“అంటే చిన్నాన్న...!?” తర్వాతి మాటలు పలకటానికి ఇద్దరికీ భయంగా వుంది.

మేఘనాథ్ చిన్నగా నవ్వి, “రాత్రిళ్ళు మీ చిన్నాన్న అరుణ్ కి నిద్రలోనే సంకేతాలు పంపిస్తూన్నాడు, యీ మైక్ ద్వారా ... ఈ వైరు చివరున్న స్పీకర్ ద్వారా అతని ఆజ్ఞలు సరాసరి అరుణ్ మెదడులో వైబ్రేషన్స్ సృష్టిస్తున్నాయి. వాటి ఫలితంగా అరుణ్ నిద్రలో లేచి నడుస్తూ సరాసరి స్మశానం చేరుతున్నాడు. స్మశానం ఎందుకు చేరుతున్నాడు, అతన్ని మీ చిన్నాన్న స్మశానానికెందుకు పంపిస్తూన్నాడు — అన్న విషయం తెలుసుకోవాలి....” అని అతను చెప్తుండగానే తాళం తెరుస్తూన్న చప్పుడు వినిపించింది గుమ్మం దగ్గర్నుంచి.

చెవులప్పగించి విన్నారు ముగ్గురు.

బయట ప్రసాదరావు తాళం తీస్తున్నాడు.

# 20

పోలీసుల్ని చూసి కొద్దిగా వెనక్కి తగ్గాడు మసేనయ్య.

"నువ్వేనా మసేనయ్య?" అన్నాడు శ్రీనివాస్.

మసేనయ్య దాదాపు ఆరడుగుల పొడవున్నాడు. ముఖానికి సింధూరం బొట్టు వున్నది. ఒంటికి చితాభస్మం పూసుకున్నాడు. కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా తాగినవాడి కళ్ళలా వున్నాయి. కొత్తగా చూసేవాళ్ళకి మొదటి సారి భయం పుట్టక మానదు.

"నేనే! ఎందుకు?" అన్నాడు తిరస్కారంగా మసేనయ్య.

"నీనుంచి కొన్ని వివరాలు కావాలి!"

"నేను ఎవరి నించైనా వివరాలు అడిగి తెల్సుకుంటూ టానేగాని యెవరికీ వివరాలు చెప్పను. చెప్పాల్సిన అవసరం లేదు."

"ఓహో, అలాగా! నీ గురించి ఇద్దరు కుర్రాళ్ళు మాకు రిపోర్టిచ్చారు. శేఖర్, రవీంద్ర వాళ్ళ పేర్లు. అర్ధరాత్రిపూట సమాధులు తవ్వి శవాల్ని పైకితీసి క్షుద్ర విద్యలు ప్రయోగిస్తున్నావని రూఢిగా తెలిసింది. అది పెద్ద నేరం. అందుకు శిక్షేమిటో తెలుసా....?" శ్రీనివాస్ గొంతులోని కాఠిన్యానికి మసేనయ్య కొద్దిగా జంకాడు.

"అడగండి మీకేం కావాలో, చెప్తాను" అన్నాడు.

"రెండురోజుల క్రితం రవీంద్ర అనే కుర్రాడికి వాళ్ళన్నయ్యని చిన్నాన్నే హత్యచేశాడని ప్రేతాత్మని ఆవాహనచేసి చెప్పించావు. అలాగే శేఖర్ అనే కుర్రాడి చెల్లాయిని ఆమె భర్త, అత్త కిరోసిన్‌తో కాల్చి చంపేశారని చెప్పించావు అవునా?"

"అవును. నా విద్యనింతవరకు ఎవరూ తప్పుపట్టలేదు. ప్రేతాత్మ అబద్ధం చెప్పదు...."

"అలాగే అనుకుందాం. అయితే ఆ ఆత్మని రప్పించటానికి ఎవరో యీ విద్యని ఉపయోగించుకుంటున్నారని తెలిసింది. ఎవరతను?"

"నా వ్యాపార రహస్యాలు బయట పెట్టను."

"ఊ, అలాగా! మరిప్పుడా కుర్రాడు చచ్చిపోయాడు. అందుకు కారకుడివి నువ్వే!"

"అఁ! చచ్చిపోయాడా? కేవలం పిచ్చివాడిగా మారుస్తే చాలని చెప్పాడే ఆ పెద్దాయన?"

"ఎవరా పెద్దాయన?"

"ఆయన పేరు నాకు తెలియదు. ఊరవతల పెద్ద ఫ్యాక్టరీ ఉందిగదా! ఏసిడ్ ఫ్యాక్టరీ. దాని యజమాని."

"కృష్ణారావా?"

"కాదు, వాళ్ళ చిన్నాయన."

శ్రీనివాస్ అలర్టుగా అయ్యాడు. తీగలాగితే డొంకంతా కదుల్తోంది ఇదీ మంచిదే!

"మునేనయ్యా, నీమీదికే గొడవరాకుండా చూస్తాను. అసలు జరిగిందేమిటో చెప్పు!" అన్నాడు శ్రీనివాస్.

మునేనయ్య చెప్పుకొచ్చాడు.

ప్రసాదరావు అరుణ్‌ని పిచ్చివాడిగా మార్చేయమని మునేనయ్యతో ఒప్పందం చేసుకున్నాడు. అవసరమైతే క్షుద్రశక్తిని ప్రయోగించమనికూడా చెప్పాడు. క్షుద్రశక్తిని ఆవాహన చెయ్యటానికి బలహీన మనస్కులు, బాగా సెన్సిటివ్‌గా వున్నవాళ్ళు కావాలి! ప్రసాదరావు అతిసున్నిత మనస్కుడయిన అరుణ్‌ని మునేనయ్యకు అప్పగిస్తానన్నాడు.

మసేనయ్య సంతోషించాడు. అందువల్ల అతనికి లాభ మొంది. చనిపోయిన వాళ్ళ గురించి వాళ్ళ బంధువులు రహస్యాలు అడుగుతుంటారు. అవి చెప్పటానికి ప్రేతాత్మలని ఓ మనిషి ద్వారా ఆవాహన చెయ్యాలి. ఆ మనిషి అరుణ్ కావటంవల్ల మసేనయ్య స్వార్థమే కాకుండా ప్రసాదరావు కోరిక తీరుతుంది.

అరుణ్ని స్మశానంవరకు పంపటం తను బాధ్యత తీసుకుంటానని చెప్పాడు ప్రసాదరావు. స్మశానంలోని తంతు మసేనయ్య చూసుకుంటాడు. ప్రేతాత్మలని ఆహ్వానించటానికి అరుణ్ని ఉపయోగించుకుని చివర్లో అతని మీద క్షుద్రశక్తుల్ని ప్రయోగిస్తానని మసేనయ్య చెప్పాడు.

ఇప్పటిదాకా అతన్ని తన పనులకి ఉపయోగించుకున్నాడు మసేనయ్య. ఒకటి రెండు రోజుల్లో అరుణ్ మీద శక్తుల్ని ప్రయోగించి ప్రసాదరావు అప్పగించిన పని పూర్తిచెయ్యాలనుకుంటున్నాడు మసేనయ్య.

"నీ వృత్తి యేదో నువ్వు చేసుకోక, ఇలాంటి అమాయకులైన యువకుల్ని యెందుకు బలిచేయబోయావు?" అడిగాడు శ్రీనివాస్ అంతా విని.

"తప్పయిపోయింది బాబూ! నా వృత్తిలో వచ్చే డబ్బు నాకు చాలు. ఇలా మనుష్యుల్ని చంపే పనులు ఒప్పుకోవటం పొరపాటే! అయినా నేను ఆ కుర్రవాడ్ని చంపటానికి ఒప్పుకోలేదు. పిచ్చివాడిగా మారుస్తే చాలంటే, డబ్బు కక్కుర్తితో సరేనన్నాను" అన్నాడు మసేనయ్య పశ్చాత్తాప పడుతూ.

శ్రీనివాస్ వేగంగా ఆలోచిస్తూన్నాడు. మసేనయ్య చేస్తున్న పని చట్టవిరుద్ధమయినదీ, అతి నీచమైనదీను— అయినా అతని పొట్టకోసం ఆ వృత్తి స్వీకరించాడు—

అతనివల్ల కొందరు హంతకులు దొరికినా, వానివల్ల ఎవరికీ ఉపయోగం! మసేనయ్యని అదుపులోకి తీసుకోకతప్పదు!

"ఆ పెద్దమనిషిని మాకు చూపించు—అసలు నిన్ను వదిలేస్తాం" అన్నాడు శ్రీనివాస్.

మసేనయ్య "పదండి, చూపిస్తాను" అన్నాడు.

శ్రీనివాస్ మసేనయ్యను జీప్ ఎక్కించాడు.

జీప్ కిశోర్ ఇంటివైపు దూసుకుపోయింది.

## 21

"ఏం చేస్తున్నారు గదిలో?" అడిగాడు ప్రసాదరావు వాళ్ళ ముగ్గుర్నీ గదిలో చూసి నిర్ఘాంతపోయి.

"రా చిన్నాన్నా! నీ కోసమే ఎదురుచూస్తున్నాం" అన్నాడు కిశోర్ వ్యంగ్యంగా.

"నా అనుమతి లేకుండా నా గదిలోకి ఎవరు అడుగు పెట్టమన్నారు మిమ్మల్ని? ఈయనెవరు?" అన్నాడు మేఘనాథ్ వంక గుర్రుగా చూసి ప్రసాదరావు.

"అదంతా తీరిగ్గా మాట్లాడుకుందాం. ఈ మైక్రోఫోన్లు, స్పీకర్లు—ఏమిటీ తతంగం? చిన్నాన్నా నీ గుట్టురట్టయింది. నీ నేరం ఒప్పుకో!" అన్నాడు కిశోర్ తీవ్రంగా అతనివంక చూస్తూ.

ప్రసాదరావు చేతిలో రివాల్వరు ప్రత్యక్షమయ్యింది. "ఎవరూ కదలొద్దు. ఇటువచ్చి గోడవారగా నిల్చోండి. కిటికీవైపు అడుగులు వెయ్యొద్దు మిష్టర్ ...బుద్ధిగా ఇటు నించోండి" హుంకరించాడు ప్రసాదరావు తలుపువైపు జరుగుతూ, బోల్టు పెట్టాలని అతని ప్రయత్నం.

అయితే అప్పుడే తలుపులు భళ్ళున తెరుచుకున్నాయి. ఇన్స్పెక్టరు శ్రీనివాస్, మసేనయ్యతో పాటు ఎదురుగా ప్రత్యక్షమయ్యాడు.

ప్రసాదరావు చేష్టలుడిగి అలాగే నిల్చుండిపోయాడు.

అరుణ్ మెరుపువేగంతో ప్రసాదరావుమీద కురికి రివాల్వరు లాక్కొని కాల్చెయ్యబోయాడు. కాని వెనక నుంచి కిశోర్ అతన్ని సందిట బిగించి ఆపేశాడు.

లేకుంటే ప్రసాదరావు ప్రాణాలు యెగిరి పోయుండేవి.... కోపం తీరక ప్రసాదరావు రెండు చెంపలు ఛెళ్ళున వాయించేశాడు అరుణ్.

శ్రీనివాస్ సార్జంట్ వంక తలతిప్పి "అరెస్టు హిమ్!" అన్నాడు.

ప్రసాదరావు కోపంగా శ్రీనివాస్ని చూసి, "ఎందుకు? షో మి వారంట్!" అని అరిచాడు.

"వారంట్ అవసరం లేదు. మీరు వాళ్ళ ముగ్గుర్ని కాల్చబోతుండగా అరెస్టు చేస్తున్నాం. మీ సంగతులన్నీ మీ వాళ్ళే చెపుతారు. ఇదిగో, ఈ మనేనయ్యాను మించిన సాక్షి అక్కర్లేదు" అన్నాడు శ్రీనివాస్ నవ్వుతూ.

ప్రసాదరావు ముఖం నెత్తురుచుక్క లేకుండా పాలి పోయింది. రెండు చేతులు ముందుకు చాచాడు. సార్జంట్ శివం అతని చేతులకి బేడీలు బిగించాడు.

ప్రసాదరావు తన స్టేట్ మెంట్లో యిలా చెప్పాడు: "నేను నా అన్న ఆస్తిని కాజేయటానికి ప్లాన్ వేశాను. అన్న వారసు లిద్దర్నీ చట్టానికి దొరక్కుండా హత్య చెయ్యాలని పథకం వేశాను. అందుకు మనేనయ్యాను ఎన్నుకున్నాను. కాని కిశోర్ మెదడు నా హిప్నటిజమ్కి లొంగదని తెల్సుకుని ముందుగా అరుణ్ మీద ప్రయో గించాను. అతని మెదడుని నా స్వరతరంగాల కనుగుణంగా మలచుకున్నాను. ప్రతి రాత్రి పన్నెండున్నరకి అతని మెదడులో వైబ్రేషన్స్ సృష్టిస్తూ అతన్ని ఆటంకం

లేకుండా స్మశానానికి వెళ్ళటానికి వీలుగా గది తలుపులు, గేట్లు వేసి తెరచిపెట్టేవాడ్ని.

అయితే, కిశోర్ అరుణ్ నడుస్తూ వెళ్ళటం స్మశానం పరిసరాలకు సరాసరిపోవటం గమనించి ఫాలో అయ్యాడు. మొందటిసారి ఊరుకున్నాను. రెండోసారి కూడా అలాగే కావటంతో నాకు మహా చక్కటి ఆలోచన వచ్చింది.

గతంలో కిశోర్‌ని ప్రేమించిన సుధ తమ్ముడు శ్యామలరావు కథ నాకు తెలుసు—అతను చనిపోయే సమయంలో నేను కూడా అక్కడున్నాను. శ్యామలరావు చనిపోయే సమయంలో యెలా వున్నాడో అదే వికృత రూపంతో ఓ మనిషిని యేర్పాటు చేశాను స్మశానంలో. ఫెవర్లెట్ కారు వైర్లు తప్పించి స్టార్టు కాకుండా చేసి, దూరంగా ఆపివుంచిన నా కార్లో యింటికి తిరిగొచ్చాను.

శ్యామలరావుని స్మశానంలో చూసిన కిశోర్ గుండె చెదిరి చచ్చిపోతాడని నా ఊహ! కాని అలా జరగలేదు.

అరుణ్‌ని కూడా స్మశానంలో ఒంటరిని తిలో వదిలేసి కిశోర్ యింటికి పరుగెత్తుకొచ్చాడు. అంతక్రితమే ప్రవంతి నన్ను లేపి, అన్నయ్యలిద్దరు కనిపించటంలేదని చెప్పింది. నేను నా మారుతి కార్లో బయల్దేరుతుండగా కిశోర్ ఇంటికి చేరుకున్నాడు. అతన్ని తీసుకుని మళ్ళీ కార్లో స్మశానానికి వెళ్ళాను. అక్కడ శ్యామలరావు వేషం వేసుకున్న వ్యక్తి కనిపించకుండా యేర్పాటు చేశాను ముందుగానే! ఫెవర్లెట్ కారు వైర్లు సరిచేసి స్టార్టు చేశాను.

మరుసటిరోజు కూడా కిశోర్ అరుణ్‌ని అనుసరించి స్మశానానికి వెళ్ళాడు. నేను ఫాలో అయ్యాను. మనసే న్యాస్య అరుణ్ మీదికి ప్రేతాత్మ ఆవహిస్తున్న సమయంలో కిశోర్ అతనిమీదికి దాడిచేశాడు. అతను పారిపోయాడు.

అరుణ్ స్పృహతప్పి పడిపోయాడు.

అప్పుడు కూడా కిశోర్ భయపడకుండా అరుణ్‌ని తీసుకొని మోసుకుంటూ రాబోయాడు. నేను వెనకనుండి అతని తలమీద కొట్టి స్పృహతప్పించాను.

అయితే తనని కొట్టిందెవరో చూడకుండా నే, కొట్టారని కూడా గ్రహించలేక కిశోర్ నేలమీద పడి స్పృహ కోల్పోయాడు. అరుణ్‌ని, కిశోర్‌ని నేనే ఇంటికి తీసుకొచ్చాను. అరుణ్‌ని అతని గదిలో పరుండబెట్టి, కిశోర్‌ని కిశోర్ గదిలో పరుండజేశాను. అంతక్రితం మెయిన్ ఆఫ్ చేసి ఇల్లు చీకటి చేసింది నేనే!

శాంతమ్మని, స్రవంతిని ఆ తర్వాత పిలిచాను. కిశోర్, ఒక్కడే ఒంటరిగా నిద్రలో నడుస్తూ వెళ్ళిపోయాడని, దార్లో రోడ్డు కడ్డంగా పడుంటే తీసుకొచ్చాననీ చెప్పాను.

దాంతో కిశోర్ మెంటల్ డిప్రెషన్‌కు లోనవుతాడని, క్రమంగా మరో రెండు మూడు షాక్ ట్రీట్‌మెంట్స్‌నిచ్చి పిచ్చివాడిగా మార్చెయ్యాలని నా పథకం.

అయితే, అటు అరుణ్‌ని గాని, ఇటు కిశోర్‌ని గాని నే ననుకున్న పద్ధతిలో పిచ్చివాళ్ళగా మార్చలేక పోయాను. కనీసం భయభ్రాంతులై గుండె ఆగి మరణిస్తారని ఆశించే అదీ జరగలేదు.

చివరికు మేఘనాథ్ వల్ల నా గుట్టు రట్టయ్యింది. ఇన్‌స్పెక్టరు శ్రీనివాస్ పరిశోధించి ఘనశ్యామ్‌ని పట్టుకోవటంతో నా గురించి అంతా చెప్పేశాడు....”

—: అయిపోయింది :—

# అంతర్యుద్ధం

## నీలా

ఆఫీసు ఒక్కసారిగా స్తంభించిపోయినట్లయింది.

స్కూటర్ వచ్చి ఆగింది. మేనేజర్ తన గదిలోకి వెళ్ళాడు. అందరి కళ్ళల్లోనూ ఉత్కంఠ!

ఎవరూ మాట్లాడటం లేదు. అయినా వారందరికీ తమ తమ అభిప్రాయాలు చెప్పాలనుంది. అటెండర్ రాజు ఆ రోజు వచ్చిన "పోస్టు" మేనేజర్ గదిలోకి తీసుకెళ్ళాడు. ఊపిరి బిగబట్టి చూస్తున్నారంతా.

రాజు చిద్విలాసంగా బయటకువచ్చి కర్టెన్ దగ్గరాడు. తిరిగి అందరి కళ్ళల్లోనూ ఏం జరిగిందనే ప్రశ్నలు. ఆ రోజు వచ్చిన లెటర్స్‌లో ఓ మందపాటి కవర్ మీద "కాన్ఫిడెన్షియల్" అని రాసుంది.

అందరి ఉత్కంఠకూ కారణం అదే!

సాధారణంగా సంవత్సరానికోసారి మాత్రమే ఇలాంటి లేఖలు వస్తుంటాయి. అవి ఉద్యోగుల మీద సంవత్సరానికోసారి కాన్ఫిడెన్షియల్ రిపోర్టులు పంపించ

మంటూ రాసే లేఖలు. తిరిగి ఆ రిపోర్టులుకూడా రహస్యంగానే పంపిస్తారు. విడి సందర్భాలలో యేమైనా ప్రత్యేక సందర్భాలు మినహాయిస్తే ఇలాంటివి రావు. రోజూవారీ వచ్చే లేఖలు పల్చటి కవర్స్‌లో వస్తుంటాయి.

లెటర్స్ ఒక్క మేనేజర్ మాత్రమే చించుతాడు. ఆ లెటర్లు చించి అందులో విషయం తెలిసేదాకా అందరికీ ఆరాటంగా వుంటుంది. పల్చటి కవర్ చించక పోయినా అందులోని విషయాన్ని కొంతవరకు గ్రహించ గలుగుతారు. మందపాటి కవర్‌లో ఆ అవకాశం యే మాత్రం లేదు.

ప్రస్తుతం కాన్ఫిడెన్షియల్ రిపోర్ట్స్ పంపించే సమయం కాదు. అవి పంపించి కొంతకాలమయింది. అదే విధంగా ఆఫీసుకు చెంది ఈ నడుమ ఎలాంటి గొడవలు లేవు. అవినీతి ఆరోపణలు గాని, నెగ్లిజన్స్ ఆఫ్ డ్యూటీ అనే అంశంమీద యొవరిమీదనైనా మెమో సర్వ్ చేయటం లాంటిది కూడా లేదు. మరా లెటర్ యేమై ఉంటుంది?

రాజు వెనక్కి వెళ్ళాడు. ఒక్కొక్కరూ తమ సీటు నుంచి లేచి అతని వెనగ్గా వెళ్ళారు.

"రాజా ఆ లెటర్ చూశారా?"

"లేదండి. ఆయింకా చింపలేదు."

"ఎందుకని."

"ఏమో. ఆ లెటర్ మాత్రం ప్రక్కన పెట్టాడు."

"గురుడు సస్పెన్స్ మైంటన్ చేయటంలో నిపుణుడు."

"ఎవరూ ఏం కంగారు పడాల్సిన అవసరంలేదయ్యా. ఆయనగారికే యేమన్నా వచ్చివుంటుంది" అన్నాడు

శివం. శివం తమిళుడు కాదు. తెలుగువాడే.

"అంతేనంటావా" అన్నాడు వెంకటేశ్వర్లు.

అప్పుడు బజర్ మ్రోగింది.

రాజు పరిగెత్తుకుంటూ వెళ్ళాడు.

"శివాన్ని పిలువ్."

ఆ మాట అందరికీ వినిపించింది.

శివం గంభీరంగా మారిపోయాడు. తన మాటలు ఆయన విని వుంటాడనిపించింది. ముఖంలో ఏమాత్రం భయాన్ని కన్పించనీయకుండా లోనికి నడిచాడు.

"నమస్తే సార్" విష్ చేశాడు.

"నమస్తే. టేక్ యువర్ సీట్."

శివం కూర్చున్నాడు.

మేనేజర్ ఒక్కసారి శివంకేసి పరిశీలించాడు.

శివం అయిదడుగుల ఎనిమిది అంగుళాల ఎత్తుంటాడు. ఆ ముఖంలో పెద్ద మీసాలూ.... చురుకయిన కళ్ళు ఆకర్షిస్తుంటాయి. అతనెంతగా ప్రయత్నించి యేమేం పౌడర్లూ, క్రీమ్స్ వాడినా తన వదనంలోని క్రూరత్వాన్ని కొద్ది భాగం మాత్రమే కప్పిపుచ్చగలడు.

అతన్ని చూడగానే ఎవరికీ సదభిప్రాయం కలగదు. అతను ఓ ఆఫీస్‌లో లోయర్ గ్రేడ్ క్లర్క్‌గా పని చేస్తున్నాడనే విషయాన్ని ఎవరూ విశ్వసించరు. ఇంటి దగ్గర తిని దేశంమీద పడి తిరిగే రౌడీగా భావిస్తారు.

శివం తన దేహాన్ని తెలివితేటల్ని తలుచుకొని మురిసిపోతుంటాడు. ఎలాంటి చిన్న విషయాలోనయినా వెంటనే రియాక్టవుతాడు. ఆఫీస్‌లో ధైర్యంగా మాట్లాడే ధైర్యం తన ఒక్కడికే వుందని అతని నమ్మకం. ఏ ఆఫీసర్లూ అతన్ని తమ దగ్గర వుంచుకోవటానికి అంగీక

రించరు. ఎవరికయినా తప్పకపోతే అతన్ని చూసీ చూడ నట్లు వదిలేసారు.

"హెడ్ ఆఫీస్ నుండి మీ కో మెమో వచ్చింది."

"నాకా?" ఆశ్చర్యంగా అన్నాడు.

"అవును."

"ఎందుకు సార్?"

"మీ సి. ఆర్స్ మీద వారేదో వివరణ అడుగు తున్నారు. విత్ ఇన్ త్రీడేస్‌లోపు మీరు సబ్‌మిట్ చేయాల్సి వుంటుంది."

శివం మాట్లాడలేదు..

మేనేజరు శివానికి మార్క్ చేసిన కాపీ అందించాడు.

శివం మౌనంగా అందుకొన్నాడు.

"వస్తా సార్!"

మేనేజరు తలూపాడు. కాయితం అందుకొని బయట కొచ్చిన శివంకేసి అందరూ ఆశ్చర్యంగా చూశారు.

"ఏమిటి గురూ!"

"మెమో యిచ్చారయా" శివం కంఠం కంగున మ్రోగింది.

"దేనికి?"

"చూడాలి" అంటూ వెళ్ళి కూర్చుని ఆ లెటరు పరిశీలించాడు.

అది గతసంవత్సరానికి చెందిన సి. ఆర్స్ మీద ఆఫీ సర్ రాసిన కామెంట్. "హిజ్ ఇంటెగ్రిటీ ఈజ్ నాట్ టోటల్లీ రిలయబుల్. హి హేజ్ ఎ టెండన్సీ నాట్ టు రెస్పెక్ట్ హిజ్ సుపీరియర్స్" ఈ రెండు అంశాలమీద శివం వివరణ కోరారు. అది మూడురోజుల లోపు ఇవ్వాల్సి వుంటుంది.

శివం అది చదివాక క్షణకాలం కంగారుపడ్డాడు. అతని ముఖంలో కోపం స్థానంలో భయం చోటు చేసుకొంది. అతను ఈ ఉద్యోగంలో చేరి ఆరు సంవత్సరాలు దాటుతుంది. ఇలా జరగటం ఇదే మొదటిసారి. అందుకే అతనికి తెలియకుండానే చేతులు వణకటం మొదలు పెట్టాయి.

"ఇటివ్వు" అని ఆ లెటరు అందుకొని చదివాడు వెంకటేశ్వర్లు.

"ఎవరు రాశారంటావ్?" అన్నాడు.

నిజానికి అతనికి మహదానందంగా వుంది. అప్పు అడిగితే యివ్వలేదని శివం అతన్ని భయంకరంగా తిట్టి వున్నాడు. అందుకే శివం అంటే గొంతుదాకా కోపం. అయినా అతన్ని యేమీ చేయలేక ఆ కోపాన్ని తనలోనే దాచుకున్నాడు. శివాన్ని అడగటంలో తన సంతోషాన్ని కప్పిపుచ్చుకొని, సానుభూతి పులుముకొని మరీ అడిగాడు. ఇవేవీ గమనించే స్థితిలో శివం లేడు.

"ఇంకెవడు రాస్తాడు, ఆ భోషడీగాడే" అన్నాడు.

ఆ భోషడీగాడు "రామారావ్".

"వాడేనంటావా?"

"వాడే. ఈ రిపోర్ట్ ఈ సంవత్సరానిది కాదు. పోయిన సంవత్సరానిది."

తిరిగి బజర్ మ్రోగింది. ఎవరి సీట్లలోకి వారు చేరిపోయారు. రాజా లోపలకు వెళ్ళాడు.

"మంచినీళ్ళు పట్రా" మేనేజరు కంఠం మ్రోగింది.

అందరూ ఊపిరి పీల్చుకొన్నారు.

ఆ లెటరు ఒక్కొక్కరే అందుకొని చదవటం మొదలు పెట్టారు.

శివం కర్నూలు నుండి ఈ నడుమే ట్రాన్స్ఫరు

కాడాడు. విజయనగరం వస్తున్నందుకు అతనెంతో సంతోషించాడు. అక్కడ డిపో మేనేజరుతో కూడా తగాదాలే. ప్రతి చిన్న విషయంలోనూ వారికి అభిప్రాయభేదాలొచ్చేవి. అక్కడున్నంతకాలం ఒకర్నొకరు యేదేదో చేయాలని ప్రయత్నం చేశారు. ఆ యుద్ధం ఆగేదికాదు.

శివం ఈ లోపు మరో సమస్య ఎదుర్కొన్నాడు. అది కుటుంబ సమస్య. సరిగ్గా అప్పుడే ట్రాన్స్‌ఫర్ కావటం జరిగింది. విజయనగరంలో నూతనంగా ఓ బ్రాంచి యేర్పాటు చేస్తూ శివాన్ని అక్కడ పోస్టు చేశారు. ఆ రోజు కూడా పవరిసాంగా డిపో మేనేజరుతో పోట్లాట జరిగింది. తనకు అడ్వాన్సుగా ఆరు వందలు కావాలంటూ అడిగాడు శివం. అందుకు తిరస్కరించాడతను. దాంతో గొడవ మొదలయింది. ఇద్దరూ అరుచుకున్నారు.

"ఆరువంద లివ్వడానికి రూల్ లేదు" అంటాడాయన.

"ఆ రూల్ నువ్వు చూపించు" అంటాడు శివం.

చూపించటానికి యేం లేదు. ఆఖరుకు అకౌంటెంట్ యిద్దరికీ నచ్చచెప్పి అయిదువందలకు అంగీకరింపజేశాడు. శివం డబ్బందుకొని అలానే వచ్చేశాడు.

శివానికి 'ఫేర్ వెల్' ఇవ్వటం లాంటి కనీస సంప్రదాయాల్ని కూడా యెవరూ పాటించలేదు. డిపో మేనేజరు నిరంకుశుడు. నిజంగానే శివం తప్పించి ఆ ఆఫీస్‌లో మాట్లాడే ధైర్యం యెవరికీ లేదు. ఇప్పుడు అతనికి యిష్టంలేని వ్యక్తికి 'ఫేర్ వెల్' యిస్తే ఆ కక్ష మనసులో పెట్టుకోవచ్చు. అందుకే యెవరికివారు మౌనం వహించారు.

కథ అంతటితో ముగియలేదు.

శివం వచ్చిన నెల రోజుల్లోపు ఆ డిపో మేనేజరు అసిస్టెంటు మేనేజరుగా విజయనగరంలో పోస్టు చేయబడ్డాడు. ఇద్దరూ ఎళ్ళి ఒకేచోట ఫీల్డులో పని చేయాల్సి వచ్చింది. శివం ప్రత్యర్థి. అసిస్టెంట్ మేనేజరు రామారావ్!

వారిద్దరి నడుమ అనేక తగాదాలు జరిగాయి. ఇలా జరగటం ఇదే మొదటిసారి.

శివం లేచి మేనేజరు గదిలోకి వెళ్ళాడు.

"నేను ఫీల్డుకు వెళ్తున్నా సార్!" అని చెప్పి వచ్చేశాడు.

ఫీల్డులో అయిదుగురు పని చేస్తుంటారు. ఆఫీస్‌లో మరో అరుగురుంటారు. క్షణాల్లో ఈ వార్త అందరికీ తెలిసిపోయింది.

కాన్ఫిడెన్షియల్ రిపోర్ట్సుకు చెంది కొన్ని నైతిక నియమాలున్నాయి. ఓ వ్యక్తి ప్రవర్తనకు చెందిన ఈ రిపోర్టుల ఆధారంగా ప్రమోషన్లు ఆపివేయవచ్చు. ఇంక్రిమెంట్లు కట్ చెయ్యొచ్చు. ప్రొబేషన్ పీరియడ్ ఎక్స్టెండ్ చేయొచ్చు.

మామూలుగా అతడెంత దుర్మార్గుడైనా కానీ సి. ఆర్సు చెడగొట్టడానికి పూనుకోరు. అలా రాయబోయే ముందు తనో వ్యక్తి జీవితంమీద దెబ్బకొట్టబోతున్నాననే విషయం గుర్తొస్తుంది. ఆ సమయంలో తప్పకుండా తమ మానసిక వత్తిడుల్ని అదుపులో పెట్టుకుంటారు. అందుకు ప్రయత్నిస్తారు.

అలా కాకుండా సి.ఆర్సు చెడగొట్టేవారు రెండు రకాలుగా ఉంటారు. మొదటి రకంవారు యువకులు. వారికి జీవితానుభవం తక్కువ. ఉద్రేకం ఎక్కువ. తమ ఉద్యోగ జీవితం వ్యక్తిగత జీవితం భిన్నమైనవనే విష

యాన్ని వారు అర్థం చేసుకోలేరు. వారిలో ఉద్రేకమే ప్రధానమయినప్పుడు విచక్షణారహితంగా రాస్తారు.

మరొకరకం నిజంగా ఆ వ్యక్తి వల్ల గాయపడ్డవారు. అతని అవినీతిని, క్రమశిక్షణా రాహిత్యాన్ని ఏమాత్రం సహించే దశ దాటిపోయాక మాత్రమే అందుకు పూనుకుంటారు.

రామారావుకు షార్ట్ టెంపర్ ఉంది. అతను యువకుడు. శివ వల్ల ప్రతిక్షణం టెంక్షన్ అనుభవించేవాడు.

“రామారావ్ ఇంత పని చేస్తాడనుకోలేదు” అన్నారెవరో.

“రామారావే కాదు. హృదయమున్న వాడెవడూ ఈ పని చేయడు ఏమైనా ఉంటే బయట చూసుకోవాలి. అంతే కాని చేతిలో అధికారం ఉందికదాని”

“ఇవాళ శివానికి రాసాడు, రేపు మరొకరికి.”

“అరే రేపో మాపో ప్రమోషన్ రావాలి. ఇప్పుడెంత డ్రాబాక్.”

“అవును. భవిష్యత్ మీద కొట్టాడు.”

“దొంగ వెధవ” ఎవరో తిట్టారు.

శివం కళ్ళు ఆగ్రహంతో మండిపోతున్నాయి. ఈ క్షణంలో రామారావెదురుపడితే మీదపడి కొట్టేస్తాడు. బలంగా కొడితే రామారావు చచ్చిపోతాడు కూడా!

రామారావు సన్నగా ఉంటాడు. అతని బుగ్గలూ, కళ్ళూ లోతుకుపోయి ఉంటాయి. అస్థిపంజరానికి తోలూ, ఆ తోలుకు బట్టలు తొడిగినట్టుంటాడు.

అతనికి తరచుగా కోపం వస్తుంటుంది. అలా వచ్చినప్పుడు “నాకు పర్సనాలిటీ లేకపోట్టి సరిపోయింది. నేనూ నీ అంత ఉంటేనా” అంటుంటాడు.

రామారావు సాంఘికంగా, ఆర్థికంగా వెనకబడ్డ కులంలోనుండి వచ్చాడు. అతని చదువు పూర్తి కావటంతోనే ఉద్యోగం వచ్చింది. శివానికి అతనంటే లెక్క లేకపోవటానికి అతని కులంకూడా ఓ కారణం!

"చూడు శివం. ఈ విషయంలో నువ్వు మరీ ఉద్రేక పడ్డావనుకో. అది నీకే నష్టం. ఇలాంటి వాటికి కంగారు పడాల్సిన అవసరంలేదు. రెవిన్యూ డిపార్టుమెంట్ లో అయితే మెమోల్తో కొట్టుకుంటారు. నాకు తెలిసినాయన ఉన్నాడు. బ్రహ్మాండంగా డ్రాఫ్ట్ రాస్తాడు. ఆయన చేత రిప్లై ఇప్పించామంటే ఇంక తిరుగుండదు. లాయర్లెందుకు పనికొస్తారు. రామారావ్ తో తగాదా పెట్టుకుంటే అతని ఎలిగేషన్స్ కు ఇంకా బలం వస్తుంది. నువ్వు సస్పెండ్ అయినా ఆశ్చర్యంలేదు. కాబట్టి నువ్వు కంట్రోల్ కావాలి" అన్నాడు రాఘవ.

"ఆ నా కొడుకుని వదిలిపెట్టను గురూ" అన్నాడు శివం.

"వదిలిపెట్టొద్దు. కానీ యిప్పుడు మార్గం కాదు. పైగా ఎవరిముందూ ఏం కామెంట్ చేయొద్దు. వాళ్ళు యేదో సానుభూతిగా అంటారు. అందుకు నువ్వు రెచ్చిపోయి యేమన్నా అంటే తీసుకెళ్ళి మోస్తారు."

"వాడిలా చెయ్యటం బాగుందా?"

"బాగుందని ఎవరంటారు. కత్తితోనే చేశాడని అర్థమయింది కదా, అయినా ఈ ఆరు సంవత్సరాలలో నీకు కనీసం మెమో అయినా ఇవ్వలేదంటున్నావు. ఆయన ఆరోపణలకు బేస్ లేదు. ఈ మెమోవల్ల నీకేం జరగదు గాని.... నువ్వు ఆవేశపడితే వాడి వలలో ఇరుక్కున్నట్లే" వివరించాడు రాఘవ.

శిరంలో ఎంత తెగింపు వుందో అంతే పిరికితనం కూడా ఉంది. ఎంత గంభీరంగా మాట్లాడగలడో అంత త్వరగానూ లొంగిపోగలడు.

"సరే నేనేం మాట్లాడను. మనం దీనికి రిప్లై ఎప్పుడు ఇద్దాం?"

"ఈ రోజు సాయంకాలం ఆయన్ని కలుసుకొని మాట్లాడతాను. రేపు రాయొచ్చులే. మూడు రోజులు టైముంది కదా" అన్నాడు రాఘవ.

## 2

రామారావు ముఖంలో కళలేదు. గిల్టీగా ఫీలవుతున్నట్టుగా కనిపిస్తున్నాడు. ఆయన ముందు రాఘవ కూర్చుని వున్నాడు.

"మీరిలా రాయటం ఏం బాగుండలేదు సార్. మీకెంత ద్వేషమైనా ఉండొచ్చు. కానీ అతనిమీద ఆధారపడిన వారు దెబ్బతింటారనేది మీరు ఆలోచించాలి" అన్నాడు రాఘవ.

"లేదయ్యా. అతని సంగతి మీకు తెలవదు. కర్నూలులో ఉన్నప్పుడు నన్నెంత బాధలు పెట్టాడో మీకు తెలియదు. అక్కడ పార్టీల నందరినీ నా మీదకు పంపించేవాడు. హెడ్ ఆఫీస్ ముందు ఆయన మూలంగా ఎన్నిసార్లు తలవంచుకోవలసి వచ్చిందో నీకు తెలుసా? నామీద ఒకాయన కోర్టులో దావా నడుస్తుందయ్యా. నేను మాత్రం మనిషిని కదా?" అన్నాడతను.

రాఘవకు ఏం జవాబు చెప్పాలో అర్థంకాలేదు.

"ఈరోజు నీకు చెబుతున్నానయ్యా. నన్ను అమ్మ అక్క అంటూ తిట్టాడు. నేను సన్నగా ఉండబట్టి సరిపోయింది. లేకుంటే యే కాలో విరిచేసేవాడ్ని. ఇంటి

దగ్గర వాత్స్యం చేశారయ్యా. యెంతకాలం సహించమంటావో చెప్పు అతడికి నేనంటే ఏమన్నా లెక్కుందా? అందుకు కదా నేను రాసింది."

"ఏది యేమైనా మీరు కూడా తొందరపడ్డారు. మీ గోల విషయం ఆలోచించటంలేదు. మొత్తం ఎంప్లాయీస్ దృష్టిలో మీ గురించి చర్చ జరుగుతుంది. దీన్ని యెవరూ ఆమోదించరు."

"దేన్ని ఆమోదిస్తారయ్యా. ఆయన బూతులు తిట్టినా, యేం చేసినా ఊరుకుంటే ఆమోదిస్తారా? మీరందరు కూడా ఆయనకు మల్లే నే వుండొచ్చు కదా. ఏందయ్యా ఆయన గొప్ప. ఆయన్ది గొప్ప కులం అయితే ఏంటయ్యా నా కింద పని చేస్తున్నప్పుడు నా మాట వినాలా వద్దా" అన్నాడు రామారావు కోపంగా.

"అది నిజమే అనుకోండి. ఆఫీస్ వ్యవహారాల్లో యేవేవో వస్తుంటాయి. అవన్నీ పర్సనల్ గా తీసుకో కూడదు."

"ఎన్నిసార్లయ్యా చూసేది. అతను ఆఫీస్ గదుల్లో వ్యభిచారం చేస్తాడయ్యా. ఎవడన్నా చూస్తే నా పరువేం కావాలి?" అన్నాడు.

"మీ కంత ఖచ్చితంగా తెలిసినప్పుడు అప్పుడే చర్య తీసుకోవాల్సింది. నేను చెప్పే పాయింట్ మీకు అర్థం కావటంలేదు. అతను అభ్యంతరకర పనులు చేసినప్పుడు మాత్రం యేం చేయకుండా ఇప్పుడిలా చేయటం యేం బాగుందంటారు?" అన్నాడు రాఘవ.

అప్పటికి రామారావు కర్థమయింది. "అయినా నే నంత స్ట్రాంగ్ గా రాయలేదు కదా. ఊరికే వార్నింగ్ కి రాశా. ఇప్పటికయినా మారతాడా అని...."

"మారతాడు లెండి."

"మారతాడా! వాడి నమ్మకం లేదు. అతని సంగతి మీకు తెలియదు" అన్నాడు రామారావు.

రాఘవ నవ్వి "మీరు ఆ మెమోమీద పట్టుబట్టి కూర్చోకండి" అన్నాడు లేస్తూ.

"అబ్బే ఆదేం లేదయ్యా. ఆ రోజు ఆఫీసులో యెవరి మీదో పెట్టి చెండాలంగా తిట్టాడు. ఆ కోపంతో రాశాను."

రాత్రికి బార్‌లో శివం, రాఘవ కలిశారు.

"ఏం గురూ! మాట్లాడావా?" అన్నాడు శివం.

"మాట్లాడాను. దాదాపు యేడ్చినంత పని చేశాడు" అన్నాడు రాఘవ.

"ఏమిటంట?"

"ఏమిటేమిటి? నీ భాగోతం అంతా చెప్పుకొచ్చాడు. ఆయన్ని నానా చెండాలంగా తిట్టావంట, ఆఫీసుగదుల్లో వ్యభిచారం చేశావుట. పార్టీల్ని ఎగదోశావుట. ఆయన మీద కోర్టులో కేసు కూడా ఉందట గదా" అన్నాడు రాఘవ.

"అదా!" అంటూ నవ్వాడు. శివం.

"అంటే నిజమేనా?"

"నిజమే గురూ! వాడు నన్ను సతాయించాలని చూశాడు. నేను వాణ్ని సతాయించాను"

"అందుకే అతనలా రాశాడు."

"వాణ్ని వదిలిపెడతా ననుకొంటున్నావా? ఆ మొఖంమీద ఏసిడ్ పొయ్యాలా కొడుక్కి."

"పోశావు లే. అదేమంత గొప్ప విషయం కాదు. ఆ తర్వాత నిన్ను జైల్లో వేస్తారు."

"వస్తే యేమౌతుంది? ఈ రోజు నడిరోడ్డుమీద చంపితేనే దిక్కులేదు" అన్నాడు గ్లాసు అందుకుంటూ.

"కథలు చెప్పకు. ముందు నీ ఉద్యోగం పోతుంది. ఆ తర్వాత గొడవలు. ఈ హెడేక్ అంతా యెందుకు? నువ్వు కూడా నీ పద్ధతులు మార్చుకోవాలి. ఆయన్ని అమ్మ బూతులు తిట్టావట. ఎందుకలా?"

"ఆ రోజు యేదో అన్నాడు గురూ, అందుకు."

"ఆ రోజు రాశాడంట."

"అలాగ" అన్నాడు ఆలోచిస్తూ.

"అవును. మరి యేం చేస్తావు? నువ్వు ఆయన్ని పేరు పెట్టి తిడితే యేమన్నా చర్య తీసుకోగలడు. అసలు మీ యిద్దరికీ యే విషయంలో తేడా లొస్తున్నాయి?"

"నా పర్సనాలిటీ చూసి ఏడుపు బాస్! రోజూ ఆఫీస్‌కి టక్ చేసుకొచ్చేవాణ్ణి. రెండు మూడుసార్లు రోడ్డుమీద ఆడపిల్లల్తో మాట్లాడటం చూశాడు. వాడికి కుళ్ళు ఎక్కువ."

"అది వ్యక్తిగతం. మరో కారణం చెప్పు."

"మరేమిటో నాకు తోచటం లేదు."

"నేను చెప్పనా?"

"చెప్పు."

"మీ యిద్దరికీ డబ్బుల విషయంలోనే తేడా లొస్తున్నాయి." శివం ఒక్కసారిగా బిత్తరపోయాడు.

"నిజమే బాసూ... వాడికి నేనంటే ఆ విషయంలో హడల్. నన్నెప్పుడూ డబ్బు లొచ్చే సీటు దగ్గర వెయ్యడు."

"నన్ను సరిగ్గా చెప్పనీ. అలా వేస్తే పూర్తిగా నువ్వే తినేస్తావని అతని భయం. మామూలుగా ఇలాంటి వ్యవ

వారాల్లో కాంప్రమైజేషన్ ఉంటుంది. ఇద్దరికీ వాటాలు పంచుకోవటం ఇష్టంలేదు. అతనికి ఆఫీస్‌లో పెద్దం వుంది నువ్వొక్కడివే. నీకూ ఉంది అతనొక్కడే. మీ తగాదాలు తిరుగుతుంది. ఈ విషయం చుట్టూనే. ఏమంటావ్?" అన్నాడు రాఘవ.

"నిజమే గురూ. వాడిది కర్నూలు. కావాలని వేయించుకున్నాడు. తనకు తిరుగులేదనుకున్నాడు. నాతోనే ఇబ్బంది వచ్చింది."

"అందుకు నీ పద్ధతులు నువ్వు అనుసరించావు. అతని పద్ధతుల్లో అతను పోయాడు. ప్రస్తుతం అతను నిన్నో దెబ్బ కొట్టాడు. నేను మాట్లాడాను కదా. అదంత ప్రమాదం లేదన్నాడు. నేనేం సీరియస్‌గా రాయలేదు కదా అన్నాడు. కాట్టి ఈ సందర్భంలోనైనా మీరు కాంప్రమైజ్ అయితే బాగుంటుంది" అన్నాడు రాఘవ.

"లాభంలేదు గురూ. ఇంత జరిగాక వెనక్కి వెళ్ళటం మా వంశంలో లేదు. దెబ్బకి దెబ్బతియ్యాలి" అన్నాడు శివం. అతని కళ్ళు అప్పటికే ఎర్రబడ్డాయి.

"పగలు పెంచుకోవటం అంత మంచిది కాదు."

"మా వంశ లక్షణాల్లో అదొకటి బాస్. రివెంజ్ తీసుకోకుండా మేం యెప్పుడూ నిద్రపోం. మా వంశ లక్షణం మరోటుంది. అది వ్యభిచారం."

"ఆ విషయం రామారావుకెలా తెలిసింది?"

"ఎవడో చెప్పుంటాడు. వాడు గనుక నన్ను పట్టుకుంటే వదిలేవాడా? అరే ఎన్ని సార్లు ప్రయత్నం చేశాడు పట్టుకోవాలని. ఆఫీస్‌లో సడెన్‌గా చెక్ చేసేవాడు. అయినా మనం దొరికేవాళ్ళం కాదు. అదే వాడి బాధ. నేను పార్టీలందరినీ బాగా ఎక్కించి పంపేవాణ్ని.

చచ్చేవాడనులే."

"ఇంతకూ నీకెలా ట్రాన్స్ఫర్ అయింది."

"అదో పెద్ద వ్యవహారం. అక్కడ నాకో అమ్మాయితో సంబంధం ఉండేది."

"చిల్లర తిరుగుళ్ళు కాకనా?"

"అవును. ఒకరోజు దొరికిపోయాను. ఇంక ఇంట్లో చూడు రభస. భార్య పుట్టింటికి వెళ్ళిపోయింది. విడాకుల దాకా వచ్చింది గొడవ. మావాళ్ళెవరో మధ్యలోవుండి నన్ను చివాట్లు వేసి ఇద్దర్ని కలిపారు. ఈ ట్రాన్స్ఫర్ కూడా వాళ్ళ పుణ్యమే. వాళ్ళే రికమండ్ చేసి మార్పించారు."

"ఇక్కడకూడా తిరుగుతున్నావు కదా!?" అన్నాడు రాఘవ ఆశ్చర్యంగా.

"ఏం చెయ్యమంటావ్. అది మా వంశ లక్షణం. మా తాత అరవై దాటినా తిరుగుతుండేవాడట."

"రేపు ఉదయం ఎనిమిది గంటలకల్లా వచ్చేయ్. లేకపోతే ఆయన దొరకడు."

"అలాగే."

"నీకు అప్పచెప్పి వెళ్తాను. ఆయనకు విషయమంతా చెబితే డ్రాఫ్ట్ రాస్తాను. టైపు చేయించి పంపేయ్. నేను రేపటినుండి క్యాంపుమీద వెళ్తున్నాను కదా. వారంలో తిరిగొస్తా. ఈలోపేం తొందరపడకు.

## 3

"ఇతను మా కొలీగ్ శివం. మీకు చెప్పా కదా" అంటూ పరిచయం చేశాడు రాఘవ.

"నమస్కారం సార్" అన్నాడు శివం.

"కూర్చోండి" అన్నాడాయన.

ఆయన పేరు వీరాచారి. ఆయన్ని చూస్తుంటే చాణక్యుణ్ని చూస్తున్నామా అనిపిస్తుంది.

శివం తనకొచ్చిన మెమో అందించాడు.

చిరునవ్వుతో అందుకున్నాడాయన. చదువుతున్నంత సేపూ ఆ నవ్వు చెక్కు చెదరలేదు.

"ఏం డేంజర్ లేదుగా సార్" అన్నాడు శివం.

పెదవి చప్పరించాడాయన.

"నాకు వేరే పనుంది. మీరు మాట్లాడి డ్రాఫ్ట్ తయారు చెయ్యండి" అన్నాడు రాఘవ. వీరాచారి తలూపాడు నవ్వుతూనే.

"సరి నేను వెళ్ళొస్తాను. శివం నేను చెప్పింది గుర్తుంచుకో. వస్తానండి గురువుగారూ" అని చెప్పి రాఘవ వెళ్ళిపోయాడు.

"ఇంతకూ మీ ఇద్దరి మధ్యా గొడవ యేమిటి?" అడిగాడు వీరాచారి.

"ముందు నుండీ గొడవే సార్!"

"మీరు అతనితో ఎలా ఉండాలనుకుంటున్నారు?"

"అంటే" అన్నాడు అర్థంకాక.

"మీరు అతనితో తలపడదల్చుకుంటే మనం సీరియస్ గా ప్రొసీడవుతాం. లేదా మనం మనల్ని డిఫెండ్ చేసుకుంటూ రిక్వెస్టింగ్ మానర్లో రాయాల్సుంటుంది."

"నాకసలు చెప్పాలంటే వాడ్ని ఇలా రాయటం కాదు సార్. ఫిజికల్ గానే ఏదో పార్టు తీసేయాలని ఉంది." రాఘవాచారి నవ్వుతూ చూశాడు.

"మొండబ్బాయ్. నీవు చాలా ఆవేశంగా ఉన్నట్లుంది. పగతీర్చుకునే పద్ధతి ఎప్పుడూ అంత డైరెక్టుగా వుండకూడదు. ఈ మెమో దేముందయ్యా. ఇలాంటివి మా

సర్వీసులో కొన్ని వందలు చూశాం. రివెంజ్ తీసు కోవటం ఓ కళ" అన్నాడాయన తాపీగా.

శివం ఆశ్చర్యంగా చూశాడాయనవంక.

"నువ్వు నీ దేహాన్ని మాత్రమే చూసి మురిసిపోకూడదు. శరీరం కంటే బుద్ధిబలం అవసరం. అర్థమయిందా?"

తలూపాడు శివం.

"అందుకే దేహంకాదు ప్రధానం. నువ్వు అరిచి బీభత్సం చేశావనుకో. అదేం విశేషం కాదు. నువ్వు తిట్టావ్. ఏమేమో చేశావు. సమయం వచ్చింది నొక్కేశాడు. దీన్నిబట్టి చూస్తుంటే రివెంజ్ తీసుకునే కళ నీ కంటే అతనిలో యెక్కువున్నట్లుంది. ఇప్పుడు నువ్వు ఆవేశంలో యే పని చేసినా యెదురుతిరుగుతుంది. అందుకే ప్రశాంతంగా ఓ పథకం రూపొందించుకోవాలి."

"నన్నేం చెయ్యమంటారు?"

"ఏంలేదు. ముందు మెమోకి సమాధానం రాసివ్వాలి. అసలు నాటకం అక్కడి నుండే ప్రారంభం అవుతుంది. రేపటినుండి నువ్వు పూర్తిగా మారిపోతున్నావు. నీ కెరీర్ నాశనం చెయ్యటానికి ప్రయత్నించిన ఆ వ్యక్తి మీద నీ కెలాంటి ద్వేషం వుండదు పైపెచ్చు గతంలో అతనిమీద పోట్లాడినందుకు పశ్చాత్తాపం ప్రకటిస్తావ్. రోజు రోజుకూ నువ్విలా మారతావంటే యితనేనా ఆ పాత వ్యక్తని అనుమానం వస్తుంది.

అప్పుడు నీ అసలు కార్యక్రమం ఆరంభమవుతుంది. అతన్నే కాక చుట్టుపక్కలవారికి కూడా నువ్వు మారావనే అభిప్రాయం కలిగించాక, నువ్వు రంగంలోకి దిగు తావు. అతని దినచర్యనూ, ఉద్యోగ జీవితాన్ని రహ

ష్యంగా గమనిస్తావు. అతని బలహీనత యెక్కడ వుంతో నువ్వు తెలుసుకోగలుగుతావు. అప్పుడు ప్రణాళిక వేయబడుతుంది. పిక్చర్‌లో నువ్వుండవు. ఆ పని నువ్వు చేశావని అనుమానం కూడా రాదు. అంతగా నిన్ను నమ్మాలి. అతను ఏమరుపాటుగా వుండాలి.

అతన్ని శారీరంగా బాధపెట్టగలవేమో గానీ అంతకంటే మానసికంగా బాధపెట్టగలగటమే గొప్ప. శారీరకంగా నువ్వు బాధపెట్టినా ఆ ఫలితం నువ్వు అనుభవించాల్సి వుంటుంది" అన్నాడాయన.

శివం ఆయన మాటల్ని భక్తితో వింటుండిపోయాడు.

ఆ మాటల్లోని వాస్తవికత అతన్ని ఆకర్షించింది. రామారావు ఇలా రాయగలడని తను ఊహించలేదు. కర్నూలులో ఉన్నప్పుడు అతనేం చేయటానికి అవకాశం వుందో ఊహించేవాడు. అందుకు తగ్గట్టుగా ప్రవర్తించేవాడు. ఇప్పుడు ప్రమాదాన్ని తాను శంకించలేదు. ఈ బ్రాంచిలో అతను ప్రధాన అధికారి కాదు. అందుకే తక్కువ అంచనా వేశాడు. తను యేమరుపాటుగా ఉన్నప్పుడు దెబ్బతీశాడు.

అదే రామారావుకు హెడ్ ఆఫీస్‌లో బలం వుంటే తన పరిస్థితి మరోలా వుండేది.

తమ హెడ్ ఆఫీస్ పరిస్థితి నిజంగానే విచిత్రమైంది. అక్కడ రిక్రూట్‌మెంట్ దేషన్‌కు తప్పించి ఫ్యాక్ట్స్ అండ్ ఫిగర్స్‌తో సంబంధం లేదు. ఈ విషయంలో రామారావు నిస్సహాయుడు. రికమండేషన్ వుంటే యెలాంటి వాస్తవాలయినా సమాధి కాబడతాయి.

రామారావుమీద కూడా చాలా ఆరోపణలున్నాయి. "హార్డ్ స్ట్రాంగ్" అనే రామారావును పై అధికారులు

గ్యాని స్తుంటారు. అందుకే అతను తరచుగా ట్రాన్స్ ఫర్
కాబడుతుంటాడు.

మీరు చెప్పినట్లే చేస్తాను సార్!" అన్నాడు శివం!
యన చిరునవ్వు నవ్వేడు. "నా గదిలో కూర్చుందాం
అంటూ తీసుకెళ్ళాడు.

ను కొన్ని వివరాలు అడిగాక పావుగంటలో
ు తయారు చేశాడు. శివం ఆయన వాడిన ఇంగ్లీష్
ు ఆ భాషలో ఉన్నాయనే విషయం మొదటి
ా తెలుసుకొన్నాడు.

యినా శివానికి అర్థమయిన విషయం ఒకటుంది.
నీతి అని వినటం, చదవటమే గాని తన అనుభవం
రాలేదు. ఒక విషయాన్ని యెంత నమ్రతగా, డిప్ల
ిగా చెప్పవచ్చో, వీరాచారి డ్రాఫ్ట్ చెబుతుంది.
బ్యాలన్స్డ్ గానూ, కన్విన్సింగ్ గానూ వుంది.

ఇది నా ప్రమోషన్కు యే యిబ్బందీ కలిగించదు
"

వేరే ప్రొసీడ్ కాకుంటే మాత్రం యేముండదు.
గాక కూడా యింకా ఏక్షన్ తీసుకుంటారని నే
ను."

నేను ఈ రోజే సబ్మిట్ చేస్తాను."

ఈ లెటరు తీసుకెళ్ళి ముందు నీ మిత్రుడికి చూపిస్తు
వ్" అన్నాడాయన తాపీగా.

ఎవరికి? రామారావ్ కా?"

అవును."

నేనా!" అన్నాడు ఆశ్చర్యంగా.

చూశావా! అప్పుడే మామూలు మనిషివయ్యావు.
ుచ్చవనే వ్యక్తికి రాగద్వేషాల్ని తన మనసులోతప్ప

ముఖంలోనూ, ప్రవర్తనలోనూ స్పష్టంగా చూపిం
గంభీరంగా అన్నాడు.

శివం జీవితంలో మొదటిపాఠం నేర్చుకొన్నాడ

"తప్పకుండా చూపిస్తా సర్. త్వరలో నే మి
కలుస్తాను."

"సంతోషం, విజయీభవ" అన్నాడాయన.

వీరాచారికి ఈ రకమైన సంఘర్షణ అంటే
యిష్టం!

# 4

"ఇదిగో సార్, హెడ్ ఆఫీసు మెమో ఒకటి
న్నాను. ఓసారి మీకు చూపించాలని తీసుకొచ
నమ్రతగా కాయితం అందించాడు శివం.

ఊహించని ఈ సంఘటనకు కంగారుపడిపో
రామారావు. "అబ్బే.... నా కెందుకయ్యా?"

"ఊరికే చూడండి సార్! లెటరులో యే
తప్పు లున్నాయేమో!"

రామారావు అనుమానంగానే అందుకున్నాడు.

"నా మీద మీరు రాశారని నాకేం కోపం
జనరల్‌గా చూపిస్తున్నాను. ఆ తర్వాత యేం ర
నని మీ రనుకోవచ్చు కదా!"

"అబ్బే .... అదేం లేదయ్యా" అన్నాడు

"ఎవరో వ్రాయించావయ్యా? బ్రహ్మాండంగా
అన్నాడు చదివాక.

"ఎవరో మీ బోటాయనతో రాయించాను."

"చాలా బాగుంది" అన్నాడు రామారావ్.

"మీరు రాసింది నిజమేనండి. సుపీరియర్స్‌ను
వించటం నాకు చేతకాలేదు. ఇప్పుడే అన్నీ నా

ున్నాయి. ఇప్పటిదాకా మనం అనేక విషయాల్లో
ండుకున్నాం. నేను మిమ్మల్ని యెదురుగా తిట్టాను'
ునా గాని....జరిగిందేదో జరిగిపోయింది. ఇకనుండీ
ంటి పరిస్థితుల్లోనూ మనం పోట్లాడుకోనే అవకాశం
ండదని నేను భావిస్తున్నాను."

మంచిదే కదయ్యా!" అన్నాడు రామారావు.

'మీ రిలా రాయటంవల్లే నాకు జ్ఞానోదయం
ంది."

'ఏదో కోపంలో రాశాను. ఏమనుకోకు."

'మీరు నన్ను ఏమనుకోకండి."

'ఇట్సాల్ రైట్!"

'వం తన లెటర్ అందుకొని ఆఫీసుకు వెళ్ళాడు.

రామారావుకు చెప్పలేనత ఆశ్చర్యంగా వుంది.
తొందరగా యిలా మారటం అసంభవం. ఇంత విన
గా ప్రవర్తించటం ఖచ్చితంగా ధూర్తలక్షణమే
పన్నాడు. అయినా కొంతకాలం పరిశీలిస్తే నే గాని
ర్ణయానికి రాకూడదనుకున్నాడు.

శివం లెటర్ ఆఫీసులో సబ్ మిట్ చేశాడు.

మే నేజరు పూర్తిగా చదివాడు.

"బాగుందయ్యా. చక్కగా రాశావు. అయినా
ంటివన్నీ రొటీన్. రామారావ్ అలా రాయటం యేం
గుండలేదు. పదికాలాలపాటు ఒకచోట కలిసి పని
యువలసిన వాళ్ళం. ఇలా మనస్పర్ధలు పెంచుకుంటే
ులా?" అన్నాడాయన.

"నిజమే ననుకోండి. అయినా ఇందులో నా తప్పు
ుడా వుంది. పూర్తిగా అయనే్న అనటానికి వీల్లేదు.
కున్ని నేనే రెచ్చగొట్టాను" అన్నాడు శివం

నమ్రతగా.

"వాట్!" అంటూ ఆశ్చర్యంగా కుర్చీలోంచి లేచాడు మేనేజరు.

శివం నుండి అలాంటి జవాబు రాగలదని ఆ ఊహించలేదు.

"ఈ లెటర్ ఫార్వర్డ్ చేయండి."

"ఓ. కె!" అన్నాడాయన ఆశ్చర్యంగానే.

శివం బయటకొచ్చాడు.

"ఏంటి శివం! ఇంత మారిపోయావ్? నువ్వి మర్యాదగా మాట్లాడుతుంటే రామారావ్‌కు పో పోతుంది." అన్నాడు వెంకటేశ్వర్లు.

వెంకటేశ్వర్లు తోటివారిని రెచ్చగొట్టడంలో మునగ చెట్టెక్కించటంలోనూ నిపుణుడు. తనకు కావల సమాచారాన్ని పరోక్షంగా రాబట్టుకోవటంలో అతని తెలివి తేటలు ప్రదర్శిస్తాడు!

"ఆయన మన మేనేజర్. మర్యాద యివ్వటం బాధ్యత."

"నువ్వు సరిగ్గా మాట్లాడుతుంటే నీ బాస్ అ పోయాడు. ఇప్పుడు మాతో మాట్లాడటం మానేశాడు

"నేను ఆయనతో యెప్పుడు తగాదాపడ్డా ఆయ వర్క్ విషయంలో మాత్రం పొగిడాను. మనకు మేనేజర్లలో అతనితోపాటు పని చేసేవాళ్ళు తక్కు ఇదివరకు పోట్లాడుకునేవాళ్ళం. ఇప్పుడదేం లేదు అన్నాడు శివం.

"నిజమే" అన్నాడు వెంకటేశ్వర్లు.

సాయంకాలం మాటల సందర్భంలో వెంకటేశ్వ ఈ విషయమే రామారావుతో అన్నాడు.

"శివం చాలా మారిపోయాడు సార్!"

"ఏమయ్యా అట్లా అన్నావు."

"అవునండి మిమ్మల్ని ఎంతగా పొగిడారనుకున్నారు. మొదటిసారి నేను వినటం."

"ఏమోనయ్యా.... నాకేం నమ్మకంలేదు."

అయినా ఎందుకో సంతృప్తికలగటంలేదు. ఈ నమ్రత వెనుక ఏదో ప్లానుంది. ఎవరినన్నా మాట్లాడి కొట్టిస్తాడా? రోడ్డుమీద వెళ్తుంటే గుద్దేప్పి కొట్టేస్తే తనకు దక్కేమిటి? అయితే ఏం చెయ్యాలి?

ఈ పరిణామాలన్నీ ముందే ఊహించి వుండాల్సింది. అతను యేదో చేస్తాడు. అదికూడా ఫిజికల్ గానే. ఒక్కసారి తన వంక చూసుకున్నాడు రామారావు.

"నేనుకూడా అంత లావుంటేనా...." అనుకున్నాడు.

అతన్ని గుప్పిట్లో ఉంచుకోవాలి. అందుకు యేం చెయ్యాలి? రామారావ్ ఆలోచిస్తూ ఉండిపోయాడు

## 5

"నీలో ఆవేశం తప్ప ఆలోచనలేదు" అన్నాడు వర్మ.

వర్మకూడా రెవిన్యూ డిపార్టుమెంట్ లో పని చేస్తున్నాడు. ఇరవై సంవత్సరాల అనుభవంతో అతను రాటు తేలి వున్నాడు. వర్మతో ఓ విచిత్ర పరిస్థితిలో రామారావుకు స్నేహం కలిసింది. తన బాధను ఆయనకు వెల్లడించాడు రామారావు.

"ఎందుకంటే తెలివిగలవాడు తొందరపడడు. ఓవేళ తొందరపడినా సగంపని చెయ్యడు."

"అంటే ." అన్నాడు రామారావు.

"మీరతని సి ఆర్స్‌లో మార్క్ రాశారు. బాగుంది. కానీ దానికి బేస్ యేమిటి? ఒక్క ముక్కలో అతను

యితర్ని గౌరవించదు, యారగెంట్ అని రాస్తే చాలదు. అందుకు తగ్గ ఆధారాలుండాలి. ముందునుండీ అలాంటి బేస్‌ను క్రియేట్ చేసుకోవాలి.

అతని ఉద్యోగ జీవితంలో మీరెప్పుడూ ముఖాముఖి తలపడ్డారు. కానీ రికార్డ్‌గా యే ఆధారం లేదు. కనీసం ఓ మెమో గాని, వార్నింగ్ గాని లేకుండా అకస్మాత్తుగా అతను దుర్మార్గుడయిపోయాడంటే రెండు విషయాలు స్పష్టమవుతున్నాయి. అతనిమీద మీకు వ్యక్తిగత ద్వేషం ఉంది. రెండు. యేదో విషయంలో మీ ఇద్దరికీ పడటంలేదు. ఆఫీసుల్లో ఆర్థిక విషయాలమీద తగాదాలొస్తాయి. ఇలా రాయటం ద్వారా మీ సుపీరియర్స్‌లో మీమీద ఓ భావాన్ని క్రియేట్ చేసుకున్నారు.

ఏమాత్రం అనుభవమున్న ఆఫీసరయినా మీ రిపోర్టు చూసి "బేస్‌లెస్" అని ఒక్కముక్కలో కొట్టేస్తారు. మరి నువ్వు సాధించిందేమిటి? నథింగ్. నువ్వు బయట పడిపోయావు నీకు వ్యతిరేకంగా అతను తన కేడర్ నంతా కలుపుకొస్తాడు. నువ్విలా రాయటంవల్ల నీ ద్వేషాన్ని ప్రతిబింబించటం తప్పించి యెలాంటి ఉపయోగం లేదు.

అంతగా నువ్వు రాయదలుచుకుంటే పూర్తిగా దిగిపోవాలి. అటో ఇటో తేల్చుకోవాలి ఇలాంటి మెమోలు రాండిస్తే అతను మొద్దుబారిపోతాడు. అసలు యుద్ధం మొదలయ్యేదక్కడే" అన్నాడాయన.

"ఇంతదూరం నేను ఆలోచించలేదండి. కోపంలో రాసేశాను. అసలు మా హెడ్ ఆఫీస్‌లో ఎంత స్పష్టమయిన ఆరోపణలు చేసినా గాలికెగిరిపోతాయి. ఏదో బెదిరించుదామని రాశాను" అన్నాడు రామారావు.

"ఇలా ముందు చూపులేకుండా రాస్తే కోర్టుల్లోకూడా

ఫేన్ చెయ్యాల్సొంటుంది. మనం ఓ విషయాన్ని సీరియస్ గా తీసుకుంటున్నామంటే దాన్ని డిఫెండ్ చేసుకునే సామర్థ ఉండాలి. మా ఆఫీస్ పరిస్థితి తెలిసికూడా మీరు రాంగ్ స్టెప్ వేశారు. ఈ సి.ఆర్స్ క్రిటిక్ వాళ్ళ సంప్రదాయం. ఇలా దుర్వినియోగం అవుతున్నాయనే వీటిని పూర్తిగా రద్దుచేయాలని డిమాండ్ చేస్తున్నారు" అన్నాడాయన.

"నేను సరిగ్గా రాయనిమాట నిజమే. కానీ అతని ప్రవర్తన దారుణంగా వుంటుంది" అన్నాడు రామారావు తన చర్యను సమర్థించుకుంటూ.

"అలాంటప్పుడే ఎటాక్ ఇవ్వాలి. దొంగలుపడ్డ తర్వాత కర్రలు విరిగినట్లుగా ఇప్పుడు రాస్తే ఎలా? ఇలాంటి విషయాల్లో తొందరపడకూడదు."

"నిజమేనండి. నాకూ అనుభవం లేదు కదా. మరో విషయం తెలుసా? ఈ నడుమ అతను చాలా మారిపోయాడు. ఎంతో మర్యాదగా ఉంటున్నాడు. ఆ విషయం నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది."

శర్మ కొంచెంసేపు ఆలోచించాడు.

"ఇలాంటి విషయాల్లో రకరకాల వారుంటారు. రివెంజ్ తీసుకోవటంలో అదో భాగం. మీరు యేమరుపాటుగా ఉండకండి. అతన్ని ఓ కంట కనిపెడుతుండండి."

"నాకు అతని గురించి ఒకటే భయం. చాటుగా దాడిచేస్తాడని లేదా యెవరితోనయినా చేయించగలడని. అతను తీసుకునే రివెంజ్ అలానే వుంటుంది" అన్నాడు రామారావు.

శర్మ తలూపాడు సాలోచనగా.

"పోలీస్ రిపోర్టిస్తే ఎలా ఉంటుంది" అన్నాడు రామారావే.

"ఛ ...ఇంక ఆఫీస్‌లో నీకు పరువేముంటుంది. అతని వ్యక్తిగత జీవితంలో యేవో బలహీనతలుంటాయి. అవి కాచ్ చెయ్యాలి. తిరిగి మరెప్పుడూ నీ జోలికి రాకుండా ఉండాలంటే ఆ రూట్లోనే సాధ్యం. నువ్వుకూడా అతని పట్ల ప్రేమ ప్రదర్శిస్తూనే నీ చేతిలోకి తెచ్చుకోవాలి...." అన్నాడు శర్మ.

"అవును. ఈ విషయంలో నా ప్లాన్స్ నాకున్నాయి" అన్నాడు రామారావు.

శివం జీవితంమీద రామారావ్ షాడో పడటం ఆరంభమయింది ఆ క్షణంలోనే!

# 6

శివం ఓ సెక్స్ మానియాక్.

రోడ్డుమీద పోయేటప్పుడు వచ్చే పోయే స్త్రీలను కొరుక్కు తినేట్లు చూస్తాడు. అతని సైకిల్ వారిని రాసుకుంటూ వెళ్తుంది. అతని కళ్ళూ, చేతులూ ఏవేవో సంజ్ఞలు చేస్తూనే వుంటాయి. వాళ్ళు పెద్దవారు గానీ, చిన్నవారు గానీ యెవరయినా సరే అతని స్వభావం అంతే.

అతనిలో మరో లక్షణం వుంది. సెక్స్‌కు సంబంధించిన విషయాల్ని వల్గర్ గా వివరించటం. ఈ విషయంలో శివానికో సూత్రం వుంది....ఏ వయసువారైనా ఫర్వా లేదు. ఆమె 'స్త్రీ' అయివుంటే చాలు. "స్త్రీ గొప్పది. ఏ స్త్రీ అయినా నన్ను కదిలిస్తుంది" అంటుంటాడతను. అతనో స్పెసిమన్. శివం సెక్స్ బలహీనతలమీద గొప్ప పరిశోధన చేయవచ్చు.

సంభోగ సమయంలో అతని ప్రవర్తన కిరాతంగా ఉంటుంది. అతనికి తృప్తి అనే పదానికి అర్థం తెలియదు. ఎప్పుడూ యింకా యేదో అనుభవించాలనే ఆరాటం.... తపన. అతని పద్ధతుల్ని సంసార స్త్రీ లెవరూ ఆమో దించరు. అందుకే అతని దృష్టి దేశం మీదుంటుంది.

అతని శాడిస్ట్ పద్ధతులకు వేశ్యలు సహకరించవల సిందే—వారికి తప్పదు కాబట్టి. శివం డబ్బు విషయంలో పొదుపుగా ఉంటాడు. అతనెప్పుడూ డబ్బులిచ్చి స్త్రీల దగ్గరకు పోడు. అతని ముఖంచూసి ఆకర్షింపబడేది తక్కువ రకం స్త్రీలు. అలాంటివారి దగ్గరికే పోతుం టాడు. ఈ విషయం ఇంటిదగ్గర తెలియకుండా జాగ్రత్త పడతాడు.

శివం భార్య గ్రాడ్యుయేట్. కర్నూలులో జరిగిన సంఘటనకే ఆమె తీవ్రంగా గాయపడింది. మధ్యవర్తుల ద్వారా అప్పుడు సంసారం చక్కబడింది. ఇప్పుడూ శివం తిరుగుళ్ళు గమనిస్తే—వ్యభిచారం చేస్తున్నందుకు కాదు ఆమె కుంగిపోయేది—తన భర్త ఎలాంటి స్త్రీల దగ్గరకు వెళ్తున్నాడనే విషయం భరించలేక! అంత దారుణమైన బలహీనతలు కలిగున్న వ్యక్తి శివం!

రామారావుకు అతని గురించి చూచాయగా తెలుసు—ఆడపిచ్చి వుందని. కానీ లోతుల్లోకి వెళుతున్న కొద్దీ అతని ప్రవర్తన అర్థమయి ఆశ్చర్యపోయాడు.

ఈ నడుమ శివం దృష్టిలోకి యిద్దరు మహిళ లొచ్చారు. అందులో ఒకావిడ నల్లగా వుంటుంది. ఆమెకు చాలా కాలంగా ఫారిన్ నైలెక్స్ చీర ధరించా లనే కోరిక వుంది. ఆమె శివం దృష్టిలోకి వచ్చింది. తన కా చీర తెచ్చిపెడితే సుఖం అందించగలనని ఆమె

వాగ్దానం చేసింది. నెలాఖరు కదా జీతం అందుకొన్నాక కొనిపెడతానని నచ్చచెప్పబోయాడు శివం. కానీ ఆమె అందుకంగీకరించలేదు.

మరో అమ్మాయి ఎక్కడి నుండో వచ్చేసింది. ఆమెకు ఈ నడుమే పెళ్ళయింది. ఆమెకు తన భర్తంటే యిష్టం లేదు ఆమె భర్తకూ తనంటే అయిష్టమూ, అనుమానం! అందుకే ఓ సాయంకాలం పూట మేడమీదినుండి క్రిందకు నెట్టేశాడట. దాంతో ఆమెకు మూడు నెలల గర్భం పోయిందట. అక్కడ వుంటే ఏదో రోజు చంపేయగలడని ఆమె ఇంటినుండి వచ్చేసింది.

ఏ రకం పక్షులు ఆ గూటిని చేరతాయని ఆమె శివం గూటికి చేరింది.

ఆఫీసు అయిన దగ్గర్నుండి అతను తిరుగుతుంటాడు. ఆ వేటలో వీళ్ళిద్దరూ తగిలారు. మొదటి విషయం వాయిదా వేశాడు. రెండో అమ్మాయి మాత్రం "మీ యిష్టమయితే నేనిక్కడే వుండిపోతాను. ఏదన్నా గది చూడండి. నాకు కొంచెం భోజనానికి ఇవ్వండి" అంటూ ప్రాధేయపడింది.

ఆమెకు వెంటనే లేబర్ యేరియాలో ఓ గది చూశాడు.

రామారావు ఈ విషయాలన్నీ సేకరించి పెట్టాడు. అతనలా సేకరించగలడనే అనుమానం కూడా శివానికి కలగలేదు. శివానికి తన పతనమయిన జీవితాన్ని గొప్పగా చెప్పుకోవటంలో ఆనందం వుంది.

శివం ఈ గొడవల్లో వున్నా రామారావు జీవితానికి చెందిన చీకటి కోణాల్ని బయటకు తియ్యగలిగాడు.

రామారావు గొప్ప లంచగొండి!

అతను తనకు బాగా నమ్మకమైన వ్యక్తి ద్వారానే డబ్బు తీసుకుంటాడు. అందులో అతనికి కొంత వాటా పోతుంది. తనే మో పని చేస్తాడు. ఎవరికీ అనుమానం రాదు. రామారావు జీవితం లోతుల్లోకి వెళ్ళాక శివానికి మరి కొన్ని విషయాలు తెలిసివచ్చాయి.

వారి కుటుంబంలో పైకి వచ్చింది అతనే. మిగతా వాళ్ళందరూ కూలిపనులు చేసుకుంటున్నారు. వారంతా కష్టపడి రామారావును చదివించారు. ఈ స్థితికి వచ్చాక అతనవన్నీ మరిచిపోయాడు. వాళ్ళెవర్నీ కలుసుకోవటానికి అతనంగీకరించడు. వారికి పైసా కూడా సహాయం చెయ్యడు. అందుకే వారందరికీ రామారావంటే అసహ్యం. కాగా ట్రాప్ తయారు చేయాలి. అందులో రామారావు ఇరుక్కోవాలి.

అందుకు తగ్గ సలహా ఇవ్వగలిగేది వీరాచారే!

6

"మా వాడి గురించి పూర్తి వివరాలు సేకరించాను సార్!" అన్నాడు శివం, వీరాచారితో.

"మంచిది, అతను క్యాష్ తీసుకుంటున్నాడా?"

"అవును. కానీ అతను డైరెక్టుగా తీసుకోవటం లేదు.

"ఎవరి ద్వారా తీసుకుంటాడు?"

"ఆ బెండర్ ద్వారా."

"అలా అయితే కష్టం కదా!"

"అది మీరు ఆలోచించాలి."

"అతన్ని పట్టించాలంటే ఒకటే పద్ధతి వుంది. ఎ.సి.బి. వాళ్ళకి చెప్పటమే. వాళ్ళు కొన్ని ప్రత్యేకమైన నోట్లు యిస్తారు. అవి తీసుకుంటుండగా వాళ్ళు వస్తారు. కొంచెం ఆలస్యం అయినా ఫర్వాలేదు. ఆ నోట్లు తీ

ఉంటే వేలిముద్రలు పడతాయి."

"నిజమే అనుకోండి. కానీ వాడు స్వయంగా తీసుకోడే? —"

"తప్పకుండా తీసుకుంటాడు. ఆయన బాగా నమ్మిన వ్యక్తి అయివుండటం అవసరం. క్రొత్తవాళ్ళ దగ్గరయితే ఎటూ అటెండర్ తీసుకుంటాడు. బాగా నమ్మకముంటే ఆయనే తీసుకుంటాడు."

"ఎందుకనంటారు?"

"నమ్మకం మొదటి కారణం. రెండోది ఆ అటెండర్ గాడు ఏంతీసున్నాడో యేం తెలుస్తుంది? పైగా వాడికి వాటా ఇవ్వటం యెందుకు?"

"నిజమే!"

"ఒక్కసారి ఆ జీవితానికి అలవాటుపడితే చూపెప్పుడూ డబ్బుమీదే వుంటుంది. అలాగే సాధ్యమైనంత వరకూ రాబట్టుకోవటానికే చూస్తారు. మరొకడికి పైసా యివ్వాలంటే ప్రాణం పోతుంది. అందుకని మంచిమార్గం యేమిటంటే వాడికి నమ్మకమైనవాడిని పట్టుకోవాలి. అతనిచేత ఎ.సి.బి. వారికి రిపోర్టు చేయిస్తే ట్రాప్ ఏర్పాటుచేస్తారు.

ఒక్కసారి దొరికాడా వాడి ఖర్మ జీవితంలో ఆ దెబ్బ మరిచిపోడు. ముందు సస్పెండ్ అవుతాడు. ఆ తర్వాత కోర్టులచుట్టూ తిరగటంతో సరిపోతుంది. వాడు సంపాదించిందంతా హారించుకుపోతుంది. అర్థమైందా?" అన్నాడాయన.

"ఇప్పటినుండి ఆ ప్రయత్నంలో ఉంటాను సార్!"

"గో ఎ హెడ్!" ఆశీర్వదించాడు వీరాచారి.

శివం వస్తుండగా నైలెక్స్ చీర కనపడింది. ఆ

ప్రక్కగా సైకిల్ త్రిప్పాడు.

"ఏం దేవి!" అన్నాడు శివం.

"నువ్వా?" అందామె ఉలిక్కిపడుతూ.

"ఎక్కడ నుండి వస్తున్నావు?"

"బజారులో పనుండి పోయాను."

"రమ్మంటావా?"

"నువ్వా చీర సంగతి మాట్లాడవు!"

"చూస్తుంటే నువ్వా చీర కోసమే ఊం అన్నట్టుందే" అన్నాడు శివం.

ఆమె కొంచెం దెబ్బతిన్నట్లుగా చూసింది.

"అంత నమ్మకం లేకపోతే ఎలా? జీతాలు రాగానే కొని పెడతానని చెప్పాను గదా. మనుషుల్ని నమ్మాలి" అన్నాడు వెంటనే.

ఆమె ఆలోచించింది. శివం ఆఫీసు అడ్రసు ఆమెకు తెలుసు. అవసరమయితే తాను అక్కడకు వెళ్ళి తెచ్చుకో గలదు. ఆమె భర్త ముసలివాడు. సెక్సు విషయంలో ఆమెకు అసంతృప్తి వుంది. ఆమెకు సైలెక్సు చీరమీదే కాక ఇంకా చాలా వస్తువులమీద ప్రేముంది. ఆమె రోజూ చూసే సినిమాల ప్రేరణ అది.

"సరే రా!" అందామె.

"మీ వాళ్ళెవరూ లేరుగా?"

"ఎవరూ లేరు. ముందు నేను వెళ్తాను. ఆ తర్వాత రా!" అంది.

ఆమె వెళ్ళిపోయాక పదినిముషా లుండి ఆమె ఇంట్లోకి వెళ్లాడు శివం. అతని కళ్ళు కామంతో నుండిపోతు న్నాయి అమాంతం మీదకు లాక్కున్నాడు.

"ఉండు. బట్టలు చిరిగిపోతాయి. చీర తెమ్మంది

అందుకే. మంచి చీర కట్టుకొని వద్దామనుకుంటే —"

"అప్పటిదాకా మనం ఆగలేం కదా! ఫస్టు తర్వాత నీకు చీరే కాదు. మేచింగ్ బ్లౌజు కూడా ..." అన్నాడు శివం. ఆమె మురిసిపోయింది.

అరగంట తర్వాత శివం వంక ఆదోలా చూస్తూ అంది.

"నీకు పెళ్ళయిందా?"

"అయింది. ఏం?"

"నీ పెళ్ళామెట్లా ఊరుకుంటుంది?"

శివం వికృతంగా నవ్వాడు.

"నువ్వు మనిషివి కాదు. ఇదేం పద్ధతి?" అంది కొంచెం కోపంగానే.

శివం కళ్ళవెంట నీళ్ళు వచ్చేదాకా నవ్వాడు.

"చీర సంగతి మరచిపోకు" అంది.

"బ్లౌజు కూడా" సవరించాడు శివం.

తిరిగి వస్తుండగా శివం మనసులో ఆ వ్యక్తి మెరిశాడు!

# 8

"శివం భార్యకు,

ఈ లేఖ ఆసాంతం చదివి ఓ. నిర్ణయానికి రమ్మని కోరుతున్నాను. మీరు ఎంతో చదువుకొని, సంస్కారం కలిగుండీ ఓ సెక్స్ పెర్వర్ట్ చేతుల్లో బానిసగా బ్రతకాల్సి రావటంపట్ల నా సానుభూతి ప్రకటిస్తున్నాను.

మీ దంతటి దురదృష్టం. ఏ పురుషుడికయినా పర స్త్రీలపట్ల కొంత వ్యామోహం ఉంటుంది. కానీ దానికీ ఓ హద్దుంది. మీ భర్త లీలల గురించి మీకు తెలిసింది చాలా తక్కువ.

కానీ అతని నగ్న స్వరూపం మీకు తెలిస్తే

గుండెలు బ్రద్దలయిపోతాయి. అతను ఎలాంటి ఆడవారితో తిరుగుతున్నాడో ఒక్కసారి మీరు గమనిస్తే ఇంక జీవితంలో అతనితో కాపురం చెయ్యటం సంభవించదు. రోడ్ల వెంట తిరిగే వారూ, వేశ్యలు, మదంతో కొవ్వెక్కినవారూ ఇంకా ప్రత్యేకించి వయసుమళ్ళిన వారు. వారే అతను మెచ్చిన రంభలు.

ఓ బాధ్యతాయుతమైన ఉద్యోగంలో ఉంటూ ఇలా ఎందుకు దిగజారాలి? ఈ విషయం మీ స్నేహితులకీ, మీ బంధువులకూ తెలిస్తే మీరు తలెత్తుకు తిరగగలరా?

మీవారి తాజా లీలలు యేమిటో తెలుసా? ఈ ఊళ్ళోనే ఓ అనాథకు ఆశ్రయం ఇచ్చాడు. ఆమె గురించి మీకు తెలుసుకోవాలనుందా? వెంటనే క్రింది అడ్రస్‌కు వెళితే పూర్తి సమాచారం లభిస్తుంది. మర్యాదగా అడగండి. ఆమె ఏం చెబుతుందో వినండి.

ఇంకా మీకు కావాలంటే అతను పర స్త్రీలతో ఉన్నప్పుడు పట్టించగలం. ఆ రోజైనా మీ వ్యక్తిత్వం నిలుపుకొంటారా? ఆ రోజైనా మీ బానిస బ్రతుకునుండి బయటపడగలరా? లేక భర్త కదాని క్షమించి వదిలేస్తారా?

దారుణమైన అలాంటి మనుషుల నడుమ మసిలే ఆ వ్యక్తి తిరిగి మీతో కాపురం చేస్తున్నాడంటేనే శరీరం గగుర్పొడుస్తుంది. ఓ మంచి వ్యక్తికి ఎందుకీ శాపం?!

ఈ లేఖ చూసి ఉద్రేకపడి ఆయన్ను ఏమో మో అనటం కాదు. బట్టలు సర్దుకొని పుట్టింటికి పోవటం కాదు. నా సవాలు తెలుసుకోండి. అతని పతనమయిన జీవితాన్ని కళ్ళారా చూడండి. మీరు యదార్థాలను ఋజువు చేసుకోండి. అప్పుడు మాత్రమే మీరో నిర్ణయానికి రాగలరు. ప్రస్తుతానికి ఇంతకంటే రాయదలచుకోలేదు.

మీ శ్రేయస్సు కోర్తూ...."

క్రింద సంతకం లేదు.

"అద్భుతం!" అన్నాడు వర్మ.

రామారావు చిరునవ్వు నవ్వాడు.

"ఇది ఎప్పుడు పంపిస్తున్నావ్."

"సరైన సమయంలో."

"ఈ రకంగా జరుగుతుందని అతనూహించడు. జీవితంలో తిరుగులేని దెబ్బ ఇది."

"అవును. వాడు ఇంకేదైనా రూట్లో వస్తే....అదే నామీద దాడిచేయాలనుకుంటే అందుకు నేనుకూడా సిద్ధంగా ఉన్నాను."

"ఎలా?"

"ఏసిడ్ పొయ్యటం నాకూ వచ్చు" అన్నాడు రామారావు గంభీరంగా.

అతనిలో ఇంత పగ దాగుందని మొదటిసారి గుర్తించాడు వర్మ.

## 9

"ఊరకరారు మహాత్ములు" అన్నాడు శివాన్ని చూస్తూ పున్నారావు.

"కొంచెం పనుండి వచ్చాను" అన్నాడు శివం.

"మాట్లాడుకుందాం రండి" అంటూ తన గదిలోకి తీసుకెళ్ళాడు.

"మీకు తెలుసుగా, మా మేనేజర్ రామారావు ఆ నడుమ నామీద రిపోర్టు రాసి నా భవిష్యత్ చెడగొట్టా లనుకున్నాడు" అన్నాడు శివం లోపలికి వెళ్ళాక.

"అవునవును. అసలేమిటి గొడవ."

"ఖచ్చితంగా చెప్పాలంటే వేరే యే శత్రుత్వంలేదు. మన కులంవారంటే ఆయనకు ద్వేషం. అసలు తగాదా అదే. మనం పైకి రావటాన్ని అతనేమాత్రం సహించ లేడు. ఇది కుల తగాదా తప్పించి మరొకటికాదు."

పున్నారావు తన కులానికి చెందిన ఓ సంఘానికి బాధ్యత వహిస్తున్న విషయం శివానికి తెలుసు.

"అయితే ఏం చేద్దామని."

"సి.టి.ఓ. గారు మా అంతులవుతారు."

"ఎవరు రాఘునాధంగారా?"

"అవును."

"అలాగా" అన్నాడు సంతోషంగా.

"ఆయనకికూడా ఈ విషయం చెప్పాను. ఎంతో బాధపడ్డారు. మనం ఐకమత్యంగా లేకపోవటంవల్లనేగా ఇలాంటి వారంతా మనమీద దాడిచేస్తున్నారు, అంటూ బాధపడ్డారు."

పున్నారావులో రక్తం వేగంగా ప్రసరించసాగింది.

"నిజమే కదా" అన్నాడు.

"అందుకే దెబ్బకు దెబ్బ తీయాలని."

"తియ్యాల్సిందే" అన్నాడు పున్నారావు పట్టు దలగా.

రామనాధంగారితో శాబోయే పరిచయాన్ని తలచు

కాని మరింతగా పొంగిపోయాడు.

"మీరంటే అతనికి బాగా నమ్మకం గదా. మనం ఎ.సి.బి. వాళ్ళకు రిపోర్టు చేద్దాం. మీ దగ్గర లంచం తీసుకుంటుండగా ఆయనను పట్టుకుంటారు—"

పున్నారావు కొంచెంసేపు నిశ్శబ్దంగా ఉండిపోయాడు.

"మీరు యేమాలోచిస్తున్నారో నాకు తెలియదు. జాలి వాడికేం లేదు. ఆ వలపు నా కొడుకులే అంత అన్నాడుట. తెల్లారితే నే యెవరి దగ్గర వాడు చెయ్యి చాచేది. మరా కూతలేటి? ఆలోచించండి. మీ ఇష్టం. మన వాళ్ళనుకుంటే హెల్ప్ చెయ్యండి. అసలు కొడుకుని యెంతో కాలం ఇక్కడ ఉంచరు."

"అది కాదండి. ఇంత జరిగాక ఇంకా వెనకడుగెందుకు? కాల్తీని లేపేస్తే పోలా?" అన్నాడు తాపీగా.

మొట్టమొదటిసారిగా షాక్ తిన్నాడు శివం.

"మనవాళ్ళకి చెబితే అయిదు నిమిషాలు. ఎవరెందుకు కొట్టారో కూడా అర్థంకాదు."

"కానీ, అనుమానం నా మీదికొస్తుంది. ఇలా అయితే లంచం తీసుకుంటుండగా దొరికినట్లవుతుంది. పరువూ పోతుంది. మన పని అవుతుంది."

"అలా చేద్దామంటారా" అన్నాడు పున్నారావు.

"అవును."

"సరే ఎ సి.బి లో మనోళ్ళాయనున్నాడు. వాడు కేసు బుక్ చేస్తే తిరుగు ఉండదు. నేను మాట్లాడుతాను."

శివానికి అంతులేనంత సంతోషం కలిగింది.

"నేను అంకుల్ కి ఈ విషయం చెబుతాను."

"ఆయనకో రోజు గ్రాండ్ పార్టీ ఇద్దాం. ఈ పని సక్సెస్ అయ్యాక" అన్నాడు పున్నారావు.

శివానికి యేలాంటి సందేహాలు లేకుండా ఓ విషయం స్పష్టమైపోయింది. ఈ సమాజంలో కులం లోతుల్లోకి చొచ్చుకుపోయింది! పున్నారావు బలహీనతను తనకి అనుకూలంగా మలుచుకోగలిగాడు.

ఆ ఆనందంలోనే వేగంగా సైకిల్ తొక్కుతున్నాడు. ఎవరో పిలిచినట్లనిపించింది.

వెనక్కి తిరిగాడు. సైలెక్స్ చీర! దగ్గరకొచ్చింది.

"ఏం సారూ....కనపట్టంలేదు."

"పనుల్లో తిరుగుతున్నా."

"ఇంకా జీతాలు రాలేదా?"

"వచ్చాయి. ఏవో ఖర్చులు. ఈ నెల్లో తప్పదు."

"ఇదికూడా కథేనా?"

"నీమీద ఒట్టు."

"చూస్తాగా."

"ఏమి సంగతులు?"

"ఏం లేదుగానీ...." అంటూ ఆగింది.

"ఏంటో చెప్పు?"

"నీకెందుకు చెప్పాలా అని!'

"అదేమిటి అలా అంటావ్___""

"నాకు తెలిసిన ఓ పిల్లుంది."

"భలేదానివే. ఈ విషయం చెప్పనంటావ్,"

"పనిపిల్ల."

"ఎక్కడుంది?"

"మా ఊర్లో_"

"సర్లే" చప్పరించాడు.

"నా దగ్గరకొస్తుంది. లడ్డులాంటి పిల్ల."

"నిజంగానా."

"కానీ....నువ్వు మరీ కష్టపడతావు."

"ఛ ఊరుకో. రేపు ఫస్టుకి చూడు."

"నువ్వు అబద్ధం చెప్పినా నమ్ముతున్నా."

"ఛఛ అదేం లేదు. ఏవో ఖర్చులు. ఈసారి జీతం తీసుకోగానే ముందు మీ ఇంటికే రావటం."

"సర్లే. రాగానే కబురుచేస్తాను."

# 10

ఆఫీస్ గదిలో రామారావు కెదురుగా కూర్చున్నాడు పున్నారావు. రామారావు మొఖం యెందుకో అప్రసన్నంగా వుంది.

"ఏమిటలా వున్నారు" అన్నాడు పున్నారావు.

"ఏం చేస్తాం చెప్పండి. మా వుద్యోగాలెంత? మేమెంత? ఇంటి దగ్గర టి.వి. కావాలంటూ గొడవ. చెబితే అర్థం చేసుకోవాలి. ఏమైనా వ్యాపారం నయం. ఏది కావాలంటే అది కొనుక్కోవచ్చు."

"పోనీ—మీరుకూడా ఓ వ్యాపారం ప్రారంభించండి."

"మీకేమిటి చెబుతారు. కేపిటల్ కావద్దూ—"

"దాందేముంది. అదే వస్తుంది."

"ఎక్కడనుండి. వెధవది టి.వి. కొనటం మనవల్ల కావటంలేదు. ఇంట్లో రభస."

"అలా అయితే ఓ పని చెయ్యండి. ఎంతకావాలో తీసుకోండి."

"అప్పతీర్చొద్దూ" అన్నాడు రామారావు. అప్పటికే అతని కళ్ళు మెరిశాయి.

"తీరుద్దురుగాని లెండి. మీకు వీలయినప్పుడు ఎంతుంటే అంతివ్వండి" అన్నాడు పున్నారావు నవ్వుతూ.

"మీలాంటి పార్టీ ఉంటే మాకు రోజూ పండుగే."

"ఏదో మీ దయ" అంటూ జేబులోనుండి డబ్బు తీశాడు. లెక్కపెడుతూ అడిగాడు, "మూడు చాలా."

"ఇంకెందుకు. బ్లాకండ్ వైట్ తీసుకుంటా!"

"ఇది వైటెనడ్ డోయ్. ఇంద—" అందించాడు.

రామారావ్ అంగుళీని టేబుల్ సొరుగులో వేశాడు;

"లెక్కపెట్టలేను" అన్నాడు పున్నారావు.

"భలేవారే అసలింకో జోక్ తెలుసా? మా మిత్రుడొకాయన చెప్పాడు. ఎవరి దగ్గర్నుండి క్యాష్ ఇలా తీసుకోకూడదని. కవర్ లో పెట్టి మాత్రమే తీసుకొమ్మని-" అన్నాడు.

"ఎక్స్క్యూజ్ మీ! ఐయామ్ వి. సి. రావ్, ఫ్రమ్ ఎ.సి బి. మిమ్మల్ని చెక్ చెయ్యాలి" తన ఐడెంటిటీ కార్డు చూపిస్తూ అన్నాడు వచ్చినతను.

అంతలోనే మరో ఇద్దరు వచ్చారు.

"ఎ....ఎ....ఎందుకు?" రామారావు తడబడ్డాడు.

వారేం మాట్లాడకుండా వెతకటం ప్రారంభించారు.

టేబుల్ సొరుగులో డబ్బు దొరికింది.

"ఇవేమిటి?"

"అవి....అవి...."

"ఇవి మేం మార్కు చేసిచ్చిన నోట్లు!"

"ఆయన అప్పుగా ఇచ్చారు. పున్నారావుగారూ! చె.... చెప్పండి."

"వీటికోసం నా ప్రాణాలు తీస్తున్నాడండి" అన్నాడు పున్నారావు.

"మోసం!" అరిచాడు రామారావు.

"యూ ఆర్ అండర్ అరెస్టు" గాల్లో తేలివచ్చాయా మాటలు.

• • •

శివం హుషారుగా అడుగు పెట్టాడు.

ఎదురయింది హైలెక్స్ చీర!

"ఏం డార్లింగ్ ఏమయింది?"

"వచ్చింది—"

"ఎక్కడ?"

"అంత తొందరేందుకు? మరోసారి చెబుతున్నా. అది పసిపిల్ల. జాగ్రత్త!"

"భలేదానివే!" అంటూ బుగ్గమీద చిటికె వేసి వెళ్ళాడు.

లోపల ఓ అమ్మాయి ఆ వైపు తిరిగి నిలబడి ఉంది. శివం అప్పటికే ఉద్రేకంలో వున్నాడు. దగ్గరకు వెళ్ళి తనవైపు తిప్పాడు.

ఒక్కసారి నిరాశ కలిగింది.

ఆ అమ్మాయి లడ్డు కాదు—కనీసం చాక్లెట్ కూడా కాదు.

కానీ స్త్రీ! ఎవరయితే యేం!

ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

అప్పుడు తలుపుమీద శబ్దం....

"మళ్ళేమయింది....?" విసుక్కుంటూ తలుపు తెరిచాడు.

చాచి మొఖాన కొట్టినట్లయింది. ఎదురుగా పోలీసులు!

వారి చేతిలో సంకెళ్ళు!

ఏం జరుగుతుందో అర్థమయ్యేలోపు చేతులకు బేడీలు పడ్డాయి.

"ఏమిటిది?" అనబోయాడు:

"నడు వెహే" ముందుకు నెట్టారు.

క్రింద పడబోతూ నిలదొక్కుకొన్నాడు.

కోపంగా వెనక్కి తిరగబోయాడు.

కళ్ళముందో మెరుపు!

ఎదురుగా—

రక్తవర్ణం దాల్చిన కళ్ళతో ఆమె!

నిజంగా తన భార్య!!—

**ముగింపు:** రివెంజ్ తీసుకోవటంలో ఇద్దరూ మరిచిపోయిన అంశం ఒకటుంది. ఎదుటివారి వివరాలు సేకరించాలనే ఆరాటం తప్పించి—తమలో ఏ అంశం వినియోగించుకోగలరో ఊహించకపోవటం!

'రివెంజ్' ఎప్పుడూ విషాదకరంగానే ముగుస్తుంది.

—:అయిపోయింది:—

సీరియల్



• కొమ్మిగ్రీం అచ్చారావు

(గత సంచిక తరువాయి)

చిరుత పులివల్ల తన ప్రాణాలకు ప్రమాదమని యింత సేపు అరచేత ప్రాణాలు పెట్టుకొని గడిపింది. కాని గండం గట్టెక్కింది. కాని, మృత్యువు తన కోరల్ని చాచుకొని అగ్నిరూపంలో వచ్చేస్తోంది!

సౌమ్య చకచక చెట్టు దిగింది.

మండిపోతున్న చెట్ల వెలుగుల్లో అడవిలోకి దార్లు స్పష్టంగా కనిపిస్తూన్నాయి. అంతక్రితం ఆటవికులు అటుగా వెళ్ళినచోటు స్పష్టంగానే కనిపిస్తోంది.

సౌమ్య ఓసారి గూడెం వైపు చూసింది. నిజానికి తను వెళ్ళాల్సింది ముందుకు కాదు. గూడెం దిక్కుగా— వెనక్కు. కాని, అక్కడంతా మంటలతో దహించుకు పోతోంది. మంటలు యింకా వ్యాపించని వ్యతిరేక దిశలోనే తను పరుగెత్తి ప్రాణాలు కాపాడుకోవాలి!

సౌమ్య పరుగందుకొన్నది.

దూ రం గా కొండగుహలాంటిదేదో కనివించింది.

అక్కడికి అడవి అంతమై సమతల ప్రదేశం ప్రారంభ మైంది. అయితే అది గుహలో అంతమై మళ్ళీ చెట్లు, గుట్టలు చుట్టూ ఆవరించుకున్నాయి. మంటలు అడవి నంతా దహించినా ఆ గుహదాకా రావు.

సౌమ్య ప్రస్తుతానికి ఆ కొండ గుహలో గడిపెయ్యా లని నిర్ణయించుకున్నది.

లోపలికి అడుగు పెడ్తూండగా ఆమెకి అకస్మాత్తుగా అనుమానం వచ్చింది. ఆ కొండ గుహలో యేమైనా క్రూరమృగాలు నివాసముండటం లేదు కదా!

ఆమె అనుమానాన్ని నిజం చేస్తూ గుహలోపల్నుంచి గుర్రుమన్న శబ్దం గుండెల దదరగొడ్తూ విన్పించింది.

• • •

విషకన్య కొద్దినిమిషాలేదో తీవ్రాలోచనలో పడి పోయింది.

పక్కన నవీన్ అనిమితంగా కదులున్నాడు. ఆలో చనలతో సమయం వ్యర్థం చేయుటానికతను సుముఖంగా లేడు. అవతల సౌమ్య ఎలాంటి ప్రమాదంలో చిక్కు కున్నదో, యే క్రూరమృగాల వాతపడిదో తెలీదు. ఎలాగో యీ మూర్ఖుల బంధనాలనుంచి తప్పించుకొన్నది గాని, యీ అర్ధరాత్రి సమయంలో ఎక్కడకు పోగలదు? ఎలా ప్రాణాలు కాపాడుకో గలదు.

నవీన్ ఆ క్షణంలో విషకన్యమీద కోపం తెచ్చు కున్నాడు. ఆమె మూలంగానే సౌమ్య తను విడి పోయారు. లేకుంటే యీ పాటికి అడవినుంచి తప్పించు కుని బయటపడి వుండేవారు. విషకన్య స్వార్థానికి తమను

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల ౫ వ తేదీలోపు మాకూ చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా 'రిజిష్టరు పోస్టు'లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జులై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్ధ సంవత్సర చందా రు. 78/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించ నవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. పోస్టులో పోయే సమస్య ఎంత మాత్రం లేదు. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి.

ఉపయోగించుకుంటున్నది....

అంతలోనే ఆమెను గురించి అలా ఆలోచిస్తున్నందుకు సిగ్గుపడ్డాడు నవీన్. అసలు ఆమె ఎప్పటికప్పుడు తమని ప్రమాదాలనుంచి రక్షించి వుండకపోతే యేనాడో తమ చరిత్ర ముగిసిపోయుండేది. సింగడినుంచి రక్షించటానికి తన అనుచరుడైన సర్పాన్ని వినియోగించింది. బీరేంద్ర నుంచి, ఆ తదుపరి ఎదురైన ప్రమాదాలనుంచి చింపాంజీని ఉపయోగించి రక్షించింది. అందులో ఆమె స్వార్థం వున్నా, అది తమకే ఎక్కువగా ఉపయోగపడింది.

తను లేకపోయినా ఆమె తన ప్రతీకారం చెల్లించుకో గలదు. కాని ఆమె లేకుంటే తామిద్దరు బతికి వుండేవారు కాదు! నవీన్ మనసు విషకన్యపట్ల కృతజ్ఞతతో నిండి పోయింది.

సౌమ్య కనిపించకుండా పోయినందుకు తనకన్నకూడా ఆమె ఎక్కువ బాధపడుతోంది. తన ప్రతీకారం విషయం కూడా మరచి, ఆమెను వెతకటానికి ముందు ప్రాధాన్యత నిచ్చింది.

తన ప్రాణంపోయినా, ఆమెకు సహాయపడాలి! ఆమె ప్రతీకారం తీర్చుకోవటానికి తన శక్తివంచన లేకుండా కృషి చేయ్యాలి. ఆమె తల్లిదండ్రుల ఆత్మలకు శాంతి కలగ చెయ్యాలి.

నవీన్ లో నూతనోత్సాహం వెల్లుబికింది.

"సారీ మిస్టర్ నవీన్. మిమ్మల్ని యిబ్బంది పెడుతున్నందుకు క్షమించండి. నా కంఠంలో ప్రాణమున్నంతవరకు మీ సౌమ్యకేలాంటి ఆపదరాదు. సురక్షితంగా మీ కప్పగిస్తాను" అన్నది విషకన్య.

తన మనసులో చెలరేగుతున్న ఆలోచనల్ని ఆమె పసి

కట్టినందుకు సిగ్గుపడ్డాడు నవీన్. అంతేకాదు, మొదట్నుంచీ ఏకవచనంలోనే మాట్లాడుతూ వచ్చిన విషకన్య యిప్పుడు తనని మన్నించి బహువచనంలో మాట్లాడటం ఆమె ఉన్నత సంస్కారాన్ని సూచిస్తూన్నా, ఎందుకో యిబ్బందిగా ఫీలయ్యాడు. వెంటనే ఆమెతో చెప్పేశాడు.

"నన్ను గౌరవ వాచకంతో మన్నించొద్దు. మన దూరం పెరిగిపోయినట్టనిపిస్తోంది. నేను కూడా 'మీరు' అని మన్నించాల్సి వుంటుంది" అన్నాడు నవీన్.

"ఒద్దొద్దు. నువ్వే అనే పిలుస్తాను. సరేనా?" నవ్వేసింది విషకన్య. ఆమె ఆ క్షణంలో తన కంటే ఆత్మీయురాలిలాగా కనిపించింది నవీన్‌కి.

తనూ నవ్వి, "నా ఆలోచన కేవలం సౌమ్య గురించే కాదు; నీ గురించి కూడా! మా యిద్దరికీ అడుగడుగునా సాయపడ్డ నీకు ఏమిచ్చి ఋణం తీర్చుకోగలనా అని యోచిస్తున్నాను" అన్నాడు.

"ఋణాలు, కృతజ్ఞతలు తరవాత. ఓ పక్క అడవి తగలబడిపోతోంది. ఉగ్రనాగుగాని తక్కిన సర్పాలుగాని లోపలికి ప్రవేశించటం క్షేమకరం కాదు. మన కోసం ఉగ్రనాగు ప్రాణాలను పణంగా పెట్టి లోపలకు—సౌమ్య వెళ్ళిన దిశలో—చొచ్చుకుపోగలిగాడు.

కాని యిప్పటికే అడవంతా నేలబారున తగలబడుతోంది. పచ్చి మొక్కలు కూడా కాలుతున్నాయి. ఉగ్రనాగు మంటల్లో ఆహుతయిపోకూడదు. ఉగ్రనాగు ఎలాగూ దారి చూపించింది గాబట్టి మనిద్దరం ఆ బాట వెంబడి పోయి సౌమ్య కోసం వెదుకుదాం, సరేనా?" అన్నది విషకన్య.

(సశేషం)

